# విద్యా వైద్యశాస్త్ర కళారంగాలు మానవతా విలువలు

యువ భారతి రజతోత్సవ
సదస్సు పత్రాలు

యువ భారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనాలు
తిలక్‌రోడ్, హైదరాబాదు - 500 001.

VIDYA VYDYASHASTRA KALARANGALU - MANAVATHA VILUVALU

YUVA BHARATHI, Silver Jubilee Seminar Papers
Published by YUVA BHARATHI, literary and cultural organisation, Tilak Road, Hyderabad - 500 001.



యువభారతి రజతోత్సవ సదస్సు పత్రాల ప్రచురణ

ప్రచురణ సంఖ్య : 146

ప్రథమ ముద్రణ : మార్చి, 1994

ప్రతులు : 1000

ముఖచిత్రాలంకరణ : శ్రీ శీలా వీర్రాజు

వెల : రూ. 25-00

ప్రతులకు :

యువ భారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు,
తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001

ముద్రణ :

పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,
1-1-517/B/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాదు - 500 380
ఫోన్లు : 611413, 600457

ముఖచిత్ర ముద్రణ :

విప్లా ప్రింటర్స్ ప్రైవేట్ లిమిటెడ్,
శంకరమఠం దగ్గర, నల్లకుంట,
హైదరాబాదు - 500 044.
ఫోన్ : 666242.

# మూడు పదుల యువభారతి

## మూడు ఆశయాలు :

సమాజ శ్రేయస్సుకు సమున్నత ప్రమాణాలు గల సాహిత్యం, ఉత్తమ మూల్యాలను పెంచి పోషించ గల సహృదయ లోకం అవసరమని గుర్తించి ఆ రెండింటినీ బలంగా పెంపొందించే సాహిత్య సాంస్కృతిక సామాజిక చైతన్యాన్ని కలిగించటానికి యువభారతి ఉద్యమిస్తున్నది.

సాహిత్యం ఎటువంటి సాహిత్యేతర శక్తుల అజమాయిషీకి లోనుగాకుండా, స్వతంత్ర వ్యక్తిత్వంతో సాత్త్విక శక్తిగా రూపొందాలనీ, అటువంటి సాహిత్యాన్ని సృష్టించే రచయితలు ఏ కాలం వారైనా, వారి కృషినీ, సందేశాన్నీ సామాన్య ప్రజానీకానికి అందేటట్లు వివిధ ప్రచురణలద్వారా, కార్యక్రమాల ద్వారా యువభారతి యత్నిస్తోంది. అంటే - రాజకీయ కాలుష్యం లేని సాహిత్యోద్యమాన్ని యువభారతి అవిశ్రాంతంగా సాగిస్తోంది!

'చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది' - అనే లక్ష్యంతో సమాజంలో వ్యష్టిగా, సమష్టిగా శాంతియుత సహజీవనాన్నీ, ప్రజాస్వామ్య విధానాన్నీ, నిర్మాణాత్మక కార్యశీలాన్నీ, మానవత్వపు విలువలతో కూడిన సేవాభావాన్నీ ఆచరించి చూపిస్తోంది యువభారతి!

## సాహితీసంస్థగా ముందడుగు :

రాజకీయాల స్వార్థకాలుష్యాలకు అతీతంగా ఉండగలిగే విశ్వజనీనమైన సాహిత్య స్పృహను సమాజంలో జాగృతం చేసి, తెలుగు సాహిత్యాభిమానాన్ని ఇంటింటా జ్యోతిలా వెలిగించాలనే ప్రయత్నంతో యువభారతి ముప్పైయేళ్ళుగా ఉద్యమాన్ని సాగిస్తోంది. సమాజంలో ఉత్తమ సాహిత్యం పుట్టటం ఒక వంతు; దానిని ప్రజల మధ్యకు తీసుకొనిపోయే ప్రయత్నం మరొక వంతు. పొలం దున్నే రైతులు, రాట్నం తిప్పే పల్లెటూరి పడతులు, మధ్యతరగతి ప్రజలు, యువతీ యువకులు, విద్యార్థినీ విద్యార్థులు, ఫ్యాక్టరీ కూలీలు, ఉద్యోగులు,

ఉద్యోగినులు - ఇలా చదువుకున్న ప్రతివారూ తెలుగు సాహిత్యంలో వెలువడిన- అంటే వారి మాతృభాషలో వెలువడిన - సాహిత్యం చదవాలి. లేదా, కనీసం ఆ సాహిత్యం గురించి పరిచయం చేసుకోవాలి. అప్పుడే తెలుగుసాహితి సమాజంలో సజీవంగా ప్రవహించటానికి వీలుంటుంది. ఒక జాతిలో రచయిత(త్రు)లు పుట్టటం ఎంత గొప్పో, సహృదయులు అధికశాతంలో అభివృద్ధి చెందటం కూడా అంతే గొప్ప. సాహిత్యంలోని ఉత్తమ విలువలను గుర్తించి, గౌరవించే సహృదయ లోకాన్ని సాహితీ వాతావరణాన్ని సమాజంలో నిర్మించటంలో సాహితీ సాంస్కృతిక సంస్థల పాత్ర విశేషంగా ఉంది. ఆ బాధ్యతను గుర్తించి యువ భారతి ఇన్నాళ్ళుగా సాహిత్యోద్యమాన్ని సాగిస్తున్నది. ప్రజల హృదయాలలో తన ముద్రను పదిలంగా వేసుకున్నది.

## యువభారతి జీవితం ఒక సాహిత్యోద్యమం :

యువభారతి 1963 సం॥ విజయదశమినాడు పుట్టింది. మొదటి రెండేళ్లూ రూపుదిద్దుకున్నది. ప్రతి నెలా మొదటి, మూడవ ఆదివారాలలో సమావేశమై యువభారతీయులు మూడుగంటలసేపు మానవ సమగ్ర వ్యక్తిత్వ నిర్మాణానికి తోడ్పడే కార్యక్రమాలను నిర్వహించుకునేవారు. వక్తృత్వాన్నీ, రచనా పాటవాన్నీ, ఆలోచనాశక్తినీ, అధ్యయన శీలాన్నీ, ఋడితిస్ఫూర్తినీ అలవరచే క్లుప్త గోష్ఠి, పుస్తకచర్చ, కవితాపఠనం, సమాలోచనం మొదలైన అంశాలను చైతన్యవంతంగా నిర్వహించుకునేవారు. అప్పటి సమావేశాలన్నీ సాహితీ శిక్షణ శిబిరాలుగా ఉండేవి. 1965 విజయదశమి నాటికి యువభారతి ఒక సమగ్ర రూపం తాల్చింది.

1965-70 సంవత్సరాల మధ్య యువభారతి తన ఆశయాలకు అనుగుణంగా సాహిత్య కార్యక్రమాలను చేపట్టి ప్రజల మధ్యకు నడిచింది. బలమైన ప్రయోగాలను చిత్తశుద్ధితో చేసి ప్రజల మన్ననలను పొందటం ప్రారంభించింది. మహిళా విభాగ కార్యక్రమాల ప్రారంభం, సైక్లోస్టైల్డు పత్రిక వెలువరించటం (దాదాపు వెయ్యి ప్రతులు చెల్లేవి) ముఖ్యమైన అంశాలు. యువభారతి ప్రచురణలు, సదస్సులు ఒక ప్రత్యేకతతో తెలుగువారిని ఆకర్షించటం ఆరంభించాయి. అనుముల కృష్ణమూర్తిగారి 'సరస్వతీ సాక్షాత్కారం', కాళోజీగారి 'జీవనగీత',

యువభారతీయుల కవితా సంకలనం 'పిచికలు' తక్కువ ధరకు ప్రచురణ పూర్వ విరాళ పద్ధతిలో వెలువరించిన తొలి ప్రచురణలు. 1970 లో 'మారుతున్న విలువలు: రచయితల బాధ్యతలు' అనే అంశం మీద నిర్వహించిన గోష్ఠి, దానిని 'రచన'గా ప్రచురించిన అనుభవం యువభారతికి కీర్తిప్రతిష్ఠలతోపాటు ఒక ప్రామాణికమైన సాహిత్య సంస్థకు వచ్చే గుర్తింపును గూడా తెచ్చిపెట్టాయి.

1971 - 1985 మధ్య యువభారతి సమాజంలో ఒక అపూర్వ సాహిత్య చైతన్యాన్ని కలిగించింది. యువభారతి వార్షికోత్సవాల 'లహరి ఉపన్యాస పరంపరలు' ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారిచ్చిన 'కావ్యలహరి' తో మొదలయ్యాయి. 1971 లో వేలమంది సాహితీ సభలకు రావటం, సాహిత్యపు విలువలపట్ల సదవగాహన సమాజంలో ఏర్పడటం యువభారతి సాహిత్యోద్యమం కలిగించిన విలువైన చైతన్యం. కావ్యలహరి, కవితాలహరి, చైతన్యలహరి, వికాసలహరి, రామాయణలహరి, నవోదయలహరి, నవ్యసాహితీలహరి, ప్రతిభా లహరి, ఆలోచనాలహరి, సంస్కృత సాహిత్యలహరి, జగద్గురు సాహితీలహరి మొదలైన 'లహరి' ప్రచురణలు సాహితీలోకంలో మన్ననల నందుకున్నాయి.

భారత స్వాతంత్ర్య రజతోత్సవాలను పురస్కరించుకొని యువభారతి ప్రచురించిన నూరు వ్యాసాల 'మహతి' తెలుగు సాహితీ పరులలో ఒక విలువైన గౌరవాన్ని పొందింది; పరిశోధకుల మన్ననల నందుకున్నది. తెలుగు నవలలను గురించి ఇంగ్లీషులో చెప్పటానికి ప్రయత్నించిన Telugu Novel మంచి ప్రయోగంగా ఆదరణ పొందింది. తెలుగులో కవుల కవితా వైభవాలను ప్రచురించే యువభారతి రచనలు ప్రాచీనాధునికాంధ్ర కవులను, భారతీయ భాషా కవులను సరళంగా వ్యాఖ్యానించి చెప్పాయి; చెపుతున్నాయి. యువభారతి ప్రచురించే ప్రతి ప్రచురణా ఆయా సమయాల్లో సమాజంలో కలిగించవలసిన సాహితీ స్పృహను దృష్టిలో ఉంచుకొని రూపొందించేదే. కాలగతిలో అవిచ్ఛిన్నంగా సాగవలసిన సాహితీ రసికత్వాన్ని లహరిగా ప్రవహించేటట్లు కార్యక్రమాలను సాగించటం యువభారతి ప్రవృత్తి!

1991 - 1992 లో యువభారతి రజతోత్సవాలను జరుపుకున్నది. పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు 'తెలుగు కవిత : లయాత్మకత' అనే

అంశం మీద రజతోత్సవ ఉపన్యాస లహరిని అందించారు. అది గ్రంథరూపంగా వెలువడింది. నెలనెలా మొదటి ఆదివారం సాయంకాలం 5.30 గం॥లకు జరిగే "సమాలోచనం" సమావేశాలన్నీ రజతోత్సవాలలో భాగాలుగా మలచబడ్డాయి. 'ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం' (1980 - 1990), 'పాతికేళ్ళ పత్రికా రచన' (1965-1990), యువభారతి రజతోత్సవ సంచిక 'వెండి వెలుగులు', 'అనుభూతి', 'అమృత రాజీవం' కవితా సంపుటాలు రజతోత్సవ ప్రచురణలుగా వచ్చాయి. రజతోత్సవాలలో భాగంగా జరిగిన సదస్సులలోని ఉపన్యాసవ్యాసాల సంకలనాలను 30వ వార్షికోత్సవాల ప్రచురణలుగా వెలువరించటం జరుగుతున్నది. ఆలోచనలకు అక్షరాకృతి నివ్వటం యువభారతి సాహితీవ్రతం.

యువ భారతి రజతోత్సవ సదస్సులలో పాల్గొని తమ ప్రసంగ వ్యాసాలను ప్రచురించడానికి అంగీకరించిన వక్తలు శ్రీ పాతూరి ప్రసన్నం గారికి, డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం గారికి, శ్రీ తెన్నేటి పూర్ణచంద్రరావు గారికి, శ్రీమతి అడివి సూర్యకుమారి గారికి, డాక్టర్ కె. వి. కృష్ణకుమారి గారికి, డాక్టర్ సురవరం పుష్పలత గారికి, శ్రీ పి. నాగరాజు గారికి, శ్రీ కె. బి. గోపాలం గారికి కృతజ్ఞతాభివందనాలు. యువభారతిని ప్రోత్సహిస్తున్న 'సాహితీ మిత్రు'లకు, 'భారతీ మిత్రు' లకు, 'భారతీ భూషణు'లకు, ప్రకటనదారులకు, పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్‌కు, విప్లాప్రింటర్స్‌కు మా ధన్యవాదాలు :

వార్షికోత్సవ సభలను స్పాన్సర్స్ చేసి, ప్రకటనల నిచ్చి యువభారతికి చేయూతనిచ్చిన చిన్న మొత్తాల పొదుపు సంస్థ కమీషనరుగారికి మా ప్రత్యేక ధన్యవాదాలు!

యువభారతి నభినూనించే సాహితీలోకానికి మా అభివందన చందనాలు!

హైదరాబాదు,
6-3 1994.

జి. వి. సుబ్రహ్మణ్యం
అధ్యక్షుడు.

# విషయ సూచిక

# ఆధునిక జీవితంలో మానవత్వపు విలువలు

—పొతూరి ప్రసన్నం

రోం మహానగరం తగలబడిపోతూ వుంటే "నీరో" మహారాజు ఫిడేలు వాయించుకుంటున్నాడట. రోం మహానగరం ఒక మహానాగరికతకు ప్రతీక!

ఆధునిక నాగరికత, ఆధునిక జీవితం మహోన్నత స్థాయిని అందు కున్నాయని ఎవరైనా ఈనాడు వర్ణిస్తే అది పాక్షిక సత్యమే అవుతుంది! మనం కూడా ఈనాడు ఈ ఆధునిక జీవితాన్ని కనుక అదే రీతిగా కీర్తిస్తూ కూర్చుంటే మనకూ "నీరో" మహారాజుకూ తేడా వుండదు. మానవుని మేధస్సును మహోన్నత శిఖరాలకు కొనిపోతున్న ఈ శతాబ్దంలోనే, మానవుని పతనాన్ని కూడా, మానవత్వం యొక్క పతనాన్ని కూడా మనం చూడవలసి వస్తోంది. అదే నేటి విషాదం! సైన్సు, టెక్నాలజీల ప్రభావం ఎంత అధికంగా విస్తరిస్తోందో మనిషిలో గల స్వార్థం, సంకుచితత్త్వములు కూడా అంతగా పెచ్చు పెరిగి పోవటమే ఈ విషాదానికి కారణం. చివరకు మనిషి మనిషిగా బ్రతకలేని పరిస్థి తులు కలిగాయి. సంపద వున్నా, విజ్ఞానం వున్నా, అధికారం వున్నా, అన్ని హంగులూ వున్నా కూడా మనిషిలో మానవత్వం మాత్రం నానాటికీ హరించి పోతోంది! అందుచేత మానవాభ్యుదయం కోసం చేసే ప్రణాళికలు సత్ఫలితాలను యివ్వటం లేదు. ప్రపంచ శాంతి కోసం చేసే ప్రతి వినూత్న ప్రయత్నమూ మరొక సరికొత్త అశాంతికి బీజం వేస్తోంది! దీనిని కాలవైపరీత్యంగా యెంచి "మనం చేయగలిగేది ఏదీ లేదు, కాలపురుషుడే తీర్చాలి" అనే నిరాశా దృష్టి కూడా అలముకుంటోంది!

ఈ పరిస్థితిలో ఒక మహాపురుషుడు అత్యంత ఆధునికమైన యోచనతో, ఆలోచనా విధానంతో ప్రపంచం అంతటినీ ఈనాడు ప్రభావపరుస్తున్నాడు!

అతడే శ్రీ సత్యసాయిబాబా! శ్రీ సత్యసాయివాణి పరంపరాగతమైన సంప్రదాయంలో పుట్టినా కూడా, అది సంప్రదాయానికి పునరుక్తి కాదు. "Sri Satya saibaba is a continuation of the past. but he is not a repetition of the past" అన్నారు అందుకే! "He is latest of the latest" అని అంటూరు భగవాన్ శ్రీ సత్యసాయి ఆలోచనా విధానాన్ని గుర్తించినవారు!

ఏమిటి ఈ ఆలోచనావిధానం?
ఎందుకీ ఆలోచనావిధానం?

యాంత్రిక పురోగతి, సైన్సు, సాంకేతిక శాస్త్రాల పురోగతి ద్వారా క్రమంగా మానవునిలో మానవత్వం తొలిగిపోయే పరిస్థితులు కలిగాయి! కారణం? తన తత్త్వాన్ని మనిషి విస్మరించటమే! తన ప్రకృతికి విరుద్ధంగా ప్రవర్తించుటకు! కనుక మనం చెప్పుకొనే మానవతా విలువలన్నీ అంతరించి పోవటం జరిగింది. విలుప్తమైపోతున్న ఈ విలువలను మానవునిలో పునఃప్రతిష్ఠ కావించటమే శ్రీ సత్యసాయి ఆలోచనా విధానంలోని విశిష్టత! నేటి మానవుని దుఃఖానికి, అశాంతికి, అసమానతలకూ మూలకారణాలను మన మేధావులంతా బాహ్యప్రణాళికలలో వెతుకుతూ విఫలులవుతున్నారు! కానీ ఆ మూలకారణాలు మనిషిలోని మానవతా సుగుణాల అధఃపతనంలోనే వున్నాయని శ్రీ సత్యసాయి ఆలోచనా విధానం నిరూపించింది. తిరిగి మనిషిలో మానవత్వపు విలువలను పునర్వికసింప జేసే ప్రయత్నంలో ప్రపంచ మేధావులంతా ఈ మార్గాన్నే అనుసరిస్తున్నారని సాయి సాహిత్య అధ్యయనం చేస్తే తెలుస్తుంది! ఈనాడు ప్రపంచ భాష లన్నింటిలోకీ శ్రీ సత్యసాయి సందేశాలు, సందేశాల విశ్లేషణలూ వ్యాప్తి చెందాయి.

నిజమైన ఆధునికతకు నిదర్శనం ఈనాడు శ్రీ సత్యసాయి ఆలోచనా రీతిని అలవరచుకొని జీవించటమే! సోక్రటీసు కాలంలో సోక్రటీసుకు శిష్యుణ్ణి అయినందుకు గర్విస్తున్నాను అన్నాడు ప్లాటో మహాశయుడు! వివేక నేత్రం వికసించిన ఈనాటి ప్రతి ఆధునికుడూ ఏ దేశంలోని వాడైనా, ఏ జాతివాడైనా, ఏ మతం వాడైనా, "శ్రీ సత్యసాయికి సమకాలికుడనుగా పుట్టినందుకు గర్విస్తున్నాను. అది నా జన్మాంతరాల సుకృత ఫలం" అంటున్నాడు! ఇది అతిశయోక్తికాదు. అక్షరసత్యం!

"ఎందుకీ ఆలోచనా విధానం?" అంటే పతనం చెందిన మానసిక స్థితి నుంచి, మానవత్వాన్ని ఉద్ధరించి, మానవునికి సృష్టిలో సంక్రమించిన మహోన్నతిని మరల ప్రాప్తింపజేయుటం కొరకే! శాంతి ఆనందాలనూ, సుఖసంతోషాలనూ మరల మానవ లోకానికి అందించటం కొరకే!

ఈ మేరకు ఈ వ్యాసంలో కొన్ని మౌలికమైన భావాలను సూచన ప్రాయంగానే వెలిబుచ్చటం జరుగుతుంది.

## ఆధునిక జీవితం :

Endless invention, endless experiment
Brings us knowledge of matter, but not of stillness
Knowledge of words, and ignorance of world
All our knowledge brings us nearer to ignorance
Where is the life, we have lost in living?
Where is wisdom, we have lost in knowledge?
Where is the knowledge, we have lost in information?
The cycle of heaven in twenty centuries
Brings us farther from god, and nearer to dust!

అంతంలేని పరిశోధనలూ, అంతంలేని ప్రయోగాలూ మనకు పదార్థ విజ్ఞానాన్నే యిస్తున్నాయి. కానీ, మనశ్శాంతిని కలిగించటం లేదు! మాటల్లోనే పరిజ్ఞానం పెరిగింది! ప్రపంచంపట్ల అజ్ఞానం పెరిగింది! ఎంత విజ్ఞానాన్ని పెంపొందించుకొన్నా, అజ్ఞానానికి సమీపంలోకే పోతున్నాం!

కేవలం బ్రతికితే చాలుననే ప్రయత్నంలో కోల్పోయిన జీవనం ఎక్కడ?

విజ్ఞానాన్ని సముపార్జించటంలో నష్టపడిన వివేకం ఎక్కడ?

కేవలం సమాచార సేకరణలో కోల్పోయిన విజ్ఞానం ఎక్కడ?

ఇరవై శతాబ్దాల కాలచక్రం మనల్ని స్వర్గ వలయంలోని భగవత్తత్వం నుంచి, నడిపీథిలోని ధూళిలోకి విసిరిపారేసింది!

నోబుల్ బహుమతి గ్రహీత అయిన ఆంగ్ల మహాకవి శ్రీ T. S. ఈలియట్ వ్రాసిన హృదయ విదారకమైన కవితా వాక్యాలు యివి! ఈ మాటల్లో ఆధునిక జీవితంలో నెలకొని వున్న దుస్థితి స్పష్టంగా ప్రతిబింబిస్తోంది!

ఒక ఆధునికుడు ఆవేదనతో వేసిన ప్రశ్నలకు సమాధానమే శ్రీ సత్య సాయి ఆలోచనా విధానం. అది కేవలం ఆలోచనా విధానమే కాదు- పరిష్కారం కూడా! ఆధునికతకు బిడ్డలమైన మన స్థితిని శ్రీ సత్యసాయి బాబా యిలా అంటారు :

దేహశుద్ధిలేని తెల్లని బట్టలు
భావశుద్ధిలేని దైవపూజ
పాకశుద్ధిలేని బంగారు పీటలు
వాక్కు-శుద్ధిలేని శ్లోకపఠన
నేటి నాగరికులు పాటించు పద్ధతి

ఉన్నమాట చెప్పుచున్న మాట- అంటారు శ్రీ సత్యసాయి! మనం కోల్పోయిన వివేక ఫలితంగా నష్టపోయింది మనలోని మానవత్వపు విలువలనే! తిరిగి విద్య ద్వారా ఈ విలువలు మన బాలబాలికలలోనూ, యువతరంలోనూ ప్రబోధింపబడవలెనంటూ యూనివర్శిటీ గ్రాంట్సు కమీషన్ అధినేత్రి అయిన శ్రీమతి మాధురీషాగారితో భగవాన్ శ్రీ సత్యసాయి చెప్పిన మాటలు యివి:

ధనమె దైవంబయ్యె, దర్పంబె మతమయ్యె
స్వార్థమే బుద్ధికి స్థానమయ్యె,
అహము శ్వాసంబయ్యె ఆశలందంబయ్యె,
ధర్మంబు వమ్మయ్యె ధాత్రిలోన,
దయయు హీనంబయ్యె, నయము శూన్యంబయ్యె
కపటమే జీవిత కాంతులయ్యె,
ప్రేమానురాగములే రోగాల పాలయ్యె
కామాంధులుగ జేసె కలిని చదువు,

బ్రతుకు బరువయ్యె, మతులకు గతులు తప్పె
జాగు చేసిన జగతికే గలియు నౌనా
విద్యయందున విధిగ నైతికము జేర్చి
మార్పు కలిగించి చూడుమో "మాధురీషా!"

శ్రీ సత్యసాయి విద్యావిధానంలో మానవత్వపు విలువల పోషణ కూడా ఒక అంశం అయింది! పైన చెప్పిన శ్రీ సత్యసాయి పద్యంలో ఆధునిక జీవితం లోని సగటు వ్యక్తి యొక్క ప్రతిబింబం కనబడుతోంది! ఇరవయ్యవ శతాబ్దపు అంతానికి సైన్సు, టెక్నాలజీల ప్రభావంతో మనిషిలోని మానవతా విలువలు హరించుకు పోతాయనీ, తల్లి తల్లిగా వుండదనీ, తండ్రి తండ్రిగా వుండదనీ, కుటుంబం కుటుంబంగా సామరస్యంతో బ్రతకదనీ, కాంపిటీషన్‌తో, స్పర్థతో, పరస్పర వైరుధ్యాలతో, వ్యక్తిత్వం యొక్క విచ్ఛిత్తితోనూ మానవుడు ఎంతో దుస్థితికి లోనవుతాడనీ, అటువంటి వినష్టమైన వ్యక్తిత్వం నుంచి మనిషిలో వ్యక్తిత్వం మరల పునర్నిర్మాణం కావించబడాలనీ నోబుల్ బహుమతి గ్రహీత అయిన శ్రీ ఎలగ్జిస్ క్యారల్, తమ అద్భుత రచన అయిన 'Man the unknokn' లో అంటారు! శ్రీ సత్యాసాయి బాబా వారు చేసే ప్రబోధాల ద్వారా ఈనాడు ఈ రీతిగా దిగజారిపోయిన మనుజుల్లో వ్యక్తిత్వ పునర్నిర్మాణం ప్రపంచవ్యాప్త ప్రభావం తెస్తూ, అవిర్భవిస్తోంది! వ్యక్తిత్వ పునర్నిర్మాణం అంటే మానవత్వం యొక్క పునర్నిర్మాణమే! నేటి జటిల సమస్యలకు సుకర మైన పరిష్కారం మనిషిలోనే వుంది అంటారు శ్రీ సత్యసాయి!

వ్యక్తిత్వ పునర్నిర్మాణంలో ప్రధానమైన పాత్ర వహించేది మనుజుని యొక్క, మానవ స్వభావం, తత్త్వములయొక్క శాస్త్రీయ పరిశీలనమే! దీనినే 'Science of man' అన్నారు.

"We must clearly Realise that science of man is the most difficult of all sciences.

"Modern civilisation finds itself in a difficult position because it does not suit us. It has been erected without any knowledge of our real nature.... Men of science do not know were they are going. They are guided by

chance. ....We are the victims of the backwardness of the science of life, over that of matter", అంటారు శ్రీ ఎలెగ్జిస్ క్యారెల్!

ఈనాడు భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు మానవ మనస్తత్వమును, మానవ చైతన్యవికాసమును గూర్చి అనుగ్రహించే దివ్యప్రబోధాలన్నీ "Science of man" కు సంబంధించినవే! అందుకే "The Proper study of man kind is the study of man" అంటారు బాబా.

"ఆధునిక యుగంలో అతివేగంగా అభివృద్ధి అవుతున్న సాంకేతిక విజ్ఞాన శాస్త్రములు ఒక పెద్ద పెనుగాలివలె వీచి, భౌతికమైన జీవితములో అనేకమైన మార్పులను తీసుకువచ్చినది. భౌతిక, లౌకిక వైజ్ఞానికంగా మానవాళి నేడు ఉన్నత స్థాయిని పొందినమాట నిజమే! కానీ ధార్మిక, నైతిక విలువలను కూల ద్రోసి కేవలము సుఖ సంతోష భోగభాగ్యములను ఆశించి, యంత్రములను నిర్మించుకొంటున్నామే గానీ, తిరిగి ఆ యంత్రాలకే మనము బానిసలము అవు తున్నామనే విజ్ఞానము మనలో శూన్యమై పోతున్నది. నేటి విద్యార్థులు సాంకేతిక విజ్ఞానమును సక్రమమైన మార్గములో అనుభవించుటకు తగిన కృషి చేయాలి. సాంకేతిక విజ్ఞానశాస్త్రము చెడ్డది కాదు. దానిని వినియోగించుకొనే విధానములోనే కొన్ని మార్పులు తెచ్చుకోవాలి." అంటారు భగవాన్ శ్రీ సత్యసాయి బాబా.

"ఈనాడు కేవలం Experimental research తోనే కాలమును వ్యర్థము చేస్తున్నాము. ఇది కేవలము Object (పదార్థము) ప్రధానమైనది. పరిశోధన అనేవి Subject (అంతర్దృష్టి) ప్రధానంగా జరగాలి. ఈనాటి సైన్సు ప్రపంచానికి అవసరమే! కానీ సైన్సు ఆధారాన్ని వదలి ఆధేయాన్ని మాత్రమే అనుసరించుట చేత, ఇది కేవలం అశాంతిని మాత్రమే చేకూర్చుచున్నది. మాన వుని రోగ పీడితుని కావిస్తున్నది. మానసిక వికాసం, ఆత్మ విచారణ లేకపోవటం చేత సైన్సు ప్రమాదకరంగా పరిణమిస్తున్నది. సైన్సు లోకాన్ని స్వర్గంగా మార్చ గలదన్న విశ్వాసం చాలా మందికి వుంది. కానీ స్వర్గమంటే లౌకిక భోగాను భవమా? భోగానుభవం మానవత్వాన్ని ధ్వంసం కావిస్తున్నది. మానవత్వపు విలువలను మరుగు పరుస్తున్నది. మరి సైన్సు పరిశోధనలు ఎంతవరకు సత్ఫలి తాలను యిస్తున్నట్లు? ప్రతి ప్రశ్నకూ సమాధానం యిస్తున్న విజ్ఞాన శాస్త్రం ఈ

ప్రశ్నకు సమాధానం మాత్రం సంతృప్తికరంగా యివ్వటం లేదు. శాంతిని అనుభవించవలెనంటే విజ్ఞాన శాస్త్రాన్ని సరియైన మార్గంలో ప్రవేశ పరచాలి" అంటారు బాబా!

ఈ రీతిగా Objective analysis తోపాటు Subjective analysisను శ్రీ సత్యసాయిబాబా వారు ప్రతిపాదిస్తూ, బాహ్యజగత్తుకూ, అంతర్ జగత్తుకూ ఒక సమన్వయాన్ని యేర్పరచి, తద్వారా పూర్ణ మానవత్వాన్ని ఆవిష్కరిస్తున్నారు. ఇదే "Science of man!"

కాబట్టి భౌతికమైన యంత్రాలతోపాటు మానవ శరీరం అనే యంత్రాన్ని కూడా క్రమశిక్షణతో, నియతి నియమాలతోనూ పోషించవలసిన అవసరాన్ని శ్రీ సత్యసాయిబాబా వారు గుర్తు చేస్తారు! ఆధునిక యుగంలోని ప్రగతికి లౌకిక ప్రణాళికలను మనం రూపొందిస్తూనే వున్నాం! కానీ మానవ జాతి ఆశించిన శాంతి సౌభాగ్యాలు అందటం లేదు. అందుకు శ్రీ సత్యసాయిబాబా వారు సూచించే పరిష్కారం యిదే :

"శరీరమును సంస్కరించుకోండి! జీవిత విధానమును నియమబద్ధం చేసుకోండి! అప్పుడు తప్పనిసరిగా దేశం శక్తిమంతమూ, సౌభాగ్యవంతమూ అవుతుంది. ఇది మట్టి కుండ అని విచారించకండి. అందులో మధువున్నది. విషపూరితమైన హేమ పాత్రకంటె ఈ మృణ్మయ పాత్రే మెరుగు! దేశంలో క్షేమ సౌభాగ్యాలుండవచ్చు. జీవితం నికృష్టంగా వుంటే అది శోచనీయమే!"

మానవ జీవితాన్ని గూర్చిన మౌలికమైన అవగాహనలోనే ఒక మార్పును శ్రీ సత్యసాయిబాబా వారు కలుగజేస్తున్నారు. "ఆధునిక జీవన వ్యవస్థ ఈనాటి మనిషి యొక్క మేధస్సును, బుద్ధుని, మానసిక స్థితినీ సంకుచితపరచింది. కాబట్టి మనిషిని ఈ వ్యాధి నుంచి విముక్తి పరచాలంటే మానవుని బాహ్య, ఆంతరిక ప్రపంచాన్నే మార్చివేయాల్సిన అవసరం వున్నది. ఈ రీతిగా ఆధునిక జీవన పరిస్థితులనుంచి మానవుని విముక్తపరచే ఈ మానవత్వపు పునర్నిర్మాణ కార్యక్రమం చాలా కష్టమైనదే అయినా, చాలా సుందరమయినది అవుతుంది" అన్నారు శ్రీ ఎలెగ్జిస్ క్యారెల్ "Man, the unknown"లో!

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు మన అవగాహనలో, మన ఆశయాల్లో కూడా ఒకవిధమైన ఆచరణ పూర్వకమైన మార్పును కలిగిస్తున్నారు. ఈ అవగాహన ప్రతి వ్యక్తిలోనూ కలగాలి. అందుకోసం "అర్థంకాని వేదాంతాన్ని, ఆచరణ సాధ్యంకాని శాస్త్రాలను చెప్పి ప్రయోజనం లే"దంటారు. "అందరికీ అందుబాటుగా ఉండేరీతిగా, ఆచరణకు అనువైనరీతిగా, అవలీలగా అర్థం అయ్యేరీతిగా అడుగడుగునా నిత్యకృత్యములలో నిజమైన మార్పును తేవాలి" అంటారు శ్రీ బాబా! అప్పుడే గూఢమైన, సారమైన అంతరాత్మ విషయములు అర్థం కాగలవు అంటారు శ్రీ బాబా!

"శ్రీ సత్యసాయి ప్రబోధాలూ - వ్యక్తిత్వ వికాసమూ", "శ్రీ సత్యసాయి ప్రబోధాలూ - మానవత్వపు పునర్నిర్మాణమూ", "సైన్సు - ఆధ్యాత్మికతల సమన్వయం", "పూర్ణవిద్య" "మానవతా విలువలతో కూడిన విద్యావిధానము" ఈ సందర్భంలో అధ్యయనం చేయవలసిన అంశాలు. శ్రీ సత్యసాయి ఆధ్యాత్మిక సాహిత్యంలో వీటిని గూర్చిన వివరాలు లభిస్తాయి.

## మానవజీవితం అంటే? :

మానవ జీవితానికి అత్యంత ప్రాధాన్యతనిచ్చి, జీవిత ప్రమాణాలను పెంపొందించే ప్రయత్నాన్ని నిరంతరం మనం కొనసాగిస్తూనే వున్నాం. కానీ ఈనాడు మనిషి జీవితానికే ఏ విలువా లేకుండా పోయింది. మనిషి చేసిన పదార్థాలకూ, ధనానికీ, యంత్రాలకూ విలువ పెరిగిపోతోంది.

ఈ పరిస్థితులలో మానవ జీవితానికి ఒక విశిష్టమైన అవగాహన కల్పించుతున్నారు శ్రీ సత్యసాయిబాబా! జీవనశక్తి సృష్టికర్తయొక్క విశ్వశక్తిలోని అంశమే అంటుంది భగవద్గీత! "జీవనం సర్వభూతేషు...." ఇంక మానవ జీవితంయొక్క విశిష్టతను గూర్చి వేరే చెప్పవలెనా?

ఆ దివ్యశక్తిని, జీవనశక్తిని ప్రతి మానవుడూ తెలుసుకోవాలి. అనుభవించాలి. "Expansion is life" అన్నారు శ్రీ వివేకానందస్వామి. వికాసమే జీవన సూత్రం. ఈ వికాసం వెనుక ఒక బృహత్తరమైన కృషి వుంటుంది. దానినే 'పౌరుషం' అన్నారు. పురుష ప్రయత్నమే పౌరుషం! "మానవునిలోని

పురుష ప్రయత్నాన్ని కూడా నేనే" అని శ్రీకృష్ణపరమాత్ముడు భగవద్గీతలో బోధిస్తాడు. ఈ ప్రయత్నమే 'వ్యవసాయము' అని పిలువబడుతుంది. "జయోస్మి - వ్యవసాయోస్మి" "పురుష ప్రయత్నం నేనే. తద్వారా సాధించే విజయాన్ని నేనే" అనేది శ్రీకృష్ణభగవానుని నిర్వచనం! కాబట్టి సంతత కృషి, జీవన సాఫల్యం ఎప్పుడూ కలిసే వుంటాయి.

"జీవితం అంటే ఏమిటి? దృశ్యమునకు అదృశ్యమునకూ మధ్య వున్న వంతెన వంటిది జీవితము. చిరునవ్వులకూ, కంటిధారలకూ మధ్యన వూగిస లాడే లోలకము వంటిది జీవితము. ఎన్నో కష్టాలు మనను ఎదుర్కొంటూ వుంటాయి. వాటిని ధైర్యంతో ఎదుర్కోవాలి" అంటారు శ్రీ సత్యసాయిబాబా!

జీవితం ఒక సవాలు - దానిని ఎదుర్కో.
జీవితం ఒక అనురాగం - దానిని అనుభవించు.
జీవితం ఒక కల - సాధించి ఫలింపజేసుకో.
జీవితం ఒక ఆట - తెలుసుకొని క్రీడించు.

ఇవి శ్రీ సత్యసాయిబాబావారు జీవితానికి యిచ్చిన నిర్వచనాలు. "జీవనో పాధితోటే జీవితం అంతం కారాదు. జీవిత పరమావధి ఒకటి వుండాలి. మానవునికి వాక్కు ప్రధానమైనది. తేజోమయమైన మనస్సును రసమయమైన ప్రాణంతో చేర్చటమే మానవ జీవిత పరమావధి! వాక్కు, మనస్సు ప్రాణము - ఈ మూడింటి సమ్మిళిత స్వరూపమే ఆత్మ! దీనికి మూడు అవస్థలు. అవి జాగ్రత, స్వప్న, సుషుప్తి అవస్థలు. జాగ్రదవస్థలో ఆత్మ విశ్వరూపాన్ని ధరిస్తుంది. స్వప్నావస్థలో తేజోమయ రూపాన్ని ధరిస్తుంది. గాఢమైన నిద్రా వస్థలో, సుషుప్తిలో ప్రజ్ఞా స్వరూపాన్ని ధరిస్తుంది. ఈ మూడు అవస్థలలోనూ వుండేది ఆత్మతత్వమే! ఇది దేశకాల పరిస్థితుల ప్రభావానికి లొంగేది కాదు. ఇది అతీతమైన తత్త్వం. మన ఇంద్రియములన్నింటి వెనుకా ఈ చైతన్యం పని చేస్తూ ఉంటుంది. అదే ప్రజ్ఞాన తత్త్వం. అది లేకపోతే మానవుడు జడుడై పోతాడు.

కనుక మనం ప్రజ్ఞాన తత్త్వంతో కూడిన ఆత్మతత్త్వమేనని గుర్తించాలి అంటారు శ్రీ సత్యసాయిబాబా! ప్రతి మనిషీ ప్రజ్ఞాన ఘన స్వరూపుడే! కానీ ప్రజ్ఞానంతోటి తన తాదాత్మ్యాన్ని గుర్తించలేకనే దురవస్థల పాలవుతున్నాడు.

అటువంటి ప్రజ్ఞానాన్నే "బ్రహ్మ" అంటుంది వేదం! అందుచేతనే ప్రతి మనిషినీ శ్రీ సత్యసాయిబాబా వారు "పరమాత్మ స్వరూపా!", "దివ్యాత్మ స్వరూపా!", "ప్రేమ స్వరూపా!" అని సంబోధిస్తారు! "నీ వెరుంగనట్టి నిజము నీ కెరిగింప, అవతరించుతాను అభవుడయ్యు" అంటారు! మన చేత నిజ జీవిత తత్త్వాన్ని అనుభవింపజేస్తున్న మహాపురుషుడు బాబా!

సాధనలు చేస్తున్నాం-ఫలితం శూన్యం. సిద్ధాంతాలు వల్లిస్తున్నాం- ఫలితం శూన్యం. కావలసింది పుస్తక జ్ఞానాన్ని మస్తకంలో చేర్చటం కాదు. ఆచరణలో జీవించటం. లౌకిక విషయాలపైకి మనస్సును ఎంత ఆసక్తితో పోనిస్తామో, అంత ఆసక్తితోనూ మన దినచర్యలను దైవప్రేరితమైనవిగా మలచుకోవాలి. కొంతసేపు ప్రార్థనలు, కొంతకాలం భజనలు, ఆధ్యాత్మిక గ్రంథ పఠనం, సేవా కార్యక్రమాలలో పాల్గొనటంచేత మన మనస్సు క్రమంగా పరమాత్మ చింతనలో లగ్నం అయిపోతుంది. అట్టి సాధనల ఫలమే నిర్వికల్ప సమాధి అంటారు బాబా!

నిజ జీవితంలో ఈ రీతిగా అనూహ్యమైన సత్పరిణామాలు కల్గిస్తున్న బాబా వారి దివ్య ప్రభావం ఈనాడు ప్రపంచ వ్యాప్తంగా అన్ని ఖండాలలోనూ కనబడుతోంది! లౌకిక జీవితాన్ని విడనాడ నవసరం లేకుండానే, సేవాదృష్టితో వ్యక్తిగత, సామాజిక సేవలు కొనసాగిస్తూ వుండటమే ఆధునిక జీవనంలోని దివ్య పరిణామం. శ్రీ సత్యసాయి సంస్థల ఆవిర్భావం, సేవా కార్యక్రమాలూ ఈ పరివర్తనం తీసుకురావటం కొరకే ఏర్పడ్డాయి!

ఇటువంటి ఆధ్యాత్మిక పరిణతి కోసం శ్రీ సత్యసాయి బాబా చెప్పిన ఈ దిగువ సూత్రాలు మన నిత్య జీవితాలలో ఎంతో ఆత్మ చైతన్యాన్ని నింపుతాయి:

1. "Start early drive slowly, reach safely". ఆధ్యాత్మిక జీవిత సాధనలో వీలయినంత ముందుగా ప్రవేశించు. సాధన చేస్తూ సాగిపో. నీ జీవిత గమ్యాన్ని నీవు తప్పక చేరుకుంటావు.

2. "Less luggage - more comfort". మితిమీరిన కోరికలనే భారాన్ని నెత్తినవేసుకొని బ్రతుకును దుర్భరం చేసుకోకు. కోరికలను తగ్గించుకో. అప్పుడు నీలో ఆత్మశక్తి విజృంభిస్తుంది.

3) "Learn ABC of life" - "విజ్ఞానం అవసరమే. ఐతే విజ్ఞానంలో ఉన్న ప్రజ్ఞానాన్ని మనం విచారణ చేయాలి. విజ్ఞాన ప్రజ్ఞానాల సమ్మిళిత స్వరూపమే మానవత్వము. ఈ మూడింటి ఏకత్వాన్ని పొందటమే నిజమైన ప్రజ్ఞాతత్త్వము. దీనినే ABC of life అన్నారు. 'A' for Always. B for BE. C for Careful. (Always be careful). నిరంతరం జాగరూకుడవై మెలగాలి అని దీని అర్థం. దీనినే జాగృతి అన్నారు. కానీ మనం ఏం చేస్తున్నాం? నిజమైన ప్రజ్ఞాన తత్త్వాన్ని నిర్లక్ష్యపరుస్తూ నిరంతరం అజాగ్రత్తగా బ్రతుకుతున్నాం" అంటారు బాబా!

బాబావారి వాణిలో భారతవాణి వినబడుతూ వుంటుంది. వేదవాణిని సాయివాణి వినిపించుతుంది. నిజ జీవితంలో, నిత్య జీవితంలో మెలకువ కావాలి. అదే ఆధ్యాత్మికత!

"తన గృహమున నభ్యాసం
బున మెలగెడు నందు చందమున సంసారం
బున దిరుగు మూఢుం డెరుగడు
వినుతంబగు మోక్షపదము విమలవివేకా!" (శాంతిపర్వం)

కళ్ళుండీ గ్రుడ్డివారివలె, కాళ్ళుండీ కుంటివారివలె, మతివుండీ మతిహీనులవలె ఈనాడు మనం ప్రవర్తిస్తున్నాం. నిజ జీవితంలో వివేకనేత్రం వికసించటం, ప్రజ్ఞాన ప్రేరితమైన కర్మాచరణతో ముందుకు పురోగమించటం, నిజమైన శాంతి ఆనందాలను అనుభవించటం అనేవి శ్రీ సత్యసాయి బాబావారి సందేశ సారాంశాలు! శ్రీ సత్యసాయి ప్రభావంచేత అలవాటుపడిపోయిన గ్రుడ్డి బ్రతుకులకు స్వస్తి చెబుతున్నాం మనం. తెలిసి, జాగ్రత్తగా బ్రతుకుతున్నాం! జాగృతినే Watchfulness అంటారు.

Watch your words
Watch your actions
Watch your thoughts
Watch your character
Watch your heart.

"**Watch** అనే అయిదు అక్షరాలూ కలిసి పంచాక్షరీ మంత్రం అవుతాయి. హృదయం కరగకుండా ఎన్ని సాధనలు చేసినా, ఎన్ని పలుకులు పలికినా, ఎన్ని ఉపన్యాసాలు యిచ్చినా - అన్నీ అడవికాచిన వెన్నెలవలె నిరుపయోగమై పోతాయి. సాధనతో హృదయం కరిగిపోవాలి. కరిగిన హృదయం కదిలిపోవాలి. హృదయ వేదనను పెంచాలి. పదిమందికీ పంచాలి. అప్పుడే మన జీవితం సార్థక మవుతుంది. పంచప్రాణములైన ఈ పంచాక్షరములను సక్రమంగా పాటించిన వారికి పరమాత్మ ప్రత్యక్షమవుతాడు. తన ప్రవర్తనను **watch** చేసుకుంటూ, ఈ పంచాక్షరములను అనుక్షణం స్మరిస్తూ, జపిస్తూ, ఆచరించేవారు మోక్షమును పొందటానికి అర్హత పొందుతారు" అంటారు శ్రీ సత్యసాయిబాబా!

4. The end of education is character
   The end of culture is perfection
   The end of knowledge is wisdom
   The end of wisdom is freedom.

5. Don't waste time. Time waste is life waste.

6. Money comes and goes. Morality comes and grows.

7. If money is lost - nothing is lost
   If health is lost - something is lost
   If character is lost - everything is lost.

8. "Religion is 3/4 of character" అన్నారు శ్రీ స్వామివివేకానంద. ఈనాడు వ్యక్తిత్వ పునర్నిర్మాణం యొక్క ఫలితమే శీల సంపన్నతగా భగవాన్ శ్రీ సత్యసాయి ప్రభావంవల్ల లోకం గుర్తిస్తోంది. విలువలు శీల సంపన్నత నుంచి ఆవిర్భవించేవే! ఎన్ని చదివినా, ఎన్ని సాధనలు చేసినా సత్‌శీలం లేకపోతే అవన్నీ బూడిదలో పోసిన పన్నీరు వంటివే అవుతాయి! శీలంలేని వ్యక్తియొక్క జీవితానికి సద్గతి లేదని మహాభారతం బోధిస్తోంది.

   "సత్కులంబున బుట్టుట, సకల వేద
   ములు, పురాణంబులును శాస్త్రములును జదువు
   టయును సద్గతిజేయ ప్రౌఢములు కావు
   శీల సామగ్రిలేని దుశ్చేష్టితునకు." (అను.ద్వి.పర్వం)

అటువంటి శీలం జీవితంలో హఠాత్తుగా ఆవిర్భవించదు. దానికి ఒక సాధనారీతిని భగవాన్ బాబావారు యిలా సూచిస్తారు:

Sow the seed of action - reap the habit
Sow the seed of habit - reap the tendency
Sow the seed of tendency - reap the character
Sow the seed of character - reap the perfection.

ఈ రీతిగా సత్‌శీల పోషణం అనేది సదాచారం నుంచి ఆవిర్భవిస్తుంది! భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు మానవ జీవిత సాఫల్యం కొరకు సేవయే సదాచారానికీ, సంస్కృతికీ, కర్మ, భక్తి, జ్ఞాన యోగములకూ ప్రతీక అనీ, అటువంటి సేవాదృష్టి నిత్యజీవితంలోని ఆర్థిక, విద్యా, వైద్య, సాంఘిక, రాజకీయ, ఆధ్యాత్మిక రంగములన్నింటిలోను ప్రతిబింబించవలెననీ వివరిస్తారు! జీవిత సాఫల్యతకు అటువంటి సాధనను జాతి, మత విభేదాలను విస్మరించి, వివిధ దేశముల యందలి ప్రజలూ ఆచరిస్తున్నారు.

జీవితాన్ని గూర్చి పైన పేర్కొన్న సూక్తులు సూచనప్రాయంగానే వివరింపబడ్డాయి. విస్తృతమైన పరిధిలో అర్థం చేసుకొని అనుభవించటం కొరకు శ్రీ సత్యసాయి సారస్వతాన్ని అధ్యాయనం చేయవలసినదే!

జీవితం ఒక సముద్రం వంటిది. ఎగసిపడుతూ వుండే ఉత్తుంగతరంగాల మీద ఈదుతున్నట్లుగా మానసికమైన ద్వంద్వాల మధ్యనే మనం వూగిసలాడుతూ వున్నాం. కనుకనే జీవన సముద్రంలో అట్టడుగున వున్న మానవత్వపు విలువలనే ఆణిముత్యాలను యింతవరకూ పొందలేకపోతున్నాం! భగవాన్ శ్రీ సత్యసాయి ప్రబోధాలతో ఈనాడు మానవాళి వివేక సంపన్నమవుతూ వుంది. కోల్పోయిన మానవతా విలువలను మరల కైవసం చేసుకుంటోంది : మానవతా విలువలనేవి జీవన సముద్రంలో దొరికే అమూల్యమైన ముత్యాలు!

## మానవతా విలువలు :

"మానవత్వం విలువలను ఇప్పటికైనా గుర్తించటానికి మనం ప్రయత్నించాలి. లభించిన మానవత్వాన్ని సార్థకం కావించుకోవాలి" అంటారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా.

ప్రతి మనిషి మనస్సులోనూ దైవీగుణ సంపద, అసురగుణ సంపద రెండూ వుంటాయి. విజ్ఞత, వివేకం పెంచుకుంటూ, సత్సంగం చేత, సత్కర్మాచరణ ద్వారా క్రమంగా దైవీగుణ సంపదను అభివృద్ధి కావించుకోవాలి.

ప్రేమ, సత్య వాక్పరిపాలన, ధర్మాచరణ, శాంతి, సహనం, సద్భావం, క్షమాగుణం, అహింస, ఋజుత్వం, సహకారభావన, త్యాగనిరతి, అసూయా రాహిత్యం, ధైర్యం, స్థైర్యం, భక్తి, స్నేహం, పరోపకారబుద్ధి, ధైర్యం, నిస్వార్థత, మృదుత్వం, తృప్తి, నిరంతర సంతోషభావం, పట్టుదల, సమభావం వంటి సుగుణాలు జన్మతః ప్రతి మనిషిలోనూ వుంటాయి. అయితే వీటితోపాటు వీటికి వ్యతిరేకంగా పనిచేసే విగుణాలు కూడా వుండటం సహజమే. కానీ సంస్కారం ద్వారా, అభ్యాసం ద్వారా మనుజునిలో నున్న దుర్గుణాలనూ, దురభ్యాసాలను, దుశ్చింతలనూ, దుర్భావములనూ క్రమంగా సద్గుణాలుగా, సదభ్యాసాలుగా, సచ్చింతనలుగా, సద్భావాలుగా రూపొందించుకోవటం మానవునికి అవసరం. ఈ విధమైన సత్పరివర్తనాన్నే మతాలన్నీ ఆశించేది, తత్వశాస్త్రం బోధించేది, మహాపురుషులు ప్రబోధించేదీ!

అటువంటి వివిధములైన సుగుణ సంపదలను వర్గీకరిస్తే అవన్నీ ఐదు సద్గుణాలుగా రూపొందుతాయి. అవే సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింసలనే మానవతా గుణాలు. ఈ ఐదు మానవతా గుణాల్లోనే మిగతా సుగుణాలన్నీ యిమిడి వుంటాయి. మానవుని బ్రతుకునకు పంచప్రాణాలు ఎలా ఆధారమో, మానవ వికాసానికి ఈ 5 గుణాలు కూడా పంచప్రాణాల వంటివే! మానవతకు ఈ 5 గుణాలూ వూపిరి వంటివి. ఇవన్నీ ఒక్క 'సేవ' అనే పదంలో ప్రతిబింబించుతూ వుంటాయి. సేవాదృష్టి లోపించి, స్వార్థబుద్ధి పెంపొందడం చేతనే నేటి మానవ సమాజం ఎన్నో అసమానతలతో సతమతమయిపోతోంది! ఈనాటి మనిషియొక్క వ్యక్తిత్వం విచ్ఛిన్నమయిపోయింది! ఆలోచించేది ఒకటి, చెప్పేది ఒకటి, చేసేది మరొకటి లోపల ఒకటి, వెలుపల ఒకటిగా మానవుడు ప్రవర్తించటాన్నే విచ్ఛిన్నమైన వ్యక్తిత్వంగా (Split - personality) గుర్తించాలి! అటువంటి విచ్ఛిన్న వ్యక్తిత్వంలో మానవత్వం మరుగున పడిపోతుంది. నేటి సమాజం యొక్క దుర్గతి మానవతా గుణాలు శుష్కించి పోవటంలోనే వుందనే అంశాన్ని మనస్తత్వశాస్త్రవేత్తలూ, తత్త్వవేత్తలూ, ప్రబోధకులూ అంతా చెబుతూనే వున్నారు.

కానీ ఈ మానవతా విలువలను పోషించుకొనే పద్ధతినీ, దిగజారిపోయిన ఈ విలువలను పునఃప్రతిష్ఠ కావించుకొనే మార్గాన్నీ సర్వజనాంగీకారయుతంగా, సుకరంగా, సకలమత సమ్మతంగా ఒక కార్యాచరణ ప్రణాళికతో (Action - Plan) అందించగల శక్తి సంపన్నత ఈనాడు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారికే సాధ్యమయింది. (ఈ అంశాన్ని గూర్చి విపులంగా "శ్రీ సత్యసాయి సేవా సంస్థల ఆవిర్భావం," "శ్రీ సత్యసాయి ప్రబోధాలు - వ్యక్తిత్వ వికాసం," "మానవతా విలువల అధ్యయనం" వంటి అంశాలపై అధ్యయనం చేసి తెలుసుకోవాలి).

ఆధునికత్వంలో తప్పులేదనీ, విలువలను సమన్వయపరచుకోవటంలోనే "సైంటిఫిక్ మోడరనిజం"లో గల దోషాలు తొలిగిపోతాయనీ, జీవిత విధానాన్ని నిత్యజీవిత కర్మాచరణలో కూడా పవిత్రమైనదిగా సాధన తత్పరతతో కూడినదిగా మలచుకోవాలనీ, మానవతా విలువలకు పోషించుకొంటూ వ్యక్తిగత, కౌటుంబిక, సామాజిక శాంత్యభ్యుదయాలను సాధించాలనీ భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ప్రబోధిస్తారు! శీలసంపద పోషించలేని, నైతిక విలువలు లేని రాజకీయం, ఆధ్యాత్మికత లోపించిన శాస్త్రీయ సాంకేతిక దృష్టి హానికరములే కాదు, అత్యంత ప్రమాదభరితములు అంటారు భగవాన్‌బాబా! ఈనాడు ప్రపంచ వ్యాప్తంగా విస్తరిస్తున్న భగవాన్ శ్రీ సత్యసాయి సందేశాల ఫలితంగా శీలాన్ని పోషించే విద్యను, నైతికబద్ధమైన రాజకీయాన్ని ఆధ్యాత్మికతతో కూడిన శాస్త్ర సాంకేతిక దృష్టిని పెంపొందించటమే. ప్రపంచ దేశాలలో సంభవిస్తున్న "ఆధ్యాత్మిక విప్లవం" యొక్క లక్షణాలుగా ఆఫ్రికా దేశాల రాయబారి శ్రీ విక్టర్ కానూ, నోబుల్ బహుమతి ప్రత్యామ్నాయ బహుమతి గ్రహీత అయిన సర్ జార్జి ట్రెవిలియన్, ప్రముఖ పండితులు, తాత్త్వికులు అయిన శ్రీ హిస్లాప్, శ్రీ హేవర్డ్ మర్పెట్, ప్రముఖ శాస్త్రవేత్తలయిన శ్రీ బోరోనోస్కీ వంటివారు తమ రచనల్లో వివరిస్తున్నారు.

ఇటువంటి ఒక నైతిక ఆధ్యాత్మిక పరిణామంగా భగవాన్ శ్రీ సత్యసాయి సంస్థలు ప్రపంచ దేశాలన్నింటిలో "Education in human values" అనే ప్రబలమైన సాధనా ప్రణాళికను రూపొందించి, సాధిస్తున్నాయి. అందుకు ప్రాతిపదికగా Three human values ప్రతి వ్యక్తిలోనూ ఆవిర్భవించాలి అంటారు

భగవాన్ బాబా! E. H. U. కంటె ముందు three H. V. కావాలి అన్నారు. అనగా మూడు 'H' లు (Head, Heart, Hand) పరిశుద్ధంగా వుండాలన్నారు. తల, గుండె, చేతులు, అనగా ఆలోచనలు, అనుభూతులు, ఆచరణలు పవిత్రంగా వుంచాలి. అంటారు! ముందు Putity - తర్వాత Unity చివరకు Divinity అనేది ఈ వరుస క్రమంలో జరిగే వికాసం! Purity (పవిత్రత) ఎక్కడవుందో, సమైక్యత (Unity) అక్కడే వుంటుంది, సమైక్యత వల్లనే, ఏకత్వం వల్లనే దివ్యత్వం అవతరిస్తుంది! ఈ పర్యవసానాన్నే మానవత్వపు విలువల్లో శిక్షణ సంభవింప జేస్తుంది అనటంలో ఆశ్చర్యం లేదు.

"మానవుడు పుట్టి కొన్ని వేల సంవత్సరాలైనా మానవత్వం మాత్రం యింకా పురిటి నొప్పులు పడుతూనే వుంది. ఏనాడు మనలో మానవత్వం పుడు తుందో ఆనాడే మనం మానవులం అవుతాం. ఆ మానవత్వమే దివ్యత్వం, అదే సత్య స్వరూపం. అదే ధర్మ స్వరూపం, అదే ప్రేమ స్వరూపం. అదే శాంతి స్వరూపం. అట్టి మానవత్వాన్ని పొందితే చాలు" అన్నారు సత్యసాయిబాబా!

"మానవతా విలువలు బయట నుంచి తెచ్చి పెంచే మొక్కల వంటివి కావు. ఇవి మనలోపలనుంచి ఆవిర్భవించేవి. ఈ విలువలు మనయందే వున్నాయి. అయితే హెచ్చరించి ప్రోత్సహించేవారుండాలి."

"మానవ సేవయే మాధవ సేవగా మారాలంటే మానవుల యందున్న మాన వత్వాన్ని ముందు గుర్తించాలి. మానవుని యందున్న మానవత్వాన్ని గుర్తించ లేని వ్యక్తులు, మానవుని యందున్న మాధవత్వాన్ని ఎట్లు గుర్తించగలరు? మొట్ట మొదట మానవుడు సుగుణ సంపత్తి శీలుడు కావాలి. సుగుణములు లేని మానవత్వం మానవత్వమే కాదు. గుణమే మానవునికి ప్రాణం. గుణములేని మానవుడు శిథిలమందిరం వంటివాడు."

తోటి మనిషిలో మానవత్వాన్ని చూడలేకపోవటం మానవత లక్షణం కాదు[1]. కాబట్టే కులము కాదు గుణము ప్రధానం, జాతికాదు నీతి ప్రధానం, ధనము కాదు మానము ప్రధానం అని- సాటి మనిషిలోని గుణానికీ, నీతికీ, మానమునకే మనం ప్రాధాన్యత, గుర్తింపు యిచ్చిన నాడు ఈనాటి జాతి వైరాలు, కులద్వేషాలూ, ఆర్థిక అసమానతలు సమాజంలో ఉండవు కదా? ఇంత కంటే సామాజిక న్యాయం, ఆర్థిక న్యాయం ఏ ముంటాయి? ఈ పరిణతిని

కలిగించుటయే నిజమైన విద్య యొక్క ప్రయోజనం, సంస్కృతి యొక్క స్వరూపమూ అన్నారు.

## మానవతా విలువల విశదీకరణ :

సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింసలు అనేవి మానవతా విలువలు. ఒక్కొక్క విలువను గూర్చి భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు అనేక విధాలుగా విశ్లేషణ, వివరణలు అనుగ్రహించారు. ధర్మవాహిని, ప్రశాంతి వాహిని, ప్రేమవాహిని, విద్యావాహిని, సత్యసాయి వాహిని, ధ్యానవాహిని, జ్ఞాన వాహిని, ఉపనిషద్వాహిని, గీతావాహిని, సూత్రవాహిని, రామకథారసవాహిని వంటి గ్రంథాలలో భగవాన్ బాబావారు విపులంగా మానవతా విలువలను గూర్చి ప్రబోధించారు.

ఈ వ్యాసంలో మాత్రం మౌలికమైన రీతిగానే మానవతా విలువల ఆవిర్భావం మనలో ఎలా కలిగేదీ పరిశీలించుదాం. 24-9-1987న ప్రశాంతి నిలయంలో జరిగిన మానవతా విలువల జాతీయ సదస్సులో మానవుడు తన ప్రజ్ఞాస్థానము నుండి తన కర్మలను ప్రారంభిస్తే, ఆయా కర్మలన్నీ మానవతా విలువలతో కూడినవే అవుతాయి అన్నారు భగవాన్ బాబా.

"ప్రజ్ఞ అనగా చాలా వివేకమని, తెలివితేటలని, మేధస్సు అని అంటారు. కానీ, యిది సరియైన అర్థము కాదు. ప్రజ్ఞ బ్రహ్మస్థానము. 'ప్రజ్ఞానం బ్రహ్మం' అనేది వేద వాక్యము. శరీరము నందున్న ధాతువు, అంతఃకరణ, ఆత్మ యందు ప్రజ్ఞ సమత్వంగా ఉంటుంది. ప్రజ్ఞను ఆంగ్లంలో constant integrated **awareness** అనవచ్చు. ఈ ప్రజ్ఞ కలగటం వల్లనే మానవత్వానికి విలువ. ఈ ప్రజ్ఞ ప్రేమ మయమైనదిగా ఉంటుంది. ఇలాటి ప్రేమ మయమైన ప్రజ్ఞ నుండి వచ్చిన ప్రతిక్రియ (Reaction) ను ధర్మమన్నారు. ప్రతిధ్వనిని (Resound) సత్యం అన్నారు. ప్రతిధ్వని, ప్రతి క్రియ - ఈ రెండింటి మూలాధార తత్త్వము యొక్క ప్రతిబింబమును 'శాంతి' అన్నారు. ప్రేమ మయమైన ప్రజ్ఞ యొక్క ప్రతిబింబము (Reflection) శాంతి. సత్య ధర్మ శాంతి ప్రేమల సదవగాహనమే అహింస" అన్నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా.

ప్రతి Action కూ ఒక Reaction, ప్రతి Sound కూ ఒక Resound, ప్రతి Object కూ ఒక Reflection వుండటం అనేది ప్రకృతి సూత్రాలలోని ఒక యథార్థం! కనుక మనలో వుంటూ, మన తత్త్వము యొక్క యథార్థ స్వరూపమై వుంటున్న ప్రజ్ఞయొక్క 'రియాక్షన్', 'రీసౌండ్', "రిఫ్లెక్షను"లను ధర్మంగా, సత్యంగా, శాంతిగా పై రీతిగా వ్యాఖ్యానించటం చాలా 'సైంటిఫిక్'గా వుండటం మనం గమనించాలి. దురదృష్టవశాత్తు మనలో ప్రజ్ఞ యొక్క 'స్ఫురణ' ను (Awareness) ప్రతి క్షణం కోల్పోతూ, అజ్ఞానం యొక్క 'రియాక్షన్', 'రీసౌండ్', 'రిఫ్లెక్షను'లను అనుభవించటం చేత మనలో అధర్మం, అసత్యం, అశాంతి ప్రబలిపోతున్నాయి. ఈ మూడింటి యొక్క సమష్టి స్వరూపమే 'హింస'! కనుక ఈ రీతిగా మనలో గల ప్రజ్ఞాన స్వరూపంతో ఒకటిగా వుంటూ నిత్య జీవితంలో వ్యవహరించటం అనేదే మానవతా విలువల అభివ్యక్తికి ఆధారంగా మనం గుర్తించి, వర్తించాలి!

మరొక వ్యాఖ్యానం మరింత సుగమంగా వుంటుంది. ప్రేమ మన ఆలోచనల్లో వ్యక్తమయితే, ప్రతి ఆలోచనా 'సత్యం' అవుతుంది. ప్రేమ మన ఆచరణలో ప్రతిబింబిస్తే ప్రతి పనీ 'ధర్మం' అవుతుంది. ప్రేమ మన హృదయానుభూతితో ప్రతిబింబిస్తే అదే 'శాంతి' అనిపించుకుంటుంది. ప్రేమ జీవిత విధానం అయితే అదే 'అహింస' అవుతుంది అంటారు బాబా! ఈ నిర్వచనం మానవతా విలువల అవగాహనతో మరొక సులభగ్రాహ్యమైన, అద్భుత వ్యాఖ్య! మనం ఈనాడు మన హృదయాల్లో నుంచి ప్రేమ తొలిగించి, దాని స్థానంలో ద్వేషాన్ని నెలకొల్పాము కనుకనే మన ఆలోచనలు అసత్యంవైపు, మన ఆచరణలు అధర్మంవైపు, మన అనుభూతులు అశాంతివైపు మొగ్గుతూ వుంటాయి! మానవతా విలువలు మనలో వికసించవలెనంటే ఈ రీతిగా మనలో ప్రజ్ఞ మేల్కొనాలి; ప్రేమ నేత్రం వికసించాలి అంటారు బాబా!

మరొక అద్భుత విశ్లేషణ:

ఈనాడు మనలో దైవప్రీతి, పాపభీతి, సంఘనీతి అనేవి వున్నాయా? ఉంటే మనలో మానవతా విలువలు ఉన్నట్లే. దైవప్రీతిలో 'సత్యం' ఆవిర్భవిస్తుంది. పాపభీతిలో శాంతి అహింసలూ, సంఘనీతిలో ధర్మం ఆవిష్కరింపబడతాయి! కనుకనే ఈ మౌలికమైన మానవతా విలువల వికాసంకోసం మనం

దైవప్రీతిని, పాపభీతిని, సంఘనీతిని గూర్చి అధికాధికంగా తెలుసుకోవాలి! మానవ జీవితంలో ఈ ప్రీతి, భీతి, నీతులు ఎంతో ప్రముఖ పాత్ర వహించాలి అంటారు భగవాన్ బాబా!

ఇంత వివరంగా విశ్లేషణ చేశాక, "వీటిని గూర్చి ప్రచారం చేయకండి" అన్నారు! కారణం కేవలం ప్రచారం ద్వారా విలువలు విస్తరించవు. ఆచరణ ద్వారా అవి సమాజంలో విస్తరించాలి, వికసించాలి. "Be, Do, Tell" అన్నారు. ముందు నీకు నీవుగా నీ జీవితంలో ఈ విలువలను ప్రవేశపరచుకొని ఒక మానవుడవుగా బ్రతుకు. 'దివ్యత్వం దివ్యత్వం' అంటూ కలవరిస్తే దివ్యత్వం దిగిరాదు. మానవత్వంలోనే దివ్యత్వం వుంది. అటువంటి మానవత్వ ప్రజ్ఞతో, స్ఫురణతో నిత్యజీవితంలో నీవు జీవించు. నీలో మానవత్వపు విలువలు ఆచరణ రూపాన్ని ధరిస్తాయి. "Do" అంటే ఇదే అర్థం. అప్పుడు మాత్రమే ఇతరులకు ఈ విలువలను గూర్చి చెప్పే అధికారం నీకుంటుంది. అప్పుడు మాత్రమే నీవు చెప్పేది లోకం స్వీకరిస్తుంది. నీవు ఆచరించకుండా ప్రచారం చేసేవికావు మానవత్వపు విలువలు అన్నారు భగవాన్ బాబా.

ఈ 'ఆచరణ' సేవయొక్క స్వరూపాన్ని ధరిస్తుంది. సేవాదృష్టితో మన వర్ణాశ్రమ ధర్మాలనూ, ఉద్యోగ విధులనూ, బాధ్యతలను నిర్వహించాలి. అటువంటి ప్రేరణ శ్రీ సత్యసాయి సంస్థల సేవా విధానంలో కనబడుతుంది, "సత్యం నీ తండ్రి, ప్రేమ నీ తల్లి, శాంతి నీ కుమార్తె, ధర్మం నీ సుపుత్రుడు, అహింస నీ బంధువు, యోగులు నీ మిత్రులు కావాలి" అంటారు బాబా! అటువంటి వ్యక్తిత్వం శీలసంపదతో, మానవతా సౌందర్యంతో విలసిల్లుతుంది. అప్పుడు సంభవించే Chain - reaction యిది :—

If there is righteousness in heart
There will be beauty in character,
If there is beauty in character,
There will be harmony in home,
Where there is harmony in home
There will be order in the nation
When there is order in the nation
There will be peace in the world.

"మనస్సులో ధార్మికత వుంటే శీలంలో సౌందర్యం వుంటుంది. శీలంలో సౌందర్యం వుంటే గృహంలో అన్యోన్యత వుంటుంది. ఇంటిలో అన్యోన్యత వుంటే దేశంలో క్రమశిక్షణ వుంటుంది. దేశంలో క్రమశిక్షణ వుంటే ప్రపంచంలో శాంతి వుంటుంది" అని చెబుతూ, ఈనాడు వ్యక్తిత్వ పరిణామాన్ని, శీల సౌందర్యాన్ని ప్రధానంగా వివరిస్తారు భగవాన్ బాబా!

## జరుగుతున్న సాధన :

ఏదైనా ఒక లక్ష్యాన్ని సాధించవలెనంటే దానికి ఒక నిర్వహణ ప్రణాళిక వుండాలి.అటువంటి ప్రణాళికను శ్రీ సత్యసాయి సేవాసంస్థలు నిర్వహిస్తున్నాయి! దూరప్రాచ్య దేశాల్లోనూ, ఐరోపా ఖండంలోనూ, పశ్చిమ దేశాల్లోనూ, ఆస్ట్రేలియా, ఆఫ్రికాల్లోనూ ఈనాడు మానవత్వపు విలువల పునరుజ్జీవనం అనే ఆధ్యాత్మిక మహోద్యమాన్ని శ్రీ సత్యసాయి సేవాసంస్థలు చేపట్టి నిర్వహిస్తున్నాయి. శ్రీసత్యసాయి ప్రబోధాల సరళత, అనుకూలత ఒకవైపు, శ్రీ సత్యసాయి దివ్య ప్రభావం ఒకవైపుగా ఈ ఉద్యమం కొనసాగుతూ వుంది! 'మిరకిల్సు' (చమత్కారాలు, దివ్యలీలలు) జరగటంద్వారా ప్రత్యక్షంగా శ్రీ సత్యసాయిబాబావారిని సందర్శికపోయినా, వారి దివ్య ప్రభావాన్ని స్వీకరించిన అశేష జనావళి హృదయాల్లో అంతరంగపరివర్తనం జరుగుతోంది. అందుకు శ్రీ సత్యసాయి సాహిత్యాన్ని , వివిధమైన అనుభవాలను వెల్లడించే వారి రచనలను చదవవలసిందే! శ్రీమతి పెగ్గీ మేసన్ ప్రసిద్ధురాలైన ఆంగ్ల రచయిత్రి. వారు రచించినSri Satya Sai Baba, The Incarnation of Love వంటి పుస్తకాలను అధ్యయనం చేయాలి. "చమత్కార్, సంస్కార్, పరోపకార్, సాక్షాత్కార్" అనే క్రమంలో భగవాన్ బాబావారి దివ్యలీలలను అనుభవించిన వారంతా, మానసిక సంస్కారాన్ని పరివర్తనాన్ని పొందుతారు. తద్వార మానవతా విలువల సారాంశం అయిన సేవా దృష్టితో పరోపకార పరాయణులై, తర్వాత ఆత్మ సాక్షాత్కారమును పొందుతారు! అందుకే శ్రీ సత్యసాయిబాబావారు చమత్కారాలు(Miracles) జరుపుతూ వుంటారు". అయితే, నేను చేసే అసలైన మిరెకిల్ మానవుని తమోగుణం నుంచి రజోగుణంలోకి, రజోగుణం నుంచి సాత్త్విక స్వభావంలోకి పరివర్తింప జేయటమే! మీకు తెలీకుండానే మీలో సాత్త్వికీకరణం జరుగుతోంది" అన్నారు శ్రీసాయిబాబా! అందుకే వారిని 'భగవాన్' అని భక్తులు పిలుస్తారు! "నన్నొక మిత్రునివలె స్వీకరించండి. ప్రయోజనం పొందండి" అంటూవుంటారు బాబా! సత్త్వగుణమే సకల మానవతా గుణాలకు నిలయం వంటిది.

# సత్యము-ధర్మము-శాంతి-ప్రేమ

—డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం

"సత్య ధర్మ ప్రేమ శాంతులు లేకున్న
విద్యలన్నియు నేర్చి విలువ సున్న
సత్య ధర్మ ప్రేమ శాంతులు లేకున్న
దాన ధర్మాల సార్థకత సున్న
సత్య ధర్మ ప్రేమ శాంతులు లేకున్న
బహుళ సత్కార్యలాభంబు సున్న
సత్య ధర్మ ప్రేమ శాంతులు లేకున్న
పదవుల నేలిన ఫలము సున్న

మన సనాతన ధర్మహర్మ్యంబు నిలుప
గుణము లివి నాల్గును పునాది గోడ లప్ప
ఇంతకన్నను వేరెద్ది యెఱుకపరతు
సాధుసద్గుణగుణ్యులౌ సభ్యులార!"

ఇవి అవతారమూర్తులైన భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి అమృత వాక్కులు. ఈనాడు ప్రపంచమంతా పాశ్చాత్య సంస్కృతి జాడ్యంతో లెక్క లేనన్ని బాధలకు గురి అవుతున్నది. విశేషించి భారతదేశంలో నేటి ప్రవక్తలు, నాయకులు సంస్కృతి అంటే ఏమిటో అర్థం తెలియక, మతం, దివ్యత్వం మొదలైనవాటి ప్రాముఖ్యం అవగాహన కాక దయనీయమైన స్థితిలో ఉన్నారు. ఉత్తమశీలం ఇప్పుడు పూర్తిగా లోపించిపోయింది. కాలప్రవాహపు తాకిడికి సనాతనధర్మం పూర్తిగా దెబ్బతిని భూస్థాపితం అయిపోయింది. ఇప్పుడు మనం ఒక సంధికాలంలో ఉన్నాం. ఆత్మనిగ్రహాన్ని కళాకౌశలం కాలదన్నుతున్నది. సాధనను చూచి శాస్త్రం అవహేళన చేస్తున్నది. పరపీడన ప్రవృత్తి, భయం మానవ హృదయాలను అంధకారబంధురంగా మార్చివేస్తున్నవి. ధర్మగ్లాని

యేర్పడిన ఈ యుగంలో మానవజాతిలోని దివ్యత్వాన్ని మేలుకొల్పి ధర్మ తేజాన్ని పునరుద్ధరించటానికి భగవంతుడు శ్రీ సత్యసాయిబాబా రూపంలో అవతరించాడు.

"సర్వమానవకోటికి మూలాధారమైన ఆత్మను గూర్చిన జ్ఞానమే నేడు విస్మృతమైనది. అదే ఈనాటి అశాంతికిని, విప్లవమునకును, అవినీతికిని ముఖ్య కారణము. నిద్రాముద్రితమైయున్న ప్రజానీకమును మేలుకొలిపి, ఈ సందేశము నందించుటకే నా యీ ఆగనము....ఇతర దేశములందు ఉత్తమాశయాసక్తి యుడిగిపోయినది. మానవులలోగల దైవత్వమునందలి విశ్వాసము పూర్తిగా పోయినది. ఇవియన్నియు సవరింపబడవలె. అందుకే నేను వచ్చితిని"- అని భగవాన్ బాబావారు తమ అవతార కారణాన్ని ప్రజలకు అనుమానం లేని విధంగా స్పష్టం చేశారు.

సనాతన ధర్మం ఒక భారతదేశానికే కాదు- సర్వమానవాళికి సంబంధించింది. ఆ ధర్మ భవనం శిథిలమైపోయింది. దానిని పునరుద్ధరించి, పునర్నిర్మాణం చేయటానికి భగవాన్ బాబావారు సత్య ధర్మ శాంతి ప్రేమలనే స్తంభాలను నిలపటం తమ అవతార ప్రయోజనంగా ప్రకటించారు. బాబావారి 'సర్వధర్మ సమన్వయ చిహ్నం' ప్రపంచ మత ధర్మాలలో సమైక్యంగా వెలుగొందే ప్రేమ స్వరూపాన్ని విశ్వజనీనంగా వ్యాఖ్యానిస్తున్నది. మానవతా సంస్కృతి పునరుజ్జీవనానికి బాబావారి ప్రబోధం ప్రణవమంత్రం!

మత మంటే మానవుణ్ణి భగవంతునితో బంధించేది. వివిధ మతాలను స్థాపించి, వ్యాపింపజేసిన వారిలో ప్రేమ- జ్ఞానం నిండి పొంగారాయి. వారందరి లక్ష్యం ఒకటే. వారు మంచిని చేయటానికి, మంచిని చూడటానికి, మంచిగా ఉండటానికి ప్రయత్నించారు. మతాలు బోధించే వివిధ తాత్త్విక సిద్ధాంతాలను గ్రుడ్డిగా నమ్మి వల్లించటం కంటె వాటిని జీవితంలో ఆచరించటం ముఖ్యం. తాము చెప్పేది చేసి చూపించని వారికి ఇతరులకు బోధించే అర్హత లేదు. ఏ మతానికి చెందిన వారైనా వారి స్వీయ మత ధర్మాలను మొదట పరిపూర్ణంగా నమ్మి తమ జీవితాల్లో తప్పక ఆచరించాలి. సర్వమతాలను సమానంగా గౌరవించి, వాటిలో అంతస్స్రూతంగా ఉన్న ఏకత్వాన్ని, గొప్పదనాన్ని నొక్కి వక్కాణించేదే సాయిమతం; సాయి అభిమతం. సర్వమానవులను సోదర

భావంతో ప్రేమించటం,మానవజాతికి తండ్రిగా భగవంతుని సంభావించటం అనే విశ్వమానవ ధర్మాలను స్వార్థరహిత ప్రేమతత్త్వం ద్వారా సాధించటం శ్రీ సత్యసాయి అవతార ప్రబోధం. 'నా జీవితమే నా సందేశం' అని, చెప్పింది చేసి చూపిస్తున్నారు భగవాన్ శ్రీ సత్యసాయి. "ప్రపంచంలో ఒకే ఒక్క మతముంది- అది ప్రేమ మతం; ఒకే ఒక్క కులముంది - అదే మానవత: ఒకే ఒక్క భాష ఉంది - అదే హృదయ భాష" అని బాబావారు ప్రకటించారు. అందువలననే ప్రపంచంలోని మారుమూల దేశాలనుండి వచ్చిన పాశ్చాత్యులు కూడా ప్రశాంతి నిలయంలో ప్రసన్నంగా దర్శనమిచ్చే సత్యసాయి దివ్యమూర్తిని క్రీస్తు ప్రభువు యొక్క అపరావతారంగా భావించి ఆరాధించి ఆనందిస్తున్నారు. ముస్లీములు బాబావారిలో అల్లాను చూస్తున్నారు; పార్శీలు జొరాస్టరును దర్శిస్తున్నారు.

"అల్లా యంచు మహమ్మదీయులు, జెహోవా యంచు సత్క్రైస్తవుల్
పుల్లాబ్జాక్షు టటంచు వైష్ణవులు, శంభో యంచు శైవుల్ మదిన్
ఉల్లాసంబున గొల్వ నందరిని సంపూర్ణాయురారోగ్య సం
పల్లాభంబు లొసంగి ప్రోచు నొకడే భవ్యుండు భావింపుడీ!"

బాబావారి ఈ ప్రబోధంలో నేటి ప్రపంచం ఒక నిత్యసత్యాన్ని దర్శిస్తున్నది; ఒక ధర్మసమన్వయాన్ని సాధిస్తున్నది; ఒక శాంతి మంత్రాన్ని పఠిస్తున్నది; ఒక ప్రేమతత్త్వాన్ని అనుభవిస్తున్నది. ఈ నాలుగు స్తంభాలమీద మానవ జీవిత సంస్కృతి సౌధవైభవం నవజీవన కల్యాణ శోభలతో వెలుగొంద గలదని విశ్వసిస్తున్నది.

సత్య ధర్మ శాంతి ప్రేమలనే పదాలకు భౌతిక, అధిభౌతిక, ఆధ్యాత్మిక ప్రవృత్తులలో మూడు రకాలైన అర్థాలు గోచరిస్తుంటాయి. మానవ జీవితంలోని ఈ మూడు పొరల్లోనూ ఈ మూడు అర్థాలను అన్వయించుకొని, వాటి సమగ్ర తత్త్వాన్ని తెలుసుకొని అనుభవించి ఆచరించాలి. ఆ అర్థాలను స్థూలంగా ఇలా భావించవచ్చు —

1. సత్యం- భౌతికం - సత్యభాషణం; అధిభౌతికం - సమదర్శనం., ఆధ్యాత్మికం - 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' అని తెలిసికొనటం.
2. ధర్మం- భౌతికం - విధ్యుక్త ధర్మ కర్మాచరణం; అధి భౌతికం - 'సర్వే జనా స్సుఖినో భవన్తు' అని భావించటం. ఆధ్యాత్మికం - 'సర్వ

ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ!' అన్న గీతా ప్రబోధాన్ని అనుసరించి శరణాగతిని భజించటం.

3. శాంతి- భౌతికం - మనస్సు కలత చెందకుండా ఉండటం. ఆధిభౌతికం - ఇంద్రియాలను జయించటం. ఆధ్యాత్మికం - బ్రహ్మానందస్థితిని పొందటం.

4. ప్రేమ- భౌతికం - విశ్వమానవ సౌభ్రాతృత్వం. ఆధిభౌతికం - మానవ సేవయే మాధవ సేవ అని భావించి సమాజరూప సర్వేశ్వరుణ్ణి సేవించటం; ఆధ్యాత్మికం - 'ఆత్మవత్ సర్వభూతాని' అని భావించి సర్వం ప్రేమమయంగా జీవించటం.

సత్యం విశ్వాత్మశక్తి; దాని ఆచరణం ధర్మం, దాని ఫలం శాంతి; శాంతి ప్రసరించే కాంతి ప్రేమ. ప్రేమయే దైవం.

## సత్యం :

భగవాన్ బాబావారి తత్త్వాన్ని అవగాహనం చేసికొనటానికి సత్య సాధనం మొదటి మెట్టు. 'సత్యం నాస్తి పరోధర్మః' అనే సూక్తి లోక విదితమే. సత్యం కన్న పరమధర్మం లేదు. "సత్యమనే విద్యుత్తు ధర్మ మనే తీగద్వారా శాంతి అనే బల్బులో ప్రవేశించి, ప్రేమ అనే కాంతిని ప్రసరిస్తుంది. సత్యమే విశ్వవ్యాపకమైన ఆత్మశక్తి. సత్యాన్ని ఆలంబనంగా చేసికొనకపోతే మానవ జీవితం సంసార సముద్రంలో చుక్కాని లేని నావలాగా గమ్యాన్ని చేరుకోలేక మున్నిటనే ముక్కలయిపోతుంది. కాబట్టి మానవుడు అజ్ఞానంతో ఆవరింపబడిన ఆత్మను సత్య జ్ఞానంతో శోధించి సాధించి దివ్యుడు కావటానికి యత్నించా"లని బాబావారు ప్రబోధించారు.

లౌకిక దృష్టిలో సత్య మంటే నిజం మాట్లాడటం. భారత భాగవతాది గ్రంథాలలో సత్యవాక్య మహిమ వేనోళ్ళ కీర్తింపబడింది. ఉదాహరణకు- శకుంతల దుష్యంతమహారాజుకు సత్యవాక్య మహిమను గురించి ఇలా చెప్పింది:

"నుతజలపూరితంబు లగు నూతులు నూఱిటికంటె నూనృత
వ్రత! యొక బావి మేలు, మఱి బావులు నూఱిటికంటె నొక్కస
త్క్రతు వది మేలు, తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు; త
త్సుతశతకంబుకంటె నొకసూనృత వాక్యము మేలు సూడఁగన్."

"వెలయంగ నశ్వమేధం
బులు వేయును నొక్క సత్యమును నిరుగడలం
దుల నిడి తూఁపగ సత్యము
వలనన ములుసూపు గౌరవంబున పేర్మిన్."

"సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁ గావు
ఎఱుఁగు మెల్లధర్మంబుల కెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు." ఆది. ప. 4, 94 - 96.

మంచినీటినూతులు నూటికంటె ఒక బావి మేలు; నూరుబావులకంటె ఒక యజ్ఞం మేలు: నూరు యజ్ఞాలకంటె ఒక కొడుకు మేలు; నూరు మంది కొడుకులకంటె ఒక సత్య వాక్యం మేలు. ఒక త్రాసులో వేయి అశ్వమేధయాగాలఫలం ఒకవైపూ, సత్యాన్ని మరొకవైపూ వేసి చూస్తే సత్యము వైపే ముల్లు చూపుతుంది. సర్వ తీర్థయాత్రలు చేసిన ఫలం, వేదాలనన్నింటినీ చదివిన ఫలం సత్యంతో సమానం కావు. ధర్మాలలోకెల్లా సత్యమే ఉత్తమ ధర్మమని ధర్మజ్ఞులైన మునులు చెప్పారు- అని భారతోక్తి. శిబిచక్రవర్తి సత్యసంధుడై తన శరీరాన్ని కోసియిచ్చి అమృతు డయ్యాడు. హరిశ్చంద్రుడు సత్యవాక్య పాలనంకోసం రాజ్య భోగభాగ్యాలనేకాక, భార్యా పుత్రులను కూడా త్యాగంచేసి సశరీర స్వర్గాన్ని పొందాడు. రఘురాముడు సత్యనిష్ఠకై రాజ్యాన్ని త్యాగం చేసి అడవులకు వెళ్లాడు. బలిచక్రవర్తి, ఇచ్చిన మాట నిలుపుకోవటానికి వామనునికి మూడుగులనేలగా ముల్లోకాల నిచ్చి అతని పాదానికి తన శిరాన్ని అంకితం చేశాడు. ఆపద్ధర్మంగా అబద్ధం ఆడవచ్చునని శుక్రనీతికి ఆచార్యుడైన శుక్రుడు చెప్పినా బలి సత్యవ్రతాన్ని వీడలేదు. ధర్మరాజు ఆపద్ధర్మంగా 'అశ్వత్థామ హతః కుంజరః' అని అసత్యాన్ని పలకటంచేతనే కొన్ని క్షణాలైనా నరకాన్ని చూడవలసి వచ్చింది. సత్యమే మాట్లాడటంవలన చిత్తశుద్ధి యేర్పడుతుంది. చిత్తశుద్ధి సత్ప్రవర్తనను కలిగిస్తుంది. సత్ప్రవర్తన శీల సంపదను పెంపొందింప చేస్తుంది. శీలమే జీవితసారం.

ఇంద్రియ గోచరమైన వస్తుసముదాయాన్ని వాస్తవమనీ, సత్యమనీ పేర్కొంటుంటాం. ఇది భౌతిక దృష్టి. ఇది ఒక్కటే నిజం కాదు. బాబావారు ఈ అంశాన్ని వివరిస్తూ 'నీవు నిజానికి ఒక వ్యక్తివికావు, ముగ్గురవు' అన్నారు. ఎలాగంటే-

1. The one you think you are : నీ వనుకుంటున్న నీవు.

2. The one others think you are : ఇతరులు భావించే నీవు.

3. The one you really are : నిజంగా నీవైన నీవు.

నీ వనుకుంటున్న నీవు దేహం; ఇది భౌతికం. ఇతరులు భావించే నీవు వారి మనోబుద్ధులు ననుసరించి స్ఫురించే నీవు; ఇది మానసికం, ఆధిభౌతికం. నిజంగా నీవైన నీవు నీ ఆత్మస్వరూపం. ఇది ఆధ్యాత్మికం. నీలాగానే లోకంలో ప్రతి వస్తువును భావిస్తే అన్నింటిలోనూ సత్యరూపంగా నిలిచేది ఆత్మయేయని బాబావారు ప్రబోధించారు. ఆ సత్యరూపతత్త్వాన్ని తెలిసికోవటానికి తమవెంట తరలిరండని మనల్ని ఆహ్వానించారు.

"కనుల కగుపడు దృశ్యంబు గాంచి మీరు
సత్య మిదియని యెంచక సంబరమున
తెరను దాగిన సత్యంబు తెలిసికొనగ
విశ్రమింపక నాతోడ వెడలిరండు"—బాబా.

ఆధిభౌతిక దృష్టితో చూస్తే సత్యం పరమాత్మయొక్క అవ్యక్త స్వభావానికీ వ్యక్తరూపానికీ కూడా ప్రతీక. సత్యశబ్దంలో సత్ + త్యం అనే రెండు పదాలున్నాయి. 'సత్' రూపముల గల భూతములను (భూమి, నీరు, తేజస్సు), 'త్యం' రూపము లేని భూతములను (వాయువు, ఆకాశం) తెలుపుతాయి. అలాగే పాంచ భౌతిక ప్రకృతి పరమాత్మ యొక్క వ్యక్తరూపం; సత్యం పరమాత్మ యొక్క అవ్యక్త రూపం. దీనినిబట్టి లోకంలో కనబడే నశ్వరశరీరాన్నీ ఇంద్రియాలకు సత్యాలుగా కనపడుతున్నా వాటిని సత్యాలని గ్రహించలేము. వాటిలో ఉండే సత్యరూపమైన ఆత్మయే నిత్యం. ఆ నిత్యసత్యదర్శనం అయినవారికి సమదర్శనం ఏర్పడుతుంది. సుఖాన్నీ దుఃఖాన్నీ, మట్టినీ మాణికాన్నీ, మనిషినీ మానునూ ఒక దైవత్వదృష్టితో చూసే సమత్వమే సమదర్శనం. అది సత్యం.

'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' అని దర్శించటం ఆధ్యాత్మిక సత్యం. పంచభూతాలకూ పరమకారణం పరమాత్మ. కారణమైన పరమాత్మ శాశ్వతుడు; అనంతుడు. నశించే పాంచభౌతిక ప్రకృతి సత్యంకాదు; నిత్యమైన పరబ్రహ్మయే సత్యం. బాబావారన్నట్టు - "భగవత్ సృష్టియైన పంచభూతములే సర్వత్రా

వ్యాపించియుండ భగవత్తత్వము సర్వత్రా వ్యాపించియున్నదనే సత్యాన్ని మన మింక విచారింప నక్కరలేదు. కనుకనే ప్రహ్లాదుడు 'ఇందు కలడందు లేడను సందేహము వలదు' అని గట్టిగా నుడివినాడు.... 'ఈశావాస్య మిదం సర్వం' దైవం సర్వవ్యాపకుడని, సర్వజీవుల యందు సర్వపదార్థములందు ఉన్నాడని వేదవిహితమైన విజ్ఞానము భారతీయులకు బోధించింది. కనుకనే భారతీయులు చెట్టును, పుట్టను, గుట్టను, పక్షిని, పామునుకూడా ఆరాధిస్తూ వస్తున్నారు. ఇది మూఢవిశ్వాసమని ఇతర మతములవారు విమర్శిస్తారు. ఒకవైపు దేవుడు సర్వవ్యాపి అని ప్రబోధిస్తూ మరొకవైపున సర్వజీవులలో ఉన్న దైవత్వాన్ని ఆరాధిస్తున్న వ్యక్తులను విమర్శించటంలో అర్థం లేదు. చెప్పినట్లు చేసేవాడు మూర్ఖుడా? చెప్పేదానికి భిన్నంగా నడిచేవాడు మూర్ఖుడా?" (సనాతన సారథి, సెప్టెంబర్ 1983, పు. 216).

'మనిషి పోయినా మాట నిలుస్తుం'దనే సామెత నిజంలో నిలిచే నిత్యసత్యాన్ని చెపుతుంది; 'సమత్యమే సత్యం' అన్న వాక్యంలో సత్యదర్శనం కనపడుతుంది. 'సత్యమే బ్రహ్మ'మన్న సూక్తిలో సర్వవ్యాపియైన పర్వమేశ్వర సత్యానుభవం వ్యక్తమౌతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే - నిజాన్ని పలకటం సత్యం; నిజాన్ని చూడటం సత్యం; నిజాన్ని తెలియటం సత్యం.

## ధర్మం :

మానవుడు చేయవలసిన కర్తవ్యాన్ని ధర్మమని లౌకికంగా మనం వ్యవహరిస్తుంటాం. బాబావారు ఈ అర్థంలో ధర్మాన్ని వివరిస్తూ ఒక చిన్న కథను దృష్టాంతంగా చెప్పారు: "ఒక చాకలివానికి గాడిదా కుక్కా వున్నాయి. గుడ్డలు మోయటం గాడిద పని. దొంగలు వస్తే మొరగటం కుక్కవంతు. ఆ పొద్దున యజమాని తనను సరిగా చూడలేదనే కోపంతో రాత్రిపూట దొంగ వచ్చి బట్టలు మూటకట్టుకొని ఎత్తుకు పోతున్నప్పుడు కుక్క మెదలకుండా ఊరకున్నది. యజమానికి హెచ్చరిక చేయాలని గాడిద అరవటం సాగించింది. పనిలేకుండా అరుస్తున్న దనుకొని గాడిదను చాకలి బాగా దెబ్బలు కొట్టాడు. దొంగను పట్టుకొనే ప్రయత్నం చేయలేదు. ఎవరికి నియమించిన కర్మ వారు నిర్వహించాలి. ఇంకొకరిపని పైనవేసుకొంటే గందరగోళం తప్పదు. ఎవరికి అప్పగించినపని వాళ్ళుచెయ్యటమే ధర్మం.'' (శ్రీ స.సా. వచనమృతం 3-పు.85)

"శ్రేయాన్ స్వధర్మో విగుణః, పరధర్మాత్స్వనుష్ఠితాత్

స్వధర్మే నిధనం శ్రేయః, పరధర్మో భయావహః" (భ.గీ. 3.35)

(బాగుగా ఆచరించిన పరధర్మంకన్న లోపం ఉన్నా స్వధర్మమే శ్రేయస్కరం. స్వధర్మాన్ని ఆచరిస్తూ చనిపోయినా శ్రేయస్సే; కాని, పరధర్మం అనుసరించటం భయావహం) అని భగవద్గీత బోధిస్తున్నది.

మానవ శీలానికి రక్షాకవచం వంటిది ధర్మ మని బాబావారు నిర్వచిస్తూ దానిని సంరక్షించటానికే తామవతరించా మని చెపుతూ దృష్టాంతరూపంగా ఇలా పేర్కొన్నారు. ధర్మం అంటే ధరింపబడే వస్త్రం. వస్త్రమును ధరించే ద్రౌపదికి వస్త్రాపహరణం చేయటానికి పూనుకున్నప్పుడు పరమాత్ముడు అక్షయ వస్త్ర ప్రదానం చేశాడు. ఈనాడు భారతమాతకు సనాతనధర్మమే వస్త్రం. ఆమె బిడ్డలమని చెప్పుకొనే అర్హత లేని కుమారులూ, దారి తెలియని నాయకులూ సనాతన ధర్మమనే వస్త్రమును తొలగించబూనుకున్న తరుణంలో భగవంతుడు అవతరించి శక్తినీ, సాంత్వనమునూ ప్రసాదిస్తున్నాడు. ఆమెను పరాభవించ దలచిన సభాస్థలంలో నలుమూలలనుంచీ వస్త్రాలు అక్షయంగా వర్షించటం మీరు కనుగొనగలరు. భరతమాత ఆత్మవైభవమును, అక్షయ సంపదను, గౌరవమును కాపాడటానికి వచ్చిన అవతారమూర్తి మహిమా విశేషమును మీరు దర్శించనున్నారు." (శ్రీ స. వ. అ. III. 86)

ఆధిభౌతిక దృష్టితో చూస్తే ధర్మం మరింత విశిష్టంగా భాసిస్తుంది. "ధరతి విశ్వం ధర్మః" విశ్వమును ధరించేది ధర్మ మనీ, దాన్ని పుణ్య మంటారనీ ఒక నిరుక్తి ఉన్నది. 'ధ్రియతే వా జనైః ఇతి ధర్మః' జనులచే పూజింపబడేది ధర్మమనీ, అది వేదవిహితకర్మ మనీ మరొక నిరుక్తి ఉన్నది. ధర్మ ప్రబోధకు వెలసిన వ్యాసుని అష్టాదశ పురాణాల సారాన్నంతా రెండు మాటల్లో చెప్పాలంటే - పరోపకారమే పుణ్యం; పరపీడనమే పాపం.

"అష్టాదశ పురాణేషు వ్యాసస్య వచనద్వయమ్

పరోపకారాయ పుణ్యాయ, పాపాయ పరపీడనమ్" అనే శ్లోకం ప్రసిద్ధం. ధర్మసాధనలో మానవులు పది గుణాలను అలవరచుకోవాలని యాజ్ఞవల్క్య స్మృతి చెపుతున్నది.

"అహింసా సత్య మస్తేయం శౌచ మింద్రియనిగ్రహః
దానం దమో దయా శాంతిః సర్వేషాం ధర్మ సాధనమ్."

అహింస, సత్యం, అస్తేయం, శౌచం, ఇంద్రియనిగ్రహం, దానం, దమం, దయ, శాంతి మొదలైన వానివలన ధర్మసాధన చేయబడుతుందని స్మృతివాక్యం. ధర్మం లోకహిత రూపమైనది. హితమైన ధర్మమే ధర్మం. లోకాన్ని బాధించేది ధర్మరూపంగా చెలామణి అవుతున్నా, దానిని ధర్మజ్ఞు లంగీకరింపరని మహా భారతం చెపుతున్నది.

"ధర్మజ్ఞు లైన పురుషులు
ధర్మువునకు బాధ సేయు ధర్మువు నైనన్
ధర్మముగా మదిఁ దలఁపరు
ధర్మువు సర్వంబునకు హితంబు కావలయున్." (అరణ్య. ప. 3-230)

సత్యము యొక్క ఆచరణరూపమే ధర్మం. కాలానుగుణంగా మారే కర్తవ్యం కాదు ధర్మం. ధర్మం నిత్యం, దివ్యం, మార్పులేనిది; ప్రతి మానవునిలో సర్వకాల సర్వావస్థలయందును సదా వసించేది ధర్మం. మానవుని హృదయమే ధర్మానికి పుట్టినిల్లు. మనస్సునుండి ప్రసరించిన నిర్మల భావమే కార్యరూపంగా పరివర్తించినపుడు ధర్మంగా పిలువబడుతుంది, దయాభావము లోకంలో ఉత్తమ ధర్మంగా పరిగణింపబడుతుంది. ఉదాహరణకు-భాగవతంలో ఒక కథా ఘట్టం : గురుపుత్రుడైన అశ్వత్థామ ఉపపాండవులను నిర్దాక్షిణ్యంగా నిద్రిస్తున్నప్పుడు వధించాడు. దానికి ప్రతీకారంగా అర్జునుడు అశ్వత్థామను బంధించి తెచ్చి పుత్రశోకంతో కుమిలిపోతున్న ద్రౌపది యెదుట ఉంచి శిరస్సును ఖండిస్తానని హుంకరిస్తాడు అప్పుడు ద్రౌపది అర్జునుణ్ణి వారించి 'తల్లి కడుపు కోత తల్లికే తెలుసు. నా కొడుకులు పోయి నే నెలా శోకిస్తున్నానో అలాగే అశ్వత్థామ తల్లికూడా కొడుకుపోయి దుఃఖిస్తుంది. కాబట్టి, శిశు హంతకుడైనా అశ్వత్థామను దయాదృష్టితో వదలిపెట్టు'మని భర్త ప్రార్థిస్తుంది. అశ్వత్థామతో ఆమె అన్న మాటలు బమ్మెర పోతనకవి ఇలా రచించాడు :

"అక్కటా! పుత్రశోక జనితాకులభార విషణ్ణచిత్త నై
పొక్కుచున్న భంగి నిముఁ బోరఁ గిరీటి నిబద్ధుఁజేసి నేఁ
డిక్కడ కీడ్చి తెచ్చుట సహింపనిదై భవదీయమాత నేఁ

డెక్కడ నిట్టి శోకమున నేక్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో!" (1-130)
తనకు నొప్పి కలిగించే పనిని ఇతరులకు చేయకుండా ఉండటమే పరమధర్మం. 'ఆత్మవత్ సర్వభూతాని' అనే భావంతో 'సర్వేజనా స్సుఖినోభవన్తు' అనే ధ్యేయంతో లోకశ్రేయస్సును ఉద్దేశించి మంచి మనసుతో చేసే ప్రతి పనీ ధర్మంగా పరిగణింపబడుతుంది.

మానవుడు సాధించే పురుషార్థాలు నాలుగింటిలో ధర్మం మొదటిది. అర్థ కామ మోక్షాలలో కూడా ధర్మం పూసల్లో దారంలాగా ఉంటుంది. ధర్మం లేని పురుషార్థం నిరర్థకం. ఎక్కడ ధర్మం ఉంటుందో అక్కడ విజయం తథ్యమని సాయికృష్ణ ప్రబోధం. 'ధర్మో రక్షతి రక్షితః' - ధర్మాన్ని రక్షించిన వారిని ధర్మమే రక్షిస్తుంది అని శ్రుతివాక్యం. భగవాన్ బాబావారు ధర్మ ప్రాముఖ్యాన్ని యిలా ప్రవచించారు:

"మనస్సులో ధార్మికచింత ఉంటే- శీలంలో సౌందర్యం ఉంటుంది
శీలంలో సౌందర్యం ఉంటే- గృహంలో అన్యోన్యత ఉంటుంది
ఇంటిలో అన్యోన్యత ఉంటే- దేశంలో క్రమశిక్షణ ఉంటుంది
దేశంలో క్రమశిక్షణ ఉంటే- ప్రపంచంలో శాంతి ఉంటుంది"

'ధనమూల మిదం జగత్' అనే స్థితినుంచి 'ధర్మమూల మిదం జగత్' అనే స్థితి వరకు మానసికంగా ఎదగటమే ధర్మాచరణం.

"వేదోక్తో హి ద్వివిధో ధర్మః ప్రవృత్తిలక్షణో నివృత్తి లక్షణ శ్చ" అని శంకరులు గీతాభాష్యంలో చెప్పారు. ధర్మం ప్రవృత్తి ధర్మమనీ, నివృత్తి ధర్మమనీ రెండు విధాలని వేదమే చెప్పింది. ప్రవృత్తి ధర్మాన్ని లౌకికమనీ, నివృత్తి ధర్మాన్ని పారమార్థికమని కూడా అంటారు. లౌకిక ధర్మాచరణం అంతఃకరణశుద్ధిని కలిగించి పారమార్థిక ధర్మాన్ని అవలంబించటానికి హేతు వౌతుంది. పారమార్థికధర్మం మోక్షప్రాప్తికి మూలమౌతుంది. లౌకిక ధర్మాలలో శాస్త్రవిధులు, సదాచారాలు ముఖ్యంగా ఉంటాయి. వర్ణాశ్రమ ధర్మాలు, వ్రత నియమాలు, యజ్ఞయాగాదులూ శాస్త్రవిధులైన లౌకికధర్మాలు; అతిథిసత్కారం, అన్నదానం, సప్తసంతానాలను నిలపటం, దానధర్మాలు మొదలైనవి సదాచారాలు. లౌకికధర్మాలు కాయిక, మానసిక, వాచిక, కార్మికాలని నాల్గు విధాలని పెద్దలు చెపుతారు. తీర్థయాత్రలు మొదలైనవి కాయికాలు; పుణ్యకార్యాలు చేయాలనే తలంపులు మానసికాలు; మంత్రజపం, వేదపఠనం, భగవన్నుతి

మొదలైనవి వాచికాలు. చెరువులు త్రవ్వించటం, దేవాలయాలు కట్టించటం మొదలైనవి కార్మికాలు: లౌకిక ధర్మాలను ఆచరించటంవలన కలిగేది స్వర్గ సుఖమే కాని మోక్షసుఖం కాదు. స్వర్గసుఖం అనిత్యం; మోక్షసుఖం నిత్యం.

మోక్షాన్ని కలిగించే పారమార్థిక ధర్మమే నివృత్తిధర్మం. ఆధ్యాత్మిక దృష్టితో చూస్తే ధర్మం నివృత్తిధర్మంగానే గోచరిస్తుంది. పారమార్థిక (నివృత్తి) ధర్మాన్ని కూడా కాయిక, వాచిక, మానసిక, కార్మికభేదాలను కలిగి ఉంటాయని పెద్దలు చెపుతారు. వేదాంతశ్రవణం, గురుసేవ, వ్రతాదులను ఆచరిస్తూ దేహాన్ని సాధన కనువుగా మలచుకోవటం కాయికాలంటారు; మనన ధ్యానాదులను మానసికాలంటారు. వేదాలను, ఉపనిషత్తులను, భగవద్గీతను, పురాణాదులను పఠించటం, పారాయణం చేయటం, బోధించటం వంటివి వాచికా లంటారు; అహింస, సర్వజీవ సమభావం, యోగం, శీలపోషణం మొదలైనవి పారమార్థిక కార్మిక ధర్మాలు.

భగవాన్ బాబావారు ప్రవృత్తి నివృత్తులను గురించి ఒక దివ్యోపన్యాసంలో ఇలా అన్నారు- "మానవత్వములో రెండు విధములైన తెగలు ఉంటున్నాయి. ఒకటి ప్రేయోమార్గము; మరొకటి శ్రేయోమార్గము. ఒకటి ప్రవృత్తి; రెండవది నివృత్తి. ఈ ప్రవృత్తి కామ, క్రోధ, మోహ, లోభ, మద, మాత్సర్యము అనే అరిషడ్వర్గములతో కూడియుంటుంది. నివృత్తి మార్గములో కూడా ఆరు గుణము లుంటున్నాయి. వీనినే మిత్రషడ్వర్గము అంటారు. ప్రవృత్తికి ఆరు లక్షణములు; నివృత్తికి ఆరు లక్షణములు. నివృత్తి లక్షణములే శమ, దమ, తితీక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానములు....అయితే నివృత్తిని ఏ రీతిగా మనము అభివృద్ధి పరచుకోవాలి? దీనికి కర్మార్పణ అని, నిస్సంగమని రెండు మార్గము లున్నవి." (సనాతన సారథి- జూన్, 1983 పు-131)

మోక్ష హేతువైన నివృత్తి ధర్మస్వరూపాన్ని శ్రీకృష్ణభగవానుడు మోక్ష సన్యాసయోగం బోధిస్తూ, భగవద్గీతా తాత్పర్యరూపంగా రెండు శ్లోకాలలో సూక్తిసుందరంగా ప్రబోధించాడు:

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మా మే వైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే."
"సర్వధర్మాన్ పరిత్యజ్య, మా మేకం శరణం వ్రజ

అహం త్వా సర్వపాపేభ్యో. మోక్షయిష్యామి మాశుచ." (18.65-66) (నాలోనే మనుస్సు నిలుపుకో. నా భక్తుడ వగుము. నాకే యజ్ఞము నర్పించు. నాకు నమస్కరించు. నన్నే చేరగలుగుతావు. నేను నీకు నిజంగా మాట యిస్తున్నాను. నీవు నాకు ప్రియుడవు కదా మరి, సర్వధర్మాలనూ (అన్ని ఆధారాలను) పరిత్యజించి, నన్ను ఒక్కడినే శరణు పొందు. నేను సర్వపాపముల నుండి నిన్ను విడుదల చేస్తాను. ఉద్ధరిస్తాను. శోకింపకు.) భగవాన్ బాబా ఈ భావాన్ని వివరిస్తూ ఇలా అన్నారు- "సర్వధర్మములు వదలి నన్ను శరణు జొచ్చుము. నిన్ను సమస్త పాపముల నుండి విముక్తిని చేతును - అనగా మమకార అభిమానములు వదలి, దేహమే నేనను అహంకారమును రూపుమాపి, అంతయూ పరమాత్మయే అను దృఢచిత్తుడై, పరమాత్మకు అంకితమగుటే శరణుజొచ్చుట. అట్టి స్థితియందు సంకల్పములు ఏవియూ లేక భగవంతుడు చెప్పినటుల చేయుటే; ఉంచినటుల ఉండుటే; ఆడించినటుల ఆడుటే; 'ఇది నేను చేయదగినది, ఇది చేయదగనిది' అను ధర్మాధర్మ విచారణకు దూరమై ఫలాపేక్ష లేక కర్మల నాచరించుట అట్టివాని కర్తవ్యము." (శ్రీ స. సూ. పు-272). శరణాగతియే నివృత్తిధర్మాలలో శ్రేష్ఠమైనది; పారమార్థిక ధర్మాలలో పరమోత్తమమైనది. శరణాగతిలో ధర్మమే దైవంగా నిలుస్తుంది; ధర్మాచరణం ఆత్మసాక్షాత్కారంగా అనుభవాన్నిస్తుంది. "ధర్మం ప్రపంచ జీవకోటియొక్క మనుగడకు ఆధారభూతం, సార్వకాలిక సత్యం. భగవంతుడు ధర్మదేవత; ధర్మప్రియుడు! ధర్మపాలకుడు; ధర్మస్థాపకుడు; ధర్మస్వరూపుడు. మానవుడు తనలోని అరిషడ్వర్గములనే పశువులను సంహరించి తన పరిశుద్ధాత్మను విశ్వేశ్వరునకు సమర్పించుట అనేదే ధర్మము" -బాబా. (శ్రీ స. సూ. పు-118).

## శాంతి :

శాంతి అనే పదానికి భౌతికంగా, ఆధిభౌతికంగా, ఆధ్యాత్మికంగా ఉండే అర్థాలను సమన్వయిస్తూ భగవాన్ బాబావారు 'ప్రశాంతివాహిని' లోని మొదటి ప్రబోధలో పేర్కొన్న మాటలు మొదట గమనింపదగినవి- "అసలు ప్రశాంతి అనే పదమునకు అర్థ మేమో ఎరుగనివారుకూడా ఉన్నారు. అది ప్రతి మానవునకు వెన్నెముకవంటిది. సాధకునకు శ్వాసవంటిది. ప్రశాంతి అన్నచో ఒక్కొక్కరు ఒక్కొక్క అర్థము తీసికొని లౌకిక సంబంధమైన

కార్యములు, అభీష్టములు నెరవేరిన అదియే శాంతి యని తలంతురు. అది నిజమైన శాంతి కాదు. అది క్షణభంగురమైన శాంతి. ప్ర అనగా వికసింప జేయుట; శాంతి అనగా కామక్రోధరాహిత్యము. కామక్రోధరాహిత్యమును వికసింపజేయుటే ప్రశాంతి అని అర్థము. శమము మానవునకు ముఖ్యాంగముగా భావించవలెను. అట్టి శమమును అభివృద్ధి చేయుటే సాధకుని కర్మ. సాధకునకు సార్థకము ప్రధానము కదా! శాంతియే సార్థకము. అది మానవునికి స్వభావ సిద్ధముగా నుండునది. వివేక, వైరాగ్య విచక్షణలు మానవునకే ప్రత్యేక అంగము లనియూ, వాటిని పెంపొందించు బలమే శాంతి యనియూ, అది ఆత్మయొక్క కళ యనియు, సర్వకార్యములందు, సర్వశక్తులందు, సర్వానుభవములందు, శాంతి ఆత్మను పోలినదనియు అందురు శాంతికి ఆద్యంతములు లేవు. దానికి ఏ కళంకము రాదు. దానికి అదియే సాటి. అది మనోవాక్కాయకర్మలయందు సమానముగానే యుండవలెను. అదే నిజమైన శాంతి; ప్రశాంతి. ఆ ప్రశాంతి లేక లౌకిక, ఆముష్మిక, కైవల్యములందుకూడ సౌఖ్యము చేకూరదు. సర్వ సౌఖ్యములకు శాంతియే పుట్టినిల్లు. త్యాగరాజు చెప్పినట్లు శాంతము లేక సౌఖ్యము లేదు. శాంతి ఎట్టివారికైనను కావలెను" (ప్ర.వా పు. 1-2)

శాంతి మానవుని ఆత్మస్వభావం. శాంతికోసం బైట వెదకి లాభం లేదు. ఎవరికి వారు తమలో తామే వెదకుకోవాలి. భగవాన్ బాబావారు ఈ అంశాన్ని తెలుగువారికీ, ఇంగ్లీషు తెలిసినవారికీ చక్కని దృష్టాంతంలో చెపుతూ ఉంటారు.

తెలుగు- "స్వామీ! నాకు శాంతి కావాలి అంటారు. 'నాకు' - 'కావాలి' అనే రెండు మాటలమధ్య 'శాంతి' ఉన్నది. శాంతి అనే విలువైన వస్తువునకు అహంకార మనే అట్ట (నేను) ఒకవైపు, కోర్కెలు (కావాలి) అనే అట్ట మరొక వైపు వేసి కట్టి తయారుచేసిన బంగీవంటి దిది. అహంకారం, కోర్కెలు అనే అట్టలను విడదీసి తొలగిస్తే శాంతి మనకు లభిస్తుంది. శాంతి బాహ్యప్రపంచము నందు లభించేది కాదు. దానిని మన హృదయమునందే వెదకి సంపాదించు కొనవచ్చు. శాంతి కావాలంటే సంకల్పశూన్యులు కావాలి. అందరిలో ఉన్న ఆత్మస్వరూపం ఒక్కటే అన్న సత్యాన్ని గుర్తించాలి. భేదభావ మనే భ్రాంతితో పాటు దేహభ్రాంతినికూడా దూరంచేసికోవాలి" (సనాతన సారథి, ఆగస్టు 1983).

ఇంగ్లీషు- "స్వామీ! 'I want peace' అంటారు. I అహంకారానికి చిహ్నం. want కోర్కెలకు చిహ్నం. ఈ రెండింటిని వదలిపెడితే మిగిలే peace (శాంతి) నీవే!"-బాబా.

"ధనముతో మనకు శాంతి లేదు, విద్యతో మనకు శాంతి లేదు, గుణముతో మనకు శాంతి లేదు. బలముతో మనకు శాంతి లేదు, త్యాగములోనే శాంతి ఉంటుంది. ప్రేమలోనే శాంతి ఉంటుంది. ఈ ప్రేమనూ త్యాగమునూ మనము పెంచుకొన్నప్పుడే ఈ ప్రేమా త్యాగమూ (మనో) రథానికి రెండు చక్రములుగా ఉంటాయి; చక్కగా మనం ప్రయాణం చేయవచ్చు. ఈ ప్రేమా శాంతీ అనేటటువంటివి పక్షియొక్క రెండు రెక్కల వంటివి; వాటితో ఎంత దూరమైనా ఎగరటానికి యత్నము చేయవచ్చును. ఈ రెండు రెక్కలలో ఏ రెక్క లేకపోయినప్పటికినీ మనము ప్రయాణము చెయ్యలేము." (శ్రీ సత్యసాయి శాంతిసుధ. పు. 20,21)

శాంతిని పొందాలంటే ముందుగా అశాంతినుండి దూరంకావాలి: అశాంతిని జయించాలి. అశాంతికి మూలం అదుపులేని ఆశలు; కళ్ళాలు లేని కోరికలు. వాటిని నిగ్రహించాలి. బాబావారు తరుచుగా ఒక కథ చెపుతూ ఉంటారు: ఒకసారి ఒక తీర్థయాత్రికుడు తనకు తెలియకుండానే కల్పవృక్షం క్రిందకు చేరి బడలిక తీర్చుకొంటున్నాడు. అతనికి దప్పిక బాగా వేస్తున్నది. 'ఎవరైనా చల్లని నీరు ఒక గ్లాసు తాగటానికిస్తే బాగుండు'నని అనుకొన్నాడు. వెంటనే అతనిముందు మంచినీటిగ్లాసు ప్రత్యక్షమైంది. నీరు త్రాగి దప్పిక తీర్చుకొన్నాడు. ఆ తరువాత ఆతనికి ఆకలివేసింది. తనివితీర భోజనం కావాలని అనుకొన్నాడు. వెంటనే షడ్రసోపేతమైన భోజనం ముబ్బడిగా ఎదుట నిలిచింది. ఆరగించాడు. ఆతరువాత అతని మనస్సు క్రమంగా పడుకోవటానికి ఒక మంచం కావాలనీ, దానిమీద మెత్తని పరుపు కావాలనీ కోరుకొన్నది. అవి వెంటనే సిద్ధమైనాయి. కోరినవన్నీ దొరుకుతుండేసరికి అతను ఉబ్బితబ్బిబ్బై పోయాడు. ఇన్ని ఉన్నాయి, ఇల్లాలు కూడా ఉంటే బాగుండు అని అనుకొన్నాడు. వెంటనే అతని భార్య ఎదుట ప్రత్యక్షమైంది. ఆతను తన కన్నులను తానే నమ్మలేకపోయాడు; ఈమె నిజంగా నా భార్యా? లేక దయ్యమా? దయ్యమై నన్ను చంపి తింటుందేమో? అని అనుమాన పడ్డాడు. అనుకున్నంత పనీ అయింది. ఆమె దయ్యమై అతణ్ణి భక్షించింది. కాబట్టి అదుపులేని కోరికలు ఆత్మవినాశనానికే దారితీస్తాయి.

కోరికలు అదుపు కావటానికి ఇంద్రియ నిగ్రహం అవసరం. ఇంద్రియ సుఖాలను మరిగి దీనుడైనవాడు శాంతుడు కాలేడు. "ఇంద్రియ నిగ్రహమే నిశ్చలశాంతి నిచ్చును. ప్రశాంతియే పరంజ్యోతి" యని బాబావారు ప్రవచించారు. విశ్వామిత్రుడు ముప్పైవేల సంవత్సరాలు ఘోర తపస్సు చేశాడు. అయినా ఆయనకు శాంతి లభించలేదు. బ్రహ్మర్షయైన వసిష్ఠునితో విరోధం పెంచుకొని తాను కూడా బ్రహర్షి కావాలని పలురకాల పాట్లకు గురి అయ్యాడు. ఒకమారు మేనకపై మోహానికి, మరొకమారు రంభపై కోపానికి, మరొకసారి త్రిశంకునికి స్వర్గాన్ని కల్పించటానికై రోషానికి పాలుపడ్డాడు. అంతశ్శత్రువులను జయించనిదే మానవునికి శాంతిలేదు వసిష్ఠుడు శమదమాలతోనే బ్రహ్మర్షి అయినాడనీ, కొడుకులందరూ చనిపోయినా అశాంతికి గురికాలేదనీ తెలిసికొని విశ్వామిత్రుడు శాంతిని సాధించటానికి ఇంద్రియ నిగ్రహము, శమము, దమము ముఖ్యమని గ్రహించి తపస్సు చేసి బ్రహ్మర్షి అయినాడు. ఆ తరువాత శ్రీరామచంద్రునకు గురువైనాడు. తన విద్యలన్నీ రామునకు ధారవోసి సర్వార్పణబుద్ధితో పరమాత్మను సేవించి శాంతుడై ముక్తుడైనాడు. పరమాత్ముని పొందటానికి శాంతియే పరమ సాధనం.

భగవాన్ బాబావారు శాంతి మహిమను గురించి, శాంతి సాధనను గురించి ఇలా పేర్కొన్నారు: "శాంతి నీవు చేయు ప్రతి పనిని పవిత్రము చేయును. కరడుగట్టిన హృదయమును కరిగించి వేయును. భగవంతుని సన్నిధికి నిన్ను గొంపోయి, భగవత్సాక్షాత్కారము గలుగ చేయును. దానికి తారతమ్యములు లేవు. శాంతివలననే భక్తి విశాలమగును. జ్ఞానము వికసించును. శాంతివలన ఉదయించిన జ్ఞానము వలననే నీవు పరిపూర్ణ జీవితము గడుపగల్గుదువు. అదే నీకు ముక్తి ప్రసాదించును. 'నే నెవరు?' అని ప్రశ్నించుకొనిన ఆధ్యాత్మిక మార్గము సుకరమగును." (శ్రీ.స.సా.సూ.పు. 21)

"నే నెవరిని?" - ఆత్మను.

"నేను ఎక్కడినుండి వచ్చాను?" - పరమాత్మ నుండి.

"నేను ఎక్కడికి పోతున్నాను?" - పరమాత్మ వద్దకే.

"నే నెంతకాలం ఇక్కడ ఉంటాను?" - పరమాత్మలో లీనమయ్యేంత వరకు.

''నే నిప్పుడు ఏ రూపంలో ఉన్నాను?'' - ఆత్మ రూపంలో ఉన్నావు.

''నే నిప్పుడు దేనితో సతమతమైపోతున్నాను?'' - అశాశ్వతమైన వ్యవహారాలతో.

''అయితే ఇప్పుడు నే నేమి చేయాలి?'' - అనిత్యమైన వాటిని త్యజించు; నిత్యమైన సత్యంలో ప్రవేశించు.

ఆధ్యాత్మిక మార్గంలో ముందుకు పోయేవారికి ఎన్నో అడ్డంకులు వస్తుంటాయి. పైన పేర్కొన్న ప్రశ్నలను, జవాబులను సాధకులు ఎప్పుడూ మనస్సులలో మననం చేసికొంటుండాలి. స్థిరచిత్తంతో అవరోధాలను అధిరోహించి జీవితలక్ష్యంవైపు సాగాలి. ''మానవ జీవిత పరమావధి నిత్యానందానుభూతి. శాంతి మార్గము ద్వారానే అది పొందుటకు సాధ్యము. ఇది చాలా విలువైన నిధి'' అని బాబావారు నిర్దేశించారు. (శ్రీ.స.సా.సూ.పు. 20.)

భౌతిక దృష్టిలో శాంతి అంటే తృప్తివలన కలిగే మానసిక శాంతి. ఇది కోరికలను తగ్గించుకోవటంవలన సాధ్యమౌతుంది. ఆధిభౌతిక దృష్టిలో శాంతి అంటే ఇంద్రియనిగ్రహం. మనస్సును విషయ సుఖాల నుండి పరమాత్మవైపు మరలించటం ద్వారా ఇది సాధ్యం. కొందరు సంసారాన్ని పరిత్యజించి, సన్యాసం తీసికొంటేనే అది సాధ్యమని భావిస్తారు. కాని అది నిజం కాదు. 'తలలు బోడులైన తలపులు బోడు లౌతాయా?' కోరికలు విత్తులు లాంటివి. ఇంద్రియ సుఖమనే నీరుపోస్తే అవి మొలకెత్తుతాయి. వేయించిన విత్తులు మొలకెత్తవు కాబట్టి కోరికలనే విత్తులను ఇంద్రియ నిగ్రహం అనే అగ్ని మీద పెట్టి వేయించాలి. అంతటితో అవి మొలకెత్తవు. కోర్కెలు మొలకెత్తని చిత్తమే శాంతి సంకేతం. ఆధ్యాత్మిక దృష్టిలో శాంతి అంటే ఆత్మానందస్థితి. ''అంతరాత్మ యొక్క అద్భుతకరమైన అచంచలత్వమే వాస్తవమైన శాశ్వత ప్రశాంతి. ఆధ్యాత్మిక ఔన్నత్యము. ఆనందము, సహజమైన తెలివి కూడా శాంతిలో నిమిడియున్నవి. నిజమైన శాంతి చిత్తవృత్తులను అరికట్టుటవలన లభించును. అదే ప్రశాంతి. అదే ఆత్మానందస్థితి.'' (ప్ర. వా. పు. 3)

శాంతి అంటే నిష్క్రియారూపంగా ఉండే జడస్థితి కాదు. అజ్ఞాన నిద్ర నుండి మేల్కొని సర్వం భగవదర్పితంగా భావిస్తూ చేసే భగవత్సేవయే శాంతికి మార్గం. విషయ త్యాగరూపమైన వివేకంతో, స్వార్థరహిత స్నేహభావంతో,

భగవంతుడు సర్వాంతర్యామి అనే తెలివిడితో, తనలో ఉన్న శాంతిని అన్వేషించి, శాంతి కాంతియైన ప్రేమతో జీవితాన్ని ప్రకాశింప చేసికోవటమే శాంతి. శాంతి ప్రేమకు మందిరం; ప్రేమ శాంతికి సుందరం!

శ్రీ సత్యసాయి సంస్థలు శాంతిని భజనలు, నారాయణ సేవ, జ్యోతి ఉపాసనమనే ధ్యానం మొదలైన సాధనాల ద్వారా సాధించటానికి అంకితమైనాయి. శాంతి మానవుని విలువైన నిధి. అది ఎంత సాధ్యమో అంత స్వతస్సిద్ధం. శాంతిని పొందటం మానవ జన్మహక్కు!

## ప్రేమ :

విశ్వమతానికి ముఖ్యాధారం ప్రేమ. "ప్రేమయే దైవం - ప్రేమలో జీవించు" అని బాబావారి ప్రబోధం. జీవితమనే వృక్షానికి కాసే విలువైన పండు ప్రేమ. ఆ పండుకు అరిషడ్వర్గాలనే ఆరు పొరల తోలు ఉంటుంది. అది చేదు. దాన్ని తొలగిస్తే-అమృతంలాంటి ఫలరసాన్ని-ప్రేమ రసాన్ని రుచి చూడవచ్చు.

"ప్రేమరూపము బ్రహ్మంబు ప్రేమమయము
ప్రేమ ప్రేమతో సంధింప నీమ మగును
కాన ప్రేమను పూర్తిగా కలిగియున్న
అద్వితీయము చెందంగ నర్హుడగును."

భగవాన్ బాబావారు ప్రేమను ఉత్తమ మానవత్వపు విలువగా (Human value) పేర్కొన్నారు- "మానవత్వములో ప్రధాన విలువలు మూడు. అందులో దైవప్రేమ మొదటిది. ప్రేమ ఎక్కడ ఉంటుందో త్యాగ మక్కడ ఉంటుంది. ఎక్కడ త్యాగమో అక్కడ నిర్మలత్వ మేర్పడుతుంది. దేహమునకు చేతులు, కాళ్ళు, శిరస్సు ఎంత ప్రధానమైనవో ప్రేమ, త్యాగము, నిర్మలత్వము మానవత్వమునకు అంత ప్రధానమైనవి. ఈ మూడు అంగములు లేకుండిన మానవత్వమునకు పూర్ణత్వము లేదు. ప్రకాశించే సూర్యుని చూచుటకు సూర్యరశ్మియే ఆధారం. కాని, ఇతర దీపములు ఆధారం కావు. అట్లే దైవ కృపను దైవప్రేమతో పొందుటకు దైవానుగ్రహమే ఆధారం. కాని, అల్పమైనటువంటి సాధనలు ఆధారం కాదు." (సనాతన సారథి-ఫిబ్రవరి, 1984. పు. 33). ప్రేమ అంటే దైవప్రేమ. ఆ ప్రేమ ఫలించాలంటే దైవానుగ్రహం కావాలి.

భగవాన్ బాబావారు ప్రేమమూర్తులు. ప్రేమకొరకే వా రవతరించారు. వారి మాటలు వినండి- "మీ హృదయాలలో ప్రేమజ్యోతిని వెలిగించుటకే నేను వచ్చితిని. అది రోజురోజుకీ ప్రవర్ధమానమై మరింత కాంతిజ్యోతులను వెదజల్లు నట్లు చేయుటకే నేను వచ్చితిని. హిందూధర్మమువంటి ఏ ఒక్క ధర్మ ప్రచారము కొరకు నేను రాలేదు. ప్రేమను పెంపొందించు, ప్రేమలోనే నివసించు, ప్రేమను వ్యాపింప చెయ్యి. అదే నీకు సర్వోత్తమ ఫలితముల నందించు ఆధ్యాత్మిక సాధన." (శ్రీ సత్యసాయి సూక్తులు. పు. 115). "మీ ప్రేమ వాహిని విశాలమై ప్రవహించవలెను. ప్రవహించకుండా నిలచిన నీరు దుర్గంధ భూయిష్ఠ మగును. అందుచేత ప్రేమను ప్రవహింప నివ్వండి. ప్రేమయే ఆనందము; ప్రేమయే శక్తి; ప్రేమయే జ్యోతి; ఆ ప్రేమయే దైవము. నాకొక పేరు ఉండాలని మీరు తలుస్తే ప్రేమస్వరూపుడని పిలవండి." (శ్రీ.స.సా.సూ. పు. 48). ప్రేమకు మారుపేరు భగవాన్.

'ప్రేమ' ఒక గుణం కాదు, ఒక జీవన విధానం. సత్యధర్మశాంతులు మూడూ ఒక యెత్తు, ప్రేమ ఒక్కటీ ఒక యెత్తు. మొదటి మూడూ జీవుణ్ణి దేవుణ్ణిగా మార్చటానికి తోడుపడేవి. ప్రేమ దైవత్వంలో జీవించటానికి తోడ్పడేది. ఎవరి హృదయం ప్రేమతో నిండి ఉంటుందో వారికి సర్వం ప్రేమ మయంగానే కనపడుతుంది. భగవాన్ బాబావారు ప్రేమను ప్రకృతిగానూ, ప్రేమించువానిని భక్తునిగానూ, ప్రేమింపబడేవానిని భగవంతునిగానూ చెప్పి, ముగ్గురూ ఒక్కటే అని ప్రేమవాహినిలో పేర్కొన్నారు. "ప్రేమ, ప్రేమించువాడు, ప్రేమింపబడువాడు మూడు ఒక్కటే. ప్రేమ లేక ప్రేమించువా డుండడు. ప్రేమ, ప్రేమించువా డుండియూ, ప్రేమింపబడువాడు లేనిది ప్రేమకు వినియోగం లేదు. ఈ మూడింటియందు ప్రేమ ప్రధానవస్తువుగా తేలు చుండును. ఇట్లు సమానముగా, ప్రధానముగా ఏది అన్నింటియందు ఇమిడి యున్నదో అదే పరమాత్ముడు. కాన, ప్రేమ ఒక ప్రకృతి. ప్రేమించువాడు భక్తుడు. ప్రేమింపబడువాడు పరమాత్ముడు. ఈ మూడింటియందు భేదము లేదు. ఈ మూడింటియందు సర్వాంతర్యామిగా కన్పడునది ఒక్క ప్రేమయే కాన సర్వము పరమాత్మస్వరూపమే" (పు. 41) "ఇట్టి ఏకత్వమయిన పరమ జ్ఞానమును బోధించునట్టిదే అద్వైతమనియు; ప్రేమించువాడు, ప్రేమింపబడునట్టి జీవబ్రహ్మమను తత్త్వమును పాటించునదే ద్వైత మనియు; ప్రేమ, ప్రేమించు

వాడు, ప్రేమింపబడునట్టి ప్రకృతి, జీవుడు, బ్రహ్మ అను తత్త్వమును ఆచరించునదే విశిష్టాద్వైత మనియు చెప్పవచ్చు. అయితే ఈ మూడు ఒక్కటియే. పుట్టిన బిడ్డయే విద్యార్థిబిడ్డగా మారును; విద్యార్థిబిడ్డయే గృహస్థుడుగా మారును. ఈ మువ్వురూ ఒక్కడే కదా! అయితే విధానములు, విషయ వాసనలు పలువిధములుగా మారును. వాడుమాత్రము ఒక్కడే. పాలనుంచి వెన్న, మజ్జిగ బయలుదేరును. అన్నింటికీ మూలధారము పాలు కదా! అన్నింటిని ఇముడ్చుకొన్న పాలే అద్వైతము; అందులోని రెండు తత్త్వములు చేరిన వెన్నయే ద్వైతము; అది దూరమయిన తరువాత నిలుచునట్టి మజ్జిగయే విశిష్టాద్వైతము." (పు. 42)

లౌకికదృష్టితో ప్రేమ అనురాగంగా, వత్సలంగా, స్నేహంగా, దయగా, కరుణగా, భార్యాభర్తలలోని రతిభావంగా బహురూపాలతో కనపడుతుంది. వీటిలో స్వార్థదృష్టి ఉంటే ప్రేమగా పరిగణింపబడవు. స్వార్థం లేనిది, త్యాగంతో కూడినది అయిన స్వచ్ఛమైన అనురాగం ప్రేమ. ఇది నేటి ప్రపంచంలో విశ్వ మానవసౌభ్రాతృత్వ మనే భావంగా పరిగణింపబడుతున్నది. బాబావారన్నట్లు ఇది విశిష్టాద్వైతం లాంటిది. అధిభౌతికస్థాయిలో ప్రేమభావం 'మానవసేవయే మాధవసేవ' అని భావించి ఆచరించే ప్రవృత్తిగా పరిగణింపబడుతుంది. ఇది ఒక విధంగా ద్వైతం లాంటిది. ఆధ్యాత్మికస్థాయిలో ప్రేమ అంటే 'ఆత్మవత్ సర్వభూతాని' అన్న అనుభవ విశేషమే. ఇది అద్వైతస్థితి. ఇది ఉత్తమమైనది, నిత్యమైనది, పరమాత్మరూపమైనది. దీనికి భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారే, వారి జీవితమే. నిదర్శనం.

"నా రూపము ప్రేమమయము. పూర్వము శ్రీరామ కృష్ణ రూపములలో జన్మించి ప్రేమను ప్రదర్శించియుంటిని. ఇంతకు పూర్వము షిర్డి సాయి నామమున అవతరించియుంటిని. ఇప్పుడు సత్యసాయిబాబాగా ప్రేమతత్వమును ప్రదర్శించుచున్నాను. ప్రేమచే నేను నా భక్తులను రక్షించుటకై త్వరపడుదును. అది స్థూలముగా మూడు విధములు. (1) ఆర్తితో నా భక్తులు నన్ను పిలిచినప్పుడు ప్రేమతో నే నటనుందును. (2) భక్తులు ఎట్లున్నారో అని దివ్యదృష్టితో చూచి బాధ నొందుచున్న వారిని రక్షింతును. (3) నేను నా భక్తునకు ప్రేమపూర్వకంగా ఇచ్చిన వస్తువు నా కండ్ల ఎదుట నిలుచును. అంత ఆ భక్తుని

ప్రమాదమునుండి రక్షింతును. అట్లు చేయుటలో ఒక్కొకమారు స్థూల దేహమును వదలి దివ్యశరీరముతో ఆ భక్తుని రక్షించుకొనుటకు యోగమార్గమున పోవుదును. భక్తుల ప్రేమయే నన్నిట్లు పురికొల్పును. నేను భస్మమును, ప్రతిమలను (లాకెట్లను), విగ్రహములను, బంగారమును, నవరత్నములను కూడ ఎవరికేది యే సమయమున నీయవలెనో వారి కప్పుడు దాని నిచ్చెదను. ఇందు ఒకదాని విలువ ఎక్కువ, ఒకదాని విలువ తక్కువ కాదు. అవి నా ప్రేమకు నిదర్శనములు. మీ మీ సాధనములు, నిష్కామ సేవలు, ఆర్తి మొదలైన అర్హతల ననుసరించి మీపై నా ప్రేమ ప్రసరించు"నని భగవాన్ బాబా వారు తమ దివ్యప్రేమతత్వాన్ని ప్రకటించారు; ప్రసాదించారు.

భగవంతుని ప్రేమ మనలో ప్రవహించటానికి మనం తగిన యోగ్యతను సంపాదించుకోవాలి. దీనికి శ్రీకృష్ణుని మురళిని ఉదాహరణంగా బాబావారు పేర్కొంటున్నారు-"ఒకనాడు కృష్ణుడు మురళిని వదలివేసి గాఢనిద్ర పోతున్నట్లు నటించాడు. రాధ అదృష్టవంతురాలైన మురళి చెంతకు వెళ్ళి 'ఇంతటి భాగ్యం నువ్వు ఏ విధంగా సంపాదించుకొన్నావో నాకు చెప్పవా? ఏమి నోములు నోచావు? ఎన్ని జాగరణలు చేశావు? ఏ పుణ్యతీర్థాలు సేవించావు? ఏ మంత్రం జపించావు? ఏ మూర్తిని పూజించావు?' అని దీనంగా వేడుకున్నది. భగవదను గ్రహంవలన వేణువుకు మాటలు వచ్చాయి. 'నేను అన్ని ఇంద్రియ వాంఛలూ, అసూయా, దురాశా, అహంభావమూ విసర్జించాను. నాదీ అనేది ఏదీ అడ్డు రాకుండా చేసుకొన్నాను. ఆ ప్రభువు ప్రేమవాహిని నాద్వారా సకల సృష్టిమీదా ప్రసరించాలని కోరుకున్నాను. అంతే' అంది మురళి. మీలో వున్న ప్రేమ ఒక వరప్రసాదంగా ఎంచుకొని పెంచుకోవాలి. జీవులందరు దాన్ని పంచుకునేటంతగా ఇనుడింప జేయాలి. రామకృష్ణ పరమహంసలో అటువంటి ప్రేమ ఉండేది. దగ్గర ఉన్న వాళ్ళలో ఎవరైనా దిగులుగా ఉంటే ఆయన కూడా విచారంగా ఉండేవాడు. తన మహాప్రేమభావం ద్వారా ఆయన అందరితో తాదాత్మ్యం పొందేవాడు" (శ్రీ స. సా. వ. అమృతం. 2.121). అంతశ్శుద్ధితో కూడుకొన్న జీవకారుణ్య భావంగా భగవత్ప్రేమ మనకు గోచరిస్తుంది. అది ప్రవహించే మనలో అహంకారాదులైన అడ్డంకులను తొలగించుకోవాలి. మురళిలా పరమాత్మ రూపమైన ప్రేమను మనలో నింపించుకోవాలి.

బాబావారు ప్రేమమూర్తులని చెప్పటానికి సత్యం శివం సుందరంలో నుంచి ఒక దృష్టాంతం: బాబావారు ఉంటున్న బంగళాకు ఎదురుగ్గా రోడ్డు ప్రక్కన ఒకమూల ఒక చెప్పులు కుంటేవాడు తన వృత్తి తాను చేసికొంటూండేవాడు. బాబావారు అవతార పురుషులని భక్తులు అనుకొంటూ ఉండగా అతను విన్నాడు. స్వామిని దర్శించుకోవాలని ఆసక్తితో అవరణలోకి వచ్చి బాబావారు కూర్చున్న హాలులోకి తొంగిచూచాడు. బాబావారు వెంటనే లేచి అతని వద్దకు వచ్చారు. అతని చేతుల్లో బాబాకోసం తెచ్చిన వాడిన పూలదండను అప్యాయంగా తీసికొన్నారు. అతను వినయంతో, భక్తితో బాబావారిని తన యింటికి రమ్మని, తన అతిథ్యాన్ని స్వీకరింపుడనీ ప్రార్థించాడు. తప్పకుండా వస్తానని బాబావారు వాగ్దానం చేసి, వెళ్ళి, తమ సింహాసనం మీద కూర్చున్నారు. అతను బాబావారికి తన యింటి చిరునామా యివ్వాలనీ, ఎప్పుడు వచ్చేదీ తెలుసుకోవాలనీ ఎంత సేపో వేచియున్నాడు. కానీ, బాబావారు మరల అతని దగ్గరకు రాలేదు. ఎన్నో రోజులు గడిచిపోయాయి. అతను బాబావారు తన యింటికి ఎప్పుడు వస్తారో అని లోలోన తపన పడుతూ ఉండేవాడు. తన వృత్తి తాను చేసికొంటూ ఉండేవాడు. ఒక రోజు అనుకోకుండా బాబావా రెక్కివస్తున్న కారు అతని ముందు రోడ్డు మీద అగింది. బాబావారు కారు దిగి అతణ్ణి కారెక్క మని పిలిచారు. అతను ఎక్కాడు. బాబావారి కారు అతని యింటిముందు అగింది. అతనితో పాటు బాబావారూ కారు దిగి, అతని పూరిగుడిసెను పావనం చేసి, కొన్ని పండ్లను, తీపి తినుబండారాలను సృష్టించి ప్రసాదంగా ఇచ్చి, అతనిని ఆశీర్వదించారు. అతను భక్తితో స్వామికి సమర్పించిన అరటిపండ్లు స్వీకరించారు. అమృత హృదయంతో అందరినీ కరుణించే దివ్య ప్రేమ అటువంటిది.

ప్రేమను మన మేవిధంగా అలవరచుకోవాలనో బాబావారే రెండు పద్ధతుల ద్వారా మనకు ప్రబోధించారు:

1. ఇతరుల తప్పులను ఎంత పెద్దవి అయినా వాటిని మనం చాలా చిన్నవిగా పరిగణించాలి. వాటిని పట్టించుకోకూడదు. మన తప్పులు ఎంత చిన్నవి అయినా వాటిని పెద్దవిగా భావించి పశ్చాత్తాపాన్ని పొందాలి.

2. మనం మనకొరకుగాని, ఇతరులను ఉద్దేశించిగాని ఎటువంటి పనులు చేస్తున్నా, భగవంతుడు సర్వవ్యాపియై వాటిని గమనిస్తున్నాడని జ్ఞాపకం ఉంచుకొని చేస్తుండాలి.

మన హృదయం ఒక ఉద్యానవనం వంటిది. అందులో పూసే సువాసనగల పూలే ప్రేమ పుష్పాలు. భక్తి, వినయం, విశ్వాసం అనే విత్తులను నాటాలి. విషయ సుఖాలు, అత్యాశ, అహంకారం, అసహనం లాంటి కలుపు మొక్కలను పెరికి వేయాలి. మనం ప్రేమతో నిండిన మనస్సులను పెంచుకోవాలి. పరుషమైన మాటలు ఈటెలకంటె వాడిగా తాకి ఎదుటివారిని బాధిస్తాయి. కాబట్టి మనం పరుషవచనాలను మాట్లాడరాదు. మాటల్లో మనిషి మనసు పరిమళిస్తుంది. మాటలోని మాధుర్యం, మనసులోని ప్రేమ, ప్రేమతో నిండిన మాట ఎదుటి వారిమీద బలమైన ప్రభావం వేస్తుంది. దీనికి బాబావారు చెప్పిన ఒక చిన్న ఉదాహరణ:

ఒక స్కూళ్ళ ఇన్స్పెక్టరు ఒక బడిని తనిఖీచేయటానికి వచ్చి ఒక తరగతి గదిలో ప్రవేశించాడు. ఆ గదిలో ఉపాధ్యాయుడు నీతి వాక్యాలు చదివి విద్యార్థులకు బోధిస్తున్నాడు. పరీక్షాధికారి ఆ పంతులు గారితో ఇలా అన్నాడు - 'మీరు చెప్పే మాటలతో ఈ పిల్లల ప్రవర్తనను ఎలా మార్చగలరు? మీ చర్యలలో, ప్రవర్తనలలో ఆచరించి చూపించండి.' ఆ మాటలు విని ఉపాధ్యాయుడు అభ్యంతరం చెప్పాడు. మాటలకు కూడా లేతమనసులను మార్చే మహనీయమైన శక్తి ఉన్నదని వాదించాడు. ఇరువురిమధ్యా వాదోపవాదాలు కొంతసేపు జరిగాయి. చివరకు ఉపాధ్యాయుడు పరీక్షాధికారికి తన వాదంలోని నిజం తెలియచెప్పటానికి ఒక చిన్న ఉపాయం పన్నాడు. ఒక విద్యార్థితో - 'బాబూ! ఈ అధికారిని మెడబట్టి బయటికి గెంటివెయ్' అని అన్నాడు. ఈ మాటలు అధికారి విని పలాయనం చిత్తగించాడు. అంతలో ఆయనతో ఉపాధ్యాయుడిలా అన్నాడు - 'అయ్యా! నేను మాటలరూపంలో కొన్ని ధ్వనులు చేశాను. మిమ్మల్ని ఎవ్వరూ చేతులతో గెంటివేయలేదు. అయినా మీరు భయపడి పారిపోతున్నారు. కాబట్టి ఇప్పటికైనా మాటలకు బాలుర ప్రవర్తనను, శీలాన్ని దిద్దితీర్చే శక్తి ఉందని అంగీకరిస్తారా?' అని అన్నాడు. అధికారి సిగ్గుతో తలవంచుకొన్నాడు. ఈ కథ వలన మాటల కున్న శక్తి తెలిసింది. మనం కూడా ప్రేమనిండారిన మాటలనే అలవరచుకోవాలి. ఇతరులను గర్హించే మాటలను, మోసగించే మాటలను వదలి వేయాలి. ఎందుకంటే, అసహనం కీచులాడుతుంది; భయం రోదిస్తుంది; గర్వం ఎగిరిపడుతుంది; మోసం గాయపరుస్తుంది; కాని, ప్రేమ ఓదారుస్తుంది; సుఖమిస్తుంది. అందువలననే రోజుకు మూడు వేళలా ప్రేమ ప్రకటించుమని స్వామి ప్రబోధించారు. "Start the day with Love; Fill the day with

**Love; and end the day with Love; for that is the way to God."** నీ దైనందినిక కార్యక్రమాన్ని ప్రేమతో ప్రారంభించు; పగలు ప్రేమతో నింపు; ప్రేమతో రోజును ముగించు - అదే భగవంతుని చేరే మార్గం.

మానవుడు ప్రేమమూర్తి అయితే అతడు తప్పకుండా ధర్మమూర్తి అయి తీరుతాడు. ప్రేమ భగవంతునిపై లగ్నమైతే మనిషిలో తీవ్రమైన మార్పు వస్తుంది. అతడు సాటివారి సుఖదుఃఖాలలో పాలుపంచుకొనగలుగుతాడు; విశ్వ ప్రేమమహాసాగరంలో నదిలా కలిసిపోగలుగుతాడు. ప్రేమవలన అహింసాది గుణాలు ఆవిర్భవిస్తాయి. పులిని వేటాడిన ఇంగ్లీషు సబ్ డివిజనల్ ఆఫీసరుకు పులిపిల్లల దయనీయస్థితి చూపించి దయను కలిగించి అహింస యొక్క విలువను బాబావారు ప్రబోధించిన కథ 'సత్యం శివం సుందరం'లో ప్రసిద్ధం.

మన ఆధ్యాత్మిక సాధనలో ధర్మం మన మార్గం; సత్యం మన అన్వేషణకు లక్ష్యం; ప్రేమ మన వైఖరి; శాంతి మనకు ఊత. బాబావారు చెప్పినట్లు ప్రతి మానవుడు తన ఆధ్యాత్మిక కుటుంబాన్ని నిర్మించుకోవాలి. ఆ కుటుంబంలో సత్యమే తండ్రి; ప్రేమయే తల్లి; శాంతియే కూతురు; జ్ఞానమే కుమారుడు. వీరి నెప్పుడూ వదలిపెట్టవద్దు; నిర్లక్ష్యం చేయవద్దు.

[శ్రీ సత్యసాయి సేవా సంస్థల (ఆం.ప్ర.) సౌజన్యంతో]

# మానవత్వపు విలువలు – ఆధ్యాత్మికత

**—శ్రీ తెన్నేటి పూర్ణచంద్రరావు**

ఏ కాలంలో గాని ఏ దేశంలో గానీ నాగరిక మానవ సామాజిక జీవితానికి మూల స్తంభాలు రెండు : అవి వాస్తవికతా నిర్ణయం (Factual judgement), విలువల నిర్ణయం (Judgement of Value). వీటిలో మొదటిది విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి తోవతీస్తే రెండవది సంస్కృతీ వికాసానికి దోహదం చేస్తుంది. మానవ జీవితంలో అడుగడుగునా ఎంపిక (choice) అవసరం అవుతూ ఉంటుంది. ఏదో ఒక ప్రమాణాన్ని బట్టి ప్రతి మానవుడూ ఈ ఎంపికలు చేయక తప్పదు. వాస్తవికతా నిర్ణయాలు వాస్తవాలను ఉన్నవాటిని ఉన్నట్లుగా వర్ణించేవిగా ఉంటాయి. ఉదాహరణకు హైదరాబాదు నుంచి విజయవాడ ఎంత దూరంలో ఉన్నదో తెలుసుకోవటం వాస్తవికతా నిర్ణయం. అలాగాక కొన్ని విలువలు నిర్ణయాలుగా ఉంటాయి. ఉదాహరణకు ఈ పద్యం రసాత్మకంగా ఉన్నదా లేదా అనేది ఆ పద్యంలోని వివిధాంశాలకు మనం ఇచ్చే విలువని బట్టి ఉంటుంది. మానవతా విలువలు అంటే 'మానవ వ్యక్తి ఒక మార్గం బదులు మరొక మార్గాన్ని వాటి మంచిచెడ్డల నిర్ణయాన్ని బట్టి ఎన్నుకొనటానికి ఆధారంగా ఉండే విలువ లేక విలువ వ్యవస్థ' అని నిర్వచించవచ్చు. విలువలు కేవలం ఆత్మాశ్రయాలూ, సాపేక్షాలు అని వాదించేవారు ఉన్నారు. బాహ్యంలో స్వతంత్రంగా ఉంటాయని వాదించేవారూ ఉన్నారు. ఇందులో ఏదీ పూర్ణసత్యం కాదు. విలువలు కొంతవరకు ఆత్మాశ్రయాలు, కొంతవరకు వస్త్వాశ్రయాలు అనేదే అందరికీ సమ్మతమైన మతం. గ్రీకులకాలం నుంచి ఈనాటి వరకు మిగిలిన అన్నింటికన్నా మూడు విలువలను ఉత్తమోత్తమమైనవని భావించారు. అవి మంచితనం, అందం, సత్యం, భారతీయులు వీటిని సత్యం. శివం, సుందరం అని వ్యవహరించారు.

మానవజీవితం ఆనందమయంకావాలంటే విలువలను జాగ్రత్తగా ఎంచుకోవలసి ఉంటుంది. అలా చేయటంలో కొన్ని సూత్రాలను పాటించటం అవసరం.

దేనినైనా మనం దానికోసమే కోరినట్లైతే, దానిని మరి దేనినో పొందటానికి ఉపయోగించకపోతే దానికి అంతర్గతమైన విలువ ఉన్నదన్నమాట (Intrinsic-value). ఎప్పుడూ నాగరికుడు బాహ్య విలువ కన్న అంతర్గత విలువను ఎక్కువగా అంచనా వేస్తాడు. అలాగే ఎక్కువ శాశ్వతమైన వాటికి తాత్కాలిక మైన వాటికన్న ఎక్కువ విలువనిస్తాడు. మరొక సంగతి, ఇతరులు తన మీద రుద్దినవి కాక తాను ఏర్పరచుకున్న విలువలకే అగ్రస్థానం లభిస్తుంది. ఒక ప్రఖ్యాత విమర్శకుడిలా అంటాడు: "తాను ఏ ధర్మానికి విధేయుడుగా ఉన్నాడో దానికి తానే సృష్టికర్తను అనే ఎరుక కలిగినవాడు నిజంగా స్వేచ్ఛ కలవాడు. చివరగా జీవితపు మొత్తం విలువలలో మనకు ఏదో ఒక లాభం లేదా అభివృద్ధి ఉండే విధంగా మనం వర్తించాలి. మన ఇష్టాయిష్టాలు పరస్పరం సంఘర్షిస్తాయి. అందువల్ల ఏ విలువలని మనం అనుసరించాలి అనేది హేతువునుబట్టి నిశ్చయించాలి. ఈ విధంగా మానవత్వపు విలువలను హేతుబద్ధంగా సమతులనం చెడకుండా అనుసరించగల మానవుడే నాగరికుడు. అలా అనుసరించగలిగిన సంఘం లేదా సమాజం నాగరికం. విలువలను తెలిసికొని వాటిని కలిగి ఉండటం ఒక ఎత్తు. వాటిని సరిగా ఎన్నుకుని సామరస్య పూర్వకంగా వాటిని అనువర్తించటం మరొక ఎత్తు.

## ఆధునిక శాస్త్రవిజ్ఞానం :

ఆధునిక విజ్ఞానశాస్త్రాలు - ముఖ్యంగా ఆంత్రొపాలజీ, సోషియాలజీ, సైకాలజీ మొదలైనవి విలువలు సాపేక్షాలేననీ, వివిధ మానవ సమూహాలు వివిధ మైన విలువలను పాటిస్తాయనీ అంటున్నాయి. కొంతవరకు ఇది నిజమే కావచ్చు కాని, మానవుని స్వభావం మీద, అతడు జీవిస్తున్న ప్రపంచ స్వభావం మీద ఆధార పడినవి, సర్వకాలాలకు దేశాలకు చెందినవి అయిన విలువలు కూడ చాలా ఉన్నాయి. మానవుని జీవితం కొనసాగటానికి అభివృద్ధి చెందటానికి అవి అవసరం. ఉదాహరణకు ఆరోగ్యం, జ్ఞానం, వివేకం, సుఖం, సంతోషం, ధైర్యం, దయ, నిజాయితీ, ప్రేమ, స్నేహం, కృతజ్ఞత, సౌందర్యం వంటివి అటువంటివే. వీటికి వయస్సుతో, లింగభేదంతో, తెలివితో, సంస్కృతితో, సాంకేతిక పరిజ్ఞానంతో నిమిత్తం లేదు. సర్వమానవులు సర్వదా వీటిని ఉత్తమ విలువలుగా పరిగణిస్తూ వచ్చారు. విజ్ఞానశాస్త్రం వాస్తవికతా విలువలకు మితిమీరిన ప్రాధాన్యత

నిచ్చి, ఆ విధంగా లభించిన జ్ఞానాన్ని అటు మంచికీ ఇటు చెడుకూ గూడ ఉపయోగించవచ్చుననే మాట మరచిపోయింది. నాజీ జర్మను ప్రభుత్వ ఆదేశాల క్రింద బ్రిటను, రష్యా అమెరికాలను ధ్వంసం చేయటానికి క్షిపణులను తయారుచేసిన శాస్త్రజ్ఞులే యుద్ధానంతరం పూర్తిగా దీనికి విరుద్ధమైన లక్ష్యంకోసం పనిచేశారు. దీనినిబట్టి విజ్ఞానశాస్త్రం విలువలను ప్రక్కకునెట్టి వాస్తవాలకు అవసరమైన దానికంటె ఎక్కువ గొప్పతనాన్ని అంటగట్టింది అని తేలింది. వాస్తవికతా నిర్ణయాలకు విలువల నిర్ణయాలకు సమతుల్యం లేకుండా పోయింది.

## ఆధునిక నాగరికతలోని అనర్థాలు :

ఇందువల్ల ఆధునిక నాగరికత ఎన్నో మహత్తర విషయాలను సాధించినా అనేక అనర్థాలకు కారణమవుతున్నది. విలువలకు ప్రాముఖ్యత తగ్గిపోయి వాస్తవాలకు పెరగటంవల్ల సమాజంలోని అనేక భాగాలు క్షీణించిపోయాయి. కార్లు, విమానాలు, యంత్ర పరికరాలు మొదలైనవి మనకు సంతోషాన్ని వృద్ధి చేసి మంచి జీవితాన్ని నెలకొల్పుతాయనే భ్రమలో జీవించటం జరుగుతున్నది. మానవ చైతన్యం బ్రతికి బట్ట కట్టటానికి విలువలు, పథనిర్దేశం (Direction) అవసరమవుతాయి. సాంకేతిక పరిజ్ఞానంవల్ల మానవుడికి శ్రమభారం తగ్గి విశ్రాంతి అధికమై సాంస్కృతిక వికాసం లభించేమాట నిజమే కావచ్చు. కాని ఆత్మనిగ్రహం, శాశ్వతమైన విలువలకు అంకితం కావటం లోపిస్తే సాంకేతిక విజ్ఞానం మానవత్వ లక్షణాలనే మాయం చేస్తుంది. మళ్ళీ మనం నాజీ జర్మని ఉదాహరణనే తీసుకొంటే, నాజీ ప్రభుత్వం నిర్దాక్షిణ్యంగా యూదులను మూక ఉమ్మడిగా చిత్రహింసలకు గురిచేస్తున్నప్పుడు విద్యావంతులైన జర్మనులు దానిని నివారించకపోవటం గమనార్హం వారి విద్య ఏమైనట్లు?

ఈనాడు మన దేశంలో కూడా మతం పేర, కులం పేర, భాషా ప్రాంత విభేదాల పేర జరుగుతున్న మారణ కృత్యాలను, దౌర్జన్యాలను విద్యావంతులైన వారు ఎందుకు నివారించలేకపోతున్నారు? కనీసం వారు సంఘటితమై వీటిని ఎదుర్కొగలుగుతున్నారా? దీనికి రెండు కారణాలను మనం స్పష్టంగా గుర్తించవచ్చు. మొదటిది విజ్ఞాన సాంకేతిక శాస్త్రాలు, ప్రత్యేకీకరణకు (Spcialisation) అమిత ప్రాధాన్యత నివ్వటం చేత విలువలను అధ్యయనం చేసే అవకాశం లభించక అవి ప్రక్కకు పోయినాయి. వారి వారి క్షేత్రాలకు సంబంధించిన

వాస్తవాలలో మాత్రమే ఆసక్తి కలిగి, సమాజానికి, మానవజాతికి, ప్రపంచానికి చెందిన విశాల సమస్యలను పట్టించుకోని విద్యావంతులతో దేశం నిండి పోయింది. నాజీ సిద్ధాంతం వ్యాపించటానికి విలువలలో ఏర్పడ్డ గంద్రగోళం, నైతిక పక్షవాతం ముఖ్య కారణంగా చెప్పుకోవచ్చు

ఇక రెండవ కారణం, జనాభా విపరీతంగా పెరిగిపోవటంతో విద్య అంటే వృత్తి విద్య మాత్రమే (Vocational) అయింది. పరికరాలు, యంత్రాలను గురించిన జ్ఞానం తప్ప చారిత్రక సాంస్కృతిక వారసత్వాన్ని గురించిన భావనకు తావు లేకుండా పోయింది. ఇది లేనప్పుడు నైతిక వ్యవస్థగాని ప్రమాణాలుగాని ఉండవు. నిజమైన సంస్కృతి లోపిస్తుంది. ఫలితం సమూహ - మనుష్యుడు (Mass - man) ఆధునిక ఆటవికుడు సృష్టికావటం, నానాటికీ విపరీతంగా పెరిగిపోతున్న నేరాల సంఖ్య, ముఖ్యంగా బాలనేరస్థుల సంఖ్య, ఆలోచనాపరులైన వారికీ ఎంతో కలవరాన్ని కలిగించటమేగాక, సంస్కృతీ వినాశనం ఎటువంటి దుష్పరిణామాలకు దారితీస్తుందో నిస్సందేహంగా ఋజువుచేస్తున్నది. ఈనాటి విద్యార్థుల ధోరణిని జాగ్రత్తగా అధ్యయనం చేసిన ఒక ప్రముఖ పాశ్చాత్య ఉపాధ్యాయుడు ఇలా అంటున్నాడు:

"అర్థంలేని హింసాకృత్యాలను అంగీకరించటం లేదా నైతికంగా తిరస్కరించటం ఇమిడి ఉన్న పరిస్థితులకు విద్యార్థుల ప్రతిచర్య (Reacation) ను రాబట్టటంలో ఉపాధ్యాయుడుగా నా అనుభవాన్ని బట్టి, కళాశాలా స్థాయి విద్యార్థులలో దాదాపు మూడవవంతు మందిని, అన్నివిధాలా, నైతికంగా బుద్ధిహీనులుగా లేదా కనీసం నైతిక నిరక్షరాస్యులుగా పరిగణించవచ్చు. ఈనాటికీ పాక్షిక అనువర్తనను మాత్రమే కలిగిఉన్న నైతికపు విలువలను కూడ వీరికి ఎంత హీనంగా అందించటం జరిగిందంటే, వీరు కార్యరూపంలో కాకున్నా సంభావ్యతలో అపరాధులే. కాలేజిలో చేరటానికి ముందు వీరిని తెలివితేటల పరీక్షలకు వ్యక్తిత్వ వికాస పరీక్షలకు గురిచేసి ఎన్నిక చేసినప్పటికి, పూర్ణ వికాసం పొందిన మానవులుగా ప్రవర్తించటానికి సమర్థులయ్యే విధంగా వీరు నైతికపు విలువలను ప్రయోజనాలను సంపాదించుకోలేదు. మిగిలిన సమాజంతో పాటుగా వీరు పాలుపంచుకొనే పెద్దవారి అలవాట్ల ముసుగులో వీరి విలువలు శైశవప్రాయంగా, పాశవిక నేర ప్రవృత్తి కలిగినవిగా కూడ ఉండిపోయాయి" (Lewis Mumford : Tne conduct of Life.)

సమాజ శ్రేయస్సును విశ్వశ్రేయస్సును కాంక్షించే ఆలోచనాపరులు వేసుకోవలసిన ఒక ప్రశ్న ఇక్కడ మనకు ఎదురవుతుంది. అది, మనం పెంపొందిస్తున్న విలువల వ్యవస్థ మన స్వార్థ పాశవిక ప్రవృత్తులను బల పరచేదిగా ఉన్నదా లేక ఉదార సృజనాత్మక స్వభావాన్ని పటిష్ఠం చేసేదిగా ఉన్నదా? మన భవిష్యత్ నాగరికత బ్రతుకు ఈ ప్రశ్నకు సమాధానం మీదనే ఆధారపడి ఉన్నది.

ఇంతవరకు జరిగిన చర్చవల్ల రెండు ప్రముఖమైన విషయాలు స్పష్ట పడుతున్నాయి.

ఒకటి : మానవ జాతికి ఒకే ఒక అంతిమ విలువ ఉన్నట్లు కనిపిస్తుంది. దానిని అనేక పేర్లతో వ్యవహరించటం జరుగుతున్నది - ఆత్మ - వాస్తవీకరణ (Self - actualisation), ఆత్మ - సాక్షాత్కారం (Self - realization), సమగ్రత (Integration), మనస్తత్వ ఆరోగ్యం, ప్రత్యేక వ్యక్తిత్వ రూపకల్పన (Individuation), స్వపరిపాలన (autonomy), సృజనాత్మకత (creativity), ఉత్పాదకత (Productivity) మొదలైనవి. పేర్లు ఏవైనా వ్యక్తిలోని సంభావ్యతలను సిద్ధింపజేసుకోవటం అంటే పూర్తి మానవుడు కావటం, వ్యక్తి కాగలిగిన దంతా కావటం ఈ అంతిమ లక్ష్యం అని తేలుతున్నది.

రెండు : మానవుని నిర్మాణం ఎలా ఉన్నదంటే అతడు అధికాధికంగా పూర్ణ అస్తిత్వం వైపుగా పోయే ఒత్తిడికి లోనవుతున్నాడు. అంటే మానవులు మంచి విలువలు అనిపిలిచే ప్రశాంత మనస్సు, దయ, ధైర్యం, జ్ఞానం, నిజాయితీ, ప్రేమ, నిస్స్వార్థ బుద్ధి, మంచితనం వైపు పోవటానికి ప్రేరేపించి ఒత్తిడి కలిగించేది ఏదో అతనిలో ఉన్నది. ఈ కారణంగానే అతడు వ్యక్తిత్వాన్ని ఏకోన్ముఖం చేయటం వైపు, స్వచ్ఛంద ప్రకటన వైపు, పూర్ణ వ్యక్తిత్వం వైపు, గ్రుడ్డితనం కాకుండా సత్యాన్ని చూడటం వైపు, సృజనాత్మకత, మంచితనం వైపు ఇంకా ఇలాంటి ఎన్నో విషయాల వైపుగా త్రోసుకొనిపోతున్నాడు.

ప్రపంచంలోని మతాలు, మహా తత్త్వవేత్తలు తదితరులు ఈ విలువలనే ఇంత కాలమూ ప్రబోధిస్తూ వచ్చారు. ఈనాటి మానవుడు యదార్థమైన విలువ లను కనిపెట్టి తనతోటివారితో వాటిలో పాలు పంచుకోవాలి. వాస్తవాల ప్రపంచానికీ విలువల ప్రపంచానికీ మానవుడు పొత్తు కుదర్చాలి. ఆ విధంగా

చేయలేకపోతే మానవ జాతికి అధోగతే శరణ్యమవుతుంది. ఆ విధంగా ఈనాటి మానవుడు చేయగలడా?

## 2

పై ప్రశ్నకు సమాధానం చేయలేడు అని చెప్పవచ్చు: చేయగలడు అని చెప్పవచ్చు. భారతీయ తాత్త్విక పరిభాషలో, మానవుడు తన నిమ్న ప్రకృతికి అంటే గీతా వాక్యాలలో అపరా ప్రకృతికి బద్ధుడై ఉన్నంత కాలం ఆ పని చేయలేడు. అతడు తన ప్రస్తుత ప్రకృతిని అధిగమించి దైవీ ప్రకృతిని (ప్రకృతిం విద్ధిమే పరాం) అంటే పరాప్రకృతిని చేరి, అక్కడ తాను సంపాదించిన శక్తితో తిరిగి ప్రపంచ జీవితంలో ప్రవేశించినప్పుడు ఆ విధంగా చేయగలడు. మొదటిచూపుకు ఇది చాలా సమూలమైన విప్లవాత్మకమైన మార్పుగా, అసంభవంగా అనిపించవచ్చు. లేదా ఇది కేవలం ఆదర్శనిద్రాసక్తుల స్వప్నంగా కనపడవచ్చు. కాని మానవ ప్రకృతిలో మార్పురాకుండా మానవ జీవితంలో మార్పు రావాలని ఆశించటం అహేతుకం అంతేగాదు, అసహజం: అయథార్థ అసంభవ అద్భుతం. దీనిని గురించి వివరించే ముందు మానవ జీవితంలో ఉన్నతమైన విలువలు నెలకొనటానికి ప్రత్యామ్నాయ మార్గాలేమిటో పరిశీలించవలసి ఉంటుంది.

మొదటగా, వ్యక్తిగతంగా సత్కార్యాచరణవల్ల ఈ విలువలను తీసుకొని రావచ్చు అనే అభిప్రాయం కొంతమందిలో ఉన్నది. సత్ప్రవర్తన, పరోపకారం, పుణ్య కార్యాచరణ వంటి వాటివల్ల మంచి విలువలు రావచ్చు. కాని ఆధ్యాత్మిక దృష్టిలో ఇవన్నీ త్రిగుణాత్మక ప్రకృతిలోనివే. కాకపోతే, సత్త్వగుణానికి చెందినవి. సత్త్వగుణం కూడ ప్రకృతిలోనిదే. ప్రకృతి అజ్ఞానంతో నిండి ఉంది. అజ్ఞానానికి అహంకారం కేంద్రం. అందువల్ల సత్త్వగుణం వల్ల మానవుడు అజ్ఞాన ప్రకృతి చివరి అంచుకు చేరవచ్చు గాని దానిని అతిక్రమించలేడు.

అందుచేతనే గీత సత్త్వగుణం సుఖసంగం వల్ల జ్ఞానసంగం వల్ల బంధిస్తుంది అని చెబుతూ 'గుణములకు పరమైనదానిని తెలిసినవాడే నా భావాన్ని పొందుతున్నాడు' (గుణేభ్యశ్చ పరంవేత్తి మద్భావం సోऽధిగచ్ఛతి) అంటున్నది.

సత్త్వగుణం కొన్ని ఉత్తమ విలువలను మనలో పెంపొందించేమాట నిజమేగాని అవి పరిమితమైనవి, తాత్కాలికాలు. అహంకారంతో కలిసి ఉన్నందుచేత వాటికి భద్రత లేదు. అది ఇచ్చే విలువలకూ స్థిరత్వం లేదు. మానవ జీవిత సాఫల్యానికి కావలసిన విలువలు మూడు: ఏకత్వం, పరస్పరత్వం, సామరస్యం. ఆత్మజ్ఞానం ఒక్కటే వీటిని సుప్రతిష్ఠితం చేయగలదు. ఆత్మజ్ఞానానికి ఆధ్యాత్మిక తత్త్వమే మార్గం. అందువల్ల కేవలం మంచి గుణాలను అలవరచుకోవటం ఈ సమస్యకు పరిష్కారం కాదు. సత్త్వగుణం ఇచ్చే మంచి సాపేక్షం, పాక్షికం, అసంపూర్ణం. ఆత్మజ్ఞానంవల్ల వచ్చే మంచి 'శివం' అంటే నిరపేక్ష, సంపూర్ణ, పరిపూర్ణ శ్రేయం.

రెండవది : వ్యవస్థలు, విధానాలు మానవత్వపు విలువలను పెంపొందిస్తాయని కొంత మంది నమ్మిక. విద్యావిధానం, న్యాయవ్యవస్థ, సాంఘిక, రాజకీయ యంత్రాంగం మానవత్వపు విలువలని పెంచి పోషిస్తాయని ఇంత కాలం విశ్వసిస్తూవచ్చాము. కాని మనం సాధించగలిగిందల్లా శ్రీ అరవిందుల మాటలలో "A regulated pattern of minds, a fabricated pattern of lives, a cultivated pattern of conduct." వీటివల్ల మానవుని అంతరాత్మను పరిపూర్ణం అయ్యేటట్లుగా చేయలేము. అది అంతరంగంలో జరిగే పెరుగుదలవల్ల అభివృద్ధి పొందుతుందేగాని బయటనుంచి విధించిన నియమ నిర్బంధాలవల్ల కాదు. ఆత్మజ్ఞానాన్ని బలవంతగా పోతపోయలేము. అంతర్దృష్టివల్లా ఆధ్యాత్మిక అనుభవంవల్లా అది వికాసం పొందాలి. రాజకీయ ఆర్థిక సాంఘిక వ్యవస్థలను ఎన్నిసార్లు ఎంతగా మార్పుచేసినా వ్యక్తులు పరిపూర్ణులు కానిదే వ్యవస్థలు పరిపూర్ణం కావు. శ్రీ అరవిందులు అన్నట్లు "తాము అపరిపూర్ణులైన మనుష్యులు పరిపూర్ణ మానవ ప్రపంచాన్ని సృష్టించలేరు. అది వారితో ఏర్పడదు." వ్యక్తుల పరిపూర్ణతకు ఆధ్యాత్మిక మార్గమొకటే శరణ్యం.

మూడవది : శాస్త్ర విజ్ఞానం, భౌతికవాదం గొప్ప మానవ సమాజాన్ని నిర్మించగలవని మానవత్వపు విలువలు అటువంటి సమాజంలో మాత్రమే ఏర్పడగలవనీ ఒక అభిప్రాయం - ముఖ్యంగా పాశ్చాత్య దేశాలలో - ఉన్నది కాని, శాస్త్ర విజ్ఞానం ఒక బ్రహ్మాండమైన నాగరికతను సృష్టించిన మాట నిజమే. అయితే తన స్వభావంలో మూలమట్టమైన మార్పురాని మానవుడు, ఇంకా అధో

ఆధ్యాత్మిక Infra - Spiritual) అధో హేతు (Infra Rational) జీవితం గడుపుతున్న మానవజాతి ఈ నాగరికతను ఏ ప్రయోజనాన్ని సాధించటానికి ఉపయోగిస్తున్నది? తన పూర్వజీవితాన్ని సమర్థించటానికి, తన స్వార్థ సంకుచిత ప్రయోజనాల పరిరక్షణకు మాత్రమే. పరిపూర్ణుడైన వ్యక్తి చేతిలో, పరిపూర్ణమైన సమాజంలో శాస్త్ర విజ్ఞానానికి, భౌతిక పటిష్ఠతకు సముచిత స్థానం ఉంటుంది.

కాని ఈనాటి మానవుడు తన పరిమిత మానసిక సామర్థ్యానికి, అవగాహనకు మించిపోయిన, అలవికాని నాగరికతా వ్యవస్థను నిర్మించాడు. తాను సాధించిన ఈ నూతన శక్తిని భౌతిక ఆర్థిక జీవితాన్ని పటిష్ఠం చేయటానికి ఉపయోగించటం వల్ల తిరిగి అటవిక స్థితికి మళ్ళిపోగల ప్రమాదం పొంచి ఉన్నది. కొత్త వాంఛలను పెంచటానికి సామూహిక అహం విజృంభించటానికి శాస్త్రవిజ్ఞాన భౌతికవాదాలు తోడ్పడుతున్నాయి. తనలోను, ఎదుటి వారిలోను, ప్రతి జీవిలోను, ప్రతి అణువులోను ఆసీనమైయున్న ఆత్మను గుర్తించటానికి, పెంపొందించటానికి ఉపయోగించటం లేదు. కొన్నిచోట్ల విశృంఖలత్వం మరికొన్నిచోట్ల నిరంకుశత్వం తాండవిస్తూ మానవుని విలువలను తప్పుదారి పట్టిస్తున్నాయి. ఆత్మజ్ఞాన స్ఫోరకమైన ఆధ్యాత్మిక తత్త్వమే ఈ సమస్యకు పరిష్కార మార్గం. ఇదేవిధంగా బాహ్యాచారాలకు అమిత ప్రాధాన్యత నిచ్చే మతం కూడ మానవ జీవితాన్ని సమూలంగా మార్పు చేయలేకపోయింది.

ఇంతవరకు మనం చర్చించిన ప్రత్యామ్నాయాలు కొంతవరకు అవసరమైనవీ అనుసరించదగ్గవీ అయినా మానవత్వపు విలువలు శాశ్వతంగా స్థిరపడటానికి ఆధ్యాత్మిక మార్గమొక్కటే సరిఅయినది. ఈ విధానం ఆత్మజ్ఞానం మీద నొక్కిచెపుతుంది. ఆధ్యాత్మికత అంటే ఏమిటి? చాలామంది ఉన్నత వైజ్ఞానిక శక్తిని, ఆదర్శవాదాన్ని, నైతిక బుద్ధిని, పవిత్రతను, కఠోరనియమాచరణను, మత తత్త్వాన్ని ఆధ్యాత్మికత అనుకొంటారు. కాని అది సరికాదు. ఆధ్యాత్మికత అంటే మనస్సు, జీవం, శరీరం కాక మనలో మరొకటి ఏదో ఉన్నదని గుర్తించి, దానిని తెలుసుకొని, భావించి, అదే మనమై, విశ్వాతీతమై విశ్వవ్యాప్తమై, ఉన్న ఒక గొప్ప యథార్థ స్థితిలో ప్రవేశించాలనే అంతర్గత ఆకాంక్ష. దీనివల్ల మన అస్తిత్వాన్ని సాంతం పరివర్తన చేసుకోవాలనీ ఒక కొత్త ప్రకృతిని నిర్మించుకోవాలనీ తాపత్రయం. మనలో మనోజీవ శరీరాలకు అతిరిక్తంగా ఉన్నది అంత

రాత్మ, ఆత్మ, లేక ఆత్మ చైతన్యం కావచ్చు. మన అస్తిత్వానికి మూలాధారం అదే. నిమ్న ప్రకృతిలో పడి మనం దాన్ని గుర్తించటం లేదు. దాని వెలుగులో మనం పురోగమించి దానితో ఒకటై సర్వజీవులలోనూ కూడ అదే ఉన్నదని దర్శిస్తే (వాసుదేవ స్సర్వమితి) సర్వజీవులతో ఏకత్వం అనుభవంలోకి వస్తుంది.

ఆ అనుభవమే మానవత్వపు విలువలకు పునాది అవుతుంది. సర్వమానవ సహోదరత్వం, ప్రేమ మొదలైన సమస్తమైన విలువలూ తమ సాఫల్యాన్ని సంపూర్ణ సిద్ధిని పొందుతాయి. బాహ్య వ్యవస్థల మీద బాహ్య నిర్మాణాలమీద ఆధారపడే అవసరం ఉండదు. పైగా బాహ్యమైనదంతా ఈ అంతర్గత మూల సత్యాన్ని ప్రకటించే సాధనంగా రూపొందుతుంది. బాహ్యానికి బాహ్యం భాష్యం చెప్పలేదు: అంతర్గతమే బాహ్యాన్ని సరిగా వివరిస్తుంది. మానవుడే సంపూర్ణ మానవుడై మానవత్వపు విలువలను తన జీవితంలో సుస్థిరం చేసుకోవటానికి ఏకైక సాధనం ఆధ్యాత్మిక తత్త్వమే.

# కళారంగం - మానవతా విలువలు

—శ్రీమతి అడివి సూర్యకుమారి

కళారంగంలో మానవతా విలువలు ఏవిధంగా పూర్వం ప్రతిబింబించాయి? ఇప్పుడే విధంగా ఉన్నాయి?

అని ప్రశ్నించుకునేముందు మానవతా విలువల గురించి క్లుప్తంగా చెప్పుకోవడం అత్యావసరం.

ప్రకృతినుండి ఊర్ధ్వముఖంగా మనిషి చేసే యాత్ర సంస్కృతి. ఆ సాంస్కృతిక గమనంలో జరిగే వైకల్యాల రూపం వికృతి. ప్రకృతి, సంస్కృతి, వికృతి ఈ మూడింటిని తెలుసుకొని తనని తాను వ్యవస్థీకరించుకోవడమే మానవత్వం.

సంస్కృతి జీవనాడి నుండే సాహిత్యం రూపుదిద్దుకుంటుంది. ఒక జనం అనుభూతుల్ని, కలల్ని, అక్షరాల్లో బంధిస్తే అది ఆ జాతి సాహిత్యమౌతుంది.

ఒక మనిషి మరో మనిషితో సహజీవనం చేస్తే అది సమాజం అవుతుంది.

'విలువ' అంటే- వాస్తవంలో ఒదిగివున్న మానవహిత స్వరూపం. వెలుతురులోకి తీసికెళ్ళేది విలువ. ప్రతి వాస్తవంలోనూ కొన్ని గుణాలుంటాయి. అందులో మానవుడు తన కభీప్సితమైన దాన్నే గుణంగా గుర్తుపడుతున్నాడు.

(Every fact has a quality and those qualities which lead us to action are called as values.)

ఈ అభీప్సితమన్నది చేతన- మనిషిని జడ స్థితినుండి చేతనావస్థలోకి తీసికెళ్ళేదే విలువ. అంటే మానవ చైతన్యానికి ఏది ఉద్దీపనంగా ఉంటుందో అదే విలువ. అలాంటి విలువలను వికసింప చేసుకొని వాటితో వ్యవస్థీకృతమయ్యేదే 'సంస్కృతి.'

భారతీయ సంస్కృతి కొన్ని ప్రత్యేకమైన విలువల్ని పొందుపరచుకొంది. అవి సత్యం, ధర్మం, దైవం, ప్రేమ, జీవకారుణ్యం. త్యాగం, శీలం, కరుణ, శాంతి, అహింస మొదలగునవి.

గ్రీకు, సుమేరియన్ లాంటి సంస్కృతులు నశించిపోయినా ఈ దేశ సంస్కృతి ఈ నాటికీ ఎలా నిలబడింది? అనగా-

'సంస్కృతి' అంటే విలువలన్నాం కాబట్టి-

విలువలే ఈ సంస్కృతిని నిలబెట్టాయి.

ఈ మహా సంస్కృతికి మూలకందాలు వేదాలు. వేదం అంటే - తెలుసుకొనే విధానంగా ఉంటూ, తెలుసుకొనబడే విషయమై వుంటూ - తెలుసుకొనబడే దానికి ఫలితమై కూడా వుంటుంది.

ఇది భారతీయ సంస్కృతికి పునాదిగా మారిన సాహిత్య రూపం.

ప్రాపంచికమైన జీవితాన్ని తమకు తాముగా, ఐచ్ఛికంగా, వదిలిపెట్టి, ఈ నగర జీవితాలకి దూరంగా, అరణ్యాల్లో ఏకాంతంగా, సమస్త మానవాత్మల్లో అంతర్లీనమై వున్న ఏకత్వాన్ని, తమ ప్రగాఢ ధ్యానంతో దర్శించ గలిగిన ఋషుల కృషి ఫలితంగా, వారి భావాల సమైక్య రూపంగా తయారైందీ వేద సాహిత్యం. వారు చేసినవన్నీ సమిష్టి ప్రగతికోసం, సమైక్యతకోసం చేసిన ఆలోచనలే. వైయక్తికంగా కాకుండా సమష్టిగా సృష్టించారు. అంచేతే భారతీయ సాహిత్యంలో వైయక్తికమైన ఏ లక్షణానికి అవకాశం లేకుండా, సంపూర్ణ సమైక్య తత్వానికి ప్రతీక లభిస్తోంది. సమైక్యత ఈ జాతికి ప్రాణ తత్త్వమైన విలువ.

'కొన్ని ధార్మిక విలువలకి మనం వారసులం' అని ప్రకటించి, వాటి సముజ్జీవనం కోసం ప్రబోధాన్ని కల్పిస్తూ - ఆ యథార్థ జీవితాల విలువలను నిలబెట్టాల్సిన బాధ్యత, తర్వాతి తరాల కుందని తెలుపుతూ, ఆ ధార్మిక విలువల్ని మనం తెలుసుకోవాలి అన్న సూత్రం ఆధారంగా-మహేతిహాసాలొచ్చాయి. ధార్మిక విలువల ప్రాతినిధ్యం అన్నది ప్రధానకేంద్రం కావడం వల్ల వీటికి సాహిత్యేతరమైన విలువలు వచ్చి చేరాయి.

భారతం అంటే కేవలం భరతవీరుల చరిత్రే కాదు. భగవంతుని వాణి 'గీత'ను తనలో దాచుకొన్న అతి పవిత్ర గ్రంథం. మోక్షప్రదాయినిగా ప్రపంచ ఖ్యాతి గాంచి పూజనీయత కలిగినట్టిది.

రామాయణం నిత్యం పారాయణం చేయవలసినది. భాగవతం భక్తి తాత్పర్యాలతో సేవించాల్సిన గాథ. ఈ మూడు సమస్త భారతీయ సంస్కృతికి నిలయమైన మహేతిహాసాలు. వీటికి సాహిత్యేతరమైన పవిత్రత, ధార్మిక

పూజ్యత, సాంస్కృతిక మౌల్య సమన్వయం, మొదలైన అనేక విలువలున్నాయి. ఇవి ఎంత సాహిత్య గ్రంథాలో అంత ధర్మశాస్త్రాలు. ఎంత ధర్మశాస్త్రాలో అంత సంస్కృతి చరిత్రలు. మానవ జీవన విలువల సంపుటులు. మొత్తం భారతీయ సంస్కృతిలోని ఏకత్వానికివే మూలాధారాలు. అందుచేతే అన్ని భారతీయ భాషల్లోనూ, అన్ని కాలాల్లోనూ, ఏదో ఒక రూపంలో, వీటిని పునః కథనం చేయడం జరుగుతున్నది. ఆ కారణంగానే వివిధ భాషలున్నప్పటికీ భారతీయ సాహిత్యం ఒక్కటే, భారతీయ ఆత్మ ఒక్కటే అన్న మౌలికమైన ఏకతా రూపమనే విలువ సిద్ధిస్తున్నది.

ఈ విధంగా వేద ఉపనిషత్ ఇతిహాసాలు కొన్ని మౌలిక విలువల్ని మనకు వారసత్వంగా ఇచ్చాయి.

ఇప్పుడు లలితకళలంటే ఏమిటో చూద్దాం.

"ఏదైనా ఒక భౌతిక మాధ్యమికం ద్వారా ఆత్మాభివ్యక్తి పొందాలనే కాంక్ష నుండి, సత్యాన్ని తెలుసుకోవాలనే పిపాసనుండి విజ్ఞానం పుట్టింది. ఈ భౌతిక మాధ్యమికాలే - లలితకళలు."

కవిత్వం, సంగీతం, చిత్రలేఖనం, శిల్పం, నాట్యం - ఇవి లలితకళలు. ఇందులో నృత్యం ప్రత్యేకమైన లలితకళా విభాగం కాదు. మొత్తం లలితకళల సమాహార స్వరూపమది.

వీనిలో కవిత్వం, సంగీతం - ఒక విభాగానికి చెందినవి. ఇవి చరకళలు, శ్రవ్యకళలు. భావం, పద్ధతి, ఉక్తి మారుతుంటాయి; నిరంతర చలన కళలు. చిత్రలేఖనం, శిల్పం - ఒక విభాగానికి చెందినవి. స్థిరకళలివి; దృశ్య కళలు. భావం మారదు, స్థిరంగా ఉంటుంది. మార్పు ఉండదు.

కవిత్వం, సంగీతం - చూసేవి కావు, వినేవి. మౌళికంగా వ్యాప్తి చెందేవి

చిత్రలేఖనం శిల్పంలో చూసినపుడు కలిగే అనుభూతి ఎక్కువ. వీనిలో ఏ కళ ఎక్కువ? అన్న ప్రశ్నకు తావులేదు. కారణం - స్పందించే హృదయం ఉండాలే గాని అన్ని కళలూ రసరంజకాలే. రసానుభూతి ప్రదాతలే. మానవుడిలో ఆధ్యాత్మిక చింతనని తట్టి లేపేవే.

ముందుగా కవిత్వం—

ప్రబంధ కవిత్వం మరుగునబడి భావ కవిత్వం ఆవిర్భవించింది. ప్లెటోనిక్ ప్రేమ - 'మనిషిలోని దుర్బలత' అనే భావనతో అభ్యుదయ కవిత్వం వచ్చింది. ఇది కవిత్వంలో వెలుగుని, వెచ్చదనాన్ని కూడా చూపించింది. దీనిలో ప్రయోగం, ప్రగతి రెండు వాదాలొచ్చాయి. ప్రగతివాదులు - రాజకీయాలు దేశకాల పరిస్థితులు, పేదల అగచాట్లు, దోపిడీని ప్రధానాంశాలుగా కవిత్వంలో స్వీకరించారు.

ప్రయోగవాదులు - మనిషిలోని నిరాశ, నిస్పృహ, వైజ్ఞానిక రీతుల్ని తీసుకొని కవిత్వం వ్రాశారు.

సర్రియలిష్టు, డాడాయిష్టు ధోరణులు మెరుపుల్లా మెరిసి మాయమయ్యాయి.

తెలుగు కవిత్వంలో నవ్య సంప్రదాయం కొత్త వెలుతురు తెచ్చింది. భారతదేశం కర్మభూమి కాబట్టి కర్మాచరణకు దేశభక్తి మూల సత్త్వమని గ్రహించి, "జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసి" అన్న ప్రాచీన సూక్తిని పాటిస్తూ కవులు జాతీయాభిమానం, రాష్ట్రాభిమానంతో, కవిత్వం రాసి ప్రజల్లో స్వీయ ధర్మం పట్ల ఆసక్తిని పెంపొందించారు.

ప్రేమ వ్యక్తిగత ప్రణయానికే పరిమితం కాకుండా - సమాజంలో అంతర్భాగమై - కరుణతో కలిసి - త్యాగంతో తడిసి - మానవ సేవలో పర్యవసించాల్సిన అవసరం "సౌందరనందం" కావ్యం ద్వారా పింగళి - కాటూరి కవులు ప్రబోధించారు.

ఈ కాలంలో వచ్చిన ఆధునికేతిహాసం "శ్రీమద్రామాయణ కల్పవృక్షం". దాదాపు 27 సం॥లు సాగిన రచన. కవి శ్రీ విశ్వనాథ సత్యన్నారాయణగారి గురించి మన ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావుగారన్న మాటలు ఇక్కడ చెప్పు కోవటం అత్యవసరం -

"మనదేశాన్ని ఆసేతు శీతాచలం సమైక్యం చేసింది మన ప్రాచీన వార సత్వమే. భావసమైక్యత మాత్రమే. బ్రిటీషువారు కొంత కల్చరల్ ఇంపీరియ లిజమ్ మనపై రుద్దడానికి ప్రయత్నించారు. విశ్వనాథ తిరుగుబాటు చేసింది దీని మీదనే. మీ కల్చర్‌ని మామీద రుద్దకండి - మా ధర్మం, మా సంస్కృతి మావి. 'స్వధర్మే నిధనం శ్రేయః'- సత్యనారాయణగారి సర్వసాహిత్యాన్ని, ఆ భావనను, ఈ అంశంతో మనం చూసుకోవచ్చు" అన్నారు ప్రధాని.

తన కాలంలో వేళ్ళూనుకుంటున్న పాశ్చాత్య సంస్కృతి వ్యామోహాల నుండి, ప్రజల మనసు మళ్ళించి, స్వధర్మం పట్ల ఆసక్తి కల్గించటం, - భారతీయ ఆధ్యాత్మిక తత్త్వంలోని, అర్ష సంప్రదాయంలోని, సుసంపన్నతని, పవిత్రతని, విశిష్టతని, తన రచనలలో చూపి, జాతిని చైతన్య వంతుల్ని చేసి. "ఇంతటి మహా సంస్కృతికి మేము వారసులం" అని ప్రతి భారతీయుడు తలెత్తి సగర్వంగా, చెప్పుకొనే విధంగా రచనలు సాగించిన మహాకవి; రచయిత శ్రీ విశ్వనాథ. గొప్ప మానవతావాది, సమాజవాది. సామ్యవాది. విశ్వనాథ సాహిత్యంలో సామ్యవాదం - "కరుణ, సానుభూతి, ప్రేమ, దయ, సత్యం, సౌశీల్యం, న్యాయం" అన్న భాషలో (విలువల్లో) కన్పిస్తుంది. మానవతా వాదాన్ని అ విలువల్లో చూపిస్తారాయన. ఆయన కల్పవృక్షం తరతరాల భారతీయ సంస్కృతి, సమైక్యతకు కారణభూతమైన గ్రంథం. ఇదొక మానవీయ మూల్యాల సంపుటి.భారతీయ విజ్ఞాన సర్వస్వం. దేశకాలాలకు అతీతంగా,శిఖరాయమానంగా నిలిచే విశ్వజనీన కావ్యం. ఒక రచయిత సంప్రదాయంలో కొన్ని మానవీయ విలువల్ని సమాజం కాపాడుకోవాల్సిన అవసరం ఉందని చెప్పినంత మాత్రాన ఆయన నవీనతని, సమకాలీనతని కోల్పోయినట్లుకాదు.

నండూరి రామకృష్ణమాచార్యుల తారాతోరణం, జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి విజయశ్రీ, పుట్టపర్తి నారాయణాచార్యులుగారి శివతాండవం, మేఘదూతం మొదలైన కావ్యాలు ఈ మార్గంలో వచ్చినవే.

శివతాండవం సృష్టిలోని చైతన్యాన్ని, రహస్యాన్ని, అంతర్లయను విశదం చేస్తోంది.

జాతి జీవితంలోని తత్త్వ రహస్యాన్ని మధునాపంతులువారు 'ఆంధ్ర పురాణం'లో అందించారు.

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి - దక్షారామం, దాశరథి - మహాంధ్రోదయం, నారాయణరెడ్డి - కర్పూర వసంతరాయలు, గడియారం వేంకటశేష శాస్త్రి - రఘునాథీయం, వానమామలై వరదాచార్యుల పోతన చరిత్రం, నాయని సుబ్బారావు - జన్మభూమి,ఎక్కిరాల కృష్ణమాచార్యుల గోదావైభవం- మరెందరో కవులు కావ్యాలలో - సంప్రదాయాన్ని పాటిస్తూ, జీవనమౌల్యాలకి ప్రాముఖ్యతనిస్తూ, వస్తుభావ నిర్దేశంలో వైవిధ్యాన్ని చూపుతూ రచించారు.

శ్రీశ్రీ సంప్రదాయ సాహిత్య చైతన్యాన్ని జీర్ణించుకున్న కవి. సంప్రదాయం పునాదిగా, నవీనతలో క్రాంతిని, జాగృతిని చైతన్యాన్ని సాధించిన మహాకవి.

తర్వాత వచ్చిన వచన కవిత్వ శాఖకు కుందుర్తి బహుళ ప్రచారం కలిగించారు. కవుల వైయక్తిక సామాజిక వేదనలు దీనిద్వారా వ్యక్తం చేశారు. మానవత్వం, కరుణ, దయ, మార్క్సిజం - దీని వస్తువులైనాయి.

మొత్తంమీద కవిత్వం సంప్రదాయ మార్గంలో నడిచినా, నవీనమార్గంలో నడిచినా, తన ప్రధాన లక్ష్యమైన శాంతి, సమత, విశ్వజనీనత లనే విలువల్ని మటుకు పోగొట్టుకోకుండా వస్తూనే వుంది.

భారతదేశంలో - కళను ఉపాసిస్తారు, ఆరాధిస్తారు. కళలో భగవంతుణ్ణి చూస్తారు. అందుకే భారతీయ కళలకు భక్తి మూలం.

భారతీయ సంగీతానికి భగవంతుడు, భక్తి పునాదులు. శృంగారం భగవంతుడి పరంగానే వుంటుంది. భక్తి సరేసరి. అన్ని రసాలు ఆయన గాథల్లో పర్యవసిస్తాయి.

రసభావాలను పెంపొందించి ఆనందం కలిగించటం సంగీతం ఆశయం. మానవహృదయాన్ని పవిత్రం చేసి ఉదార భావాలని, ప్రేమ, కరుణ, సర్వ మానవ హృదయాల్లో శాంతిని కాంతిని నెలకొల్పే సమర్థత సంగీతానికి వుంది.

జగత్తంతా నాదమయమని, నాదమే 'ఓం' కార స్వరూపమని, ఓంకారం నుండే సప్తస్వరాలు పుట్టాయని భారతీయుల భావన. నాభి, హృత్, కంఠ, రసన, నాసాదులయందు శోభిల్లునవే సప్త స్వరాలని త్యాగరాజస్వామి గానమొనర్చినాడు. ఈ సప్తస్వరాలు బీజాక్షరయుతాలని, మిగతా ఆరు స్వరాలు 'స' అందు పుట్టటంచేత అది 'షడ్జమం' అని, దాని బీజాక్షరం 'ఓం' అని శాస్త్రిలు చెబుతున్నవి. ఇది మంత్ర శాస్త్రరీత్యా సప్తస్వర బీజాక్షర షట్కోణం. ఇంత పవిత్రత ఇందులో వుందిగనకే సంగీతారాధన దైవారాధనగా భారతీయులు భావిస్తారు.

'నాద తను మనిశం శంకరం నమామి మే మనసా శిరసా' అను కృతిలోని చరణంలో "సద్యోజాతాది పంచ వక్త్రజ సరిగమపధనీ వరసప్తస్వర" ల నటంలో - శంకరుని యొక్క పంచముఖాలందు జనించిన పంచనాదాలలో

ప్రతి ఒక్కింట ఒక్కొక్క సప్తస్వర కూటం ఆవిర్భవించినట్లు తెలుస్తోంది. అగ్ని, బ్రహ్మ, సరస్వతి, శివ, విష్ణు, వినాయక, సూర్యులు ఆయా స్వరాలకి అధిష్ఠాన దేవతలు.

ఇంతటి తేజోమయత్వం, దైవత్వం గల సంగీతం సర్వ ప్రాణి కోటిని రసానందంలో ముంచగల రసస్వరూపం.

"శిశుర్వేత్తి పశుర్వేత్తి ..." అని సృష్టిలోని సమస్త చైతన్యాన్ని రస భావఝరిలో ముంచెత్తి బ్రహ్మానందానికి హృదయాన్ని, బుద్ధిని, శరీరంలోని సమస్త చైతన్యాన్ని తీసుకుపోగలశక్తి సంగీతానికుంది.

సంగీతంలో అసాధారణ శక్తులు కలవను విశ్వాసం అన్నిదేశాలవారికీ వుంది. భారతీయ సంగీతంలోని రాగాలు ప్రకృతిలోనే గాక, మానవ స్వభావాల్లో కూడా మార్పును తేగలవను భావన వుంది. దీపక్‌రాగం ఆలపించినపుడు అగ్ని పుట్టటం, మేఘమల్హార్ రాగమాలపించితే మేఘాలు వర్షించటం జరిగినట్లు కథ లనేకం ప్రచారంలో ఉన్నాయి. అంతేకాదు, మనిషిలోని వైర ప్రవృత్తిని కూడా దాటి పోగల శక్తి దీనికుంది. ప్రాణాలకు తెగించి, మారు వేషంలో, శత్రు రాజ్యంలో ప్రవేశించి, మీరా సంగీతాన్ని వినడానికి అక్బర్‌ని రప్పించింది ఈ అద్భుతమైన గానకళే.

సంగీతంవలన అనేక దీర్ఘ రోగాలు నయమవటం, పైర్లు పెరగటంవంటివి మనం తరుచూ వింటున్నవే.

సంగీతం రెండు రకాలు.

1) సాహిత్యం వున్న సంగీతం 2) సాహిత్యం లేని సంగీతం.

సాహిత్యం వున్న సంగీతాన్ని ఆ భాషా సాహిత్యం తెలిసినవారే ఎక్కువగా ఆనందించగలరు.

సాహిత్యం లేని సంగీతాన్ని ఆ మాధుర్యాన్ని, లయని గమకాన్ని, ఏ భాషకి చెందినవారైనా ఆనందిస్తారు. ఆస్వాదించగల చెవి, స్పందించగల హృదయమే ఉండాలి గాని ....

సంగీతం సృష్టిలో ఎక్కడ లేదు?

పైరగాలిలోవుంది. గాలివేసే ఈల పాటలోవుంది. సెలయేటి గల గలల్లో పక్షి కూజితాల్లో వుంది. 'అంబా' అన్న లేగదూడ పిలుపులో వుంది. ఆకు కదలికలో వుంది.

శుద్ధ సంగీతానికి గీతం అవసరం లేదు. నాదం మాత్రం చాలు. రాగాలాపన, తిల్లానాలు, స్వరకల్పన మొ॥ నవి శుద్ధ సంగీతం. నాదమాధుర్యం - మృదంగం, తబలా, కంజీరా, ఘటం మొ॥న వాటిలో వినిపించి, లయాత్మకమైన నాదస్పందనలు శ్రోత హృదయంలోని కల్మషత మనస్సులని పారద్రోలి, ఆనంద జ్యోత్స్నలని ప్రసరింపచేస్తాయి.

కళ భోగలాలసతని ప్రచారంచేసే సాధనం కాదు. భౌతిక అసంపూర్ణతని ఆధ్యాత్మిక పరిపూర్ణత్వంలోకి రూపాంతరం చేయటమే దీని లక్ష్యం.

సంగీతం దీనికి మంచి ఉదాహరణ. వీణానాదం భాషని వ్యక్తం చేయదు. కాని మధురమైన ధ్వని తరంగాలని విన్పిస్తూంటుంది. ఈ తరంగాలు మానవుని మానసంలో ప్రకంపనల్ని కలిగించి అతని చేతనాన్ని, మరో దివ్యలోకాలకి తీసికెళ్తుతుంది. ఆ రసానందానికి ఎల్లలుండవు. ఇక్కడే కళ ఆధ్యాత్మికతతో ఏకమౌతుంది.

సాహిత్యం వున్న సంగీతం గురించి చెప్పుకొనేటప్పుడు - ఎందరో మహానుభావులు - సంగీతం ద్వారా, సంగీతంలోని సాహిత్యం ద్వారా - మానవుణ్ణి జాతి, వర్గ, మత, కుల, వర్ణ భేదాలు దాటించి, సర్వమానవ సమానత్వాన్ని, శాంతిని, ఐక్యతని, ప్రేమని, ఒక గొప్ప భావసమైక్యతని సాధించారు.

త్యాగరాజ కృతుల్ని గానం చేసిన పాశ్చాత్య సంగీత విద్వాంసులున్నారు. భారతీయ సంగీతాన్ని అధ్యయనం చేసిన విదేశీయులెందరో కలరు.

ఉదాత్తాలైన భావాలు, సదాశయాలు, ఉపనిషత్తుల్లోని పరమ సత్యాలు సులభ శైలిలో తన కృతుల్లో చొప్పించినందువల్లనే తత్త్వవేత్తలు త్యాగరాజు కృతుల్ని, త్యాగబ్రహ్మోపనిషత్తులన్నారు.

"నిగమ శిరోర్థము కలిగిన నిజవాక్కులతో స్వరశుద్ధముతో" - తత్త్వమని అనే వాక్యార్థం 'అహంబ్రహ్మాస్మి', 'సోహంబ్రహ్మ' 'స్వాత్మానుసంధానం చేయడమే మోక్షం' మొ॥న ఉపనిషత్ వాక్యాలు ఈయన కీర్తనలలో కన్పిస్తాయి.

నాస్తికతను ఖండిస్తూ "దుడుకు గల" అను కృతిలో అన్యాపదేశంగా తనమీదె పాడుకుంటూ "సకలభూతముల యందు నీవై యుండగా మరి లేక పోయిన" అని సర్వాంతర్యామి, అద్వైత రూపుడైన రాముని కీర్తిస్తూ ఎన్నో

నీతులనుపదేశించి, సద్గతి, మోక్షం పొందడానికి నాదోపాసన చేసి తరించమని తెల్పినాడు.

భక్తిమార్గాలు వేరైనా, సంగీతం సంకుచితాల కతీతమని, అహంకారం చంపుకొని, శమదమాదులు అలవరచుకొని, ప్రాపంచిక విషయాలపట్ల నిర్లిప్తులై ఉండుటే మోక్ష మార్గమని చాటినాడీ మహానుభావుడు త్యాగయ్య.

రామదాసు, నారాయణ తీర్థులు, అన్నమయ్య, సదాశివబ్రహ్మేంద్రుడు, స్వాతి తిరునాళ్, రూపగోస్వామి, చండీదాసు, తాన్‌సేన్, బైజూబావరా, మీరాబాయి, చైతన్యుడు, శ్యామశాస్త్రి, ముద్దుస్వామి దీక్షితులు- ఎందరో సంగీతజ్ఞులు సంగీతానికి ఎల్లలు, భక్తికి అవధులు లేవని చాటినారు. తమ సంగీతంతో సామాజికుల్లో ఆధ్యాత్మిక చింతనే కాక, ధర్మం పట్ల, సత్యం పట్ల జ్ఞానాన్ని కల్గించారు. సర్వమానవ సమానత్వం, జీవకారుణ్యం సాధించటంలో సఫలీకృతులైనారు.

నేటికీ కూడ సంగీతం - ఆధ్యాత్మిక పరుల్ని, రసజ్ఞుల్ని అలరిస్తూనే వుంది. ఆనందపుటంచులని చూపిస్తూనే వుంది.

## నాట్యం :

మానవజాతి అస్తిత్వం ఎంత ప్రాచీనమో నర్తన కళ కూడా అంత ప్రాచీనం.

సృష్టికి ఒక అఖండ చలనం. విశ్వమంతా ఒక అస్తవ్యస్త నర్తనం.

భారతీయ నాట్యశాస్త్ర కర్తయైన భరతుడు నర్తనంలోని ఉపాంగాలు, నటరాజగు శివునియందు అంతర్భాగాలై ఉన్నరీతిని ఇలా తెల్పాడు:

"ఆంగికం భువనంయస్య వాచికం సర్వవాఙ్మయం

ఆహార్యం చంద్ర తారాది తం వందే సాత్త్వికం శివం"

అనగా శివుని ఆంగికాభినయమే ఈ జగత్తని, ఆయన మాటలే సమస్త వాఙ్మయమని, ఆయన ఆభరణాలు చంద్ర నక్షత్రాలు, స్వయంగా సాత్త్విక రూపమే శివుడని భావం.

నవరసాల్ని ఒలికించడానికి సాత్త్వికాభినయం నర్తనానికి ప్రాణం వంటిది.

ఒట్టి భంగిమలవల్ల నృత్యం కాదు. ఒట్టి భంగిమలలో శిల్పం కన్పిస్తుంది. పాట మొదలుకాగానే - అవి సాహిత్యంతో మేళవించిన కదలికలౌతాయి.

శిల్పం, సంగీతం, సాహిత్యం - కలిసి నృత్యం ఏర్పడుతుంది. నృత్తం నృత్యం, నాట్యం - అని నర్తనం మూడు విధాలు.

ఏ భావం వ్యక్తం చేయని కేవలం ఆంగిక చాలనం నృత్తం. నృత్యం భావాభివ్యక్తిని కలిగిన నర్తన రీతి. తమ హృదయాల్లో చెలరేగే భావాలకి దర్పణంగా కళ ఉపయోగపడునపుడు మాత్రమే దానివలన ప్రజలు ఆనందించగలుగుతారు.

నాట్యం - భావంతో పాటు ఇతివృత్తాన్ని కూడా ప్రదర్శిస్తుంది. అందువలన ఇది విస్తారమైన పరిధి గలది.

తాండవం, లాస్యం - అని భారతీయ నృత్యం రెండు విధాలు. పురుషులు చేసేది తాండవం, స్త్రీలు చేసేది లాస్యం. లలితంగా, ప్రశాంతంగా, మృదువుగా వుండేది లాస్యం. గంభీరంగా, బలీయంగా ఉండేది తాండవం.

భారతీయనృత్యం - భరతనాట్యం, కథక్, కూచిపూడి, ఒడిస్సీ, కథాకళి, మణిపురి - అని ప్రత్యేక సంప్రదాయాల్లో ప్రచారంలో ఉన్నాయి.

భారతీయ నృత్యాన్ని 2 విధాలుగా తెలుసుకోవచ్చు.

1. సంప్రదాయ రీతుల వలన.

2. దేవాలయ శిల్పాలలోని నృత్యభంగిమల వలన.

భారతీయ నృత్యకళను పోషించి ప్రౌఢతను చేకూర్చింది దేవాలయాలందలి దేవదాసీ వ్యవస్థ. అనేక కారణాల వలన ఆ వ్యవస్థ అంతరించింది. అందాకా నృత్యం వారికి జీవిక. దేవదాసీల నృత్యనాట్యాలు లాస్యరీతికి చెందినవి. ఇందు భక్తి, శృంగార భావాలను వెల్లడించే అవకాశం ఎక్కువ. ఈ రెండు భావాలకి భగవంతుడే ప్రాతిపదిక.

సంగీతం, చిత్రలేఖనం, శిల్పం, కవిత్వం - ఈ సంబంధమైన కళాస్రష్టలు తమ కళాసృష్టి నుండి వేరుపడి కొంతవరకైన ఉండగలరు. కాని నర్తకుడు తానే ఒక కళాప్రబంధంగా మారగలడు. నర్తకుడు లేకుండా నాట్యం వుండదు.

భారతీయ నృత్యం తక్కిన దేశాల నృత్యరీతులకన్న ఎక్కువ మనోహరంగా ఉండటానికి కారణం- దీనికున్న మూలశక్తి ఆధ్యాత్మికతే.

శివుని నృత్యానికి ప్రతీకగా రూపొందించిన నటరాజ లోహ విగ్రహం ఈ విశ్వ నర్తకుని ప్రతిభ చాటుతోంది. ఈయన నృత్యవైభవాన్ని మధ్య యుగపు శైవవాఙ్మయం తెలుపుతోంది. అగ్నిలా తన శక్తిని మానవుల మేధస్సులోనూ, పంచభూతాలలోనూ వ్యాపింపచేసి, వారిచేత నృత్యం చేయిందగలడు విశ్వనర్తకుడు. ఈయన కుమారుడు గణపతి, తండ్రిచేసే సంధ్యానృత్యంలో పాల్గొంటాడని నృత్యగణపతి శిల్పాలు తెలుపుతున్నాయి.

బౌద్ధ శిల్పాలలో కూడా అనేక నృత్య భంగిమలు కన్పిస్తూ, నృత్యం ప్రాచీనతని తెలుపుతున్నాయి.

నృత్యం నిరక్షరాస్యులకు్కూడా సంగీతాన్ని, సాహిత్యాన్ని వారి దగ్గరికి తీసికెళ్తుంది. హావ భావ ప్రకటనతో, కదలికలతో ఆనందాన్ని కలిగిస్తుంది. సంగీతం ద్వారా, కావ్యంలోని విషయాల్ని కూడా అది సామాన్యుల కంద చేస్తుంది. కాబట్టి నృత్యం అన్ని తరగతులవారిని అలరించగల సమాహారకళ.

బౌద్ధం, వైదికం రెండూ కూడా తమ మత విషయాలని నృత్యం ద్వారా సామాజికుల కందించాయి.

కృష్ణలీలా నృత్యాలు వెన్నదొంగగా, గోపికావస్త్రాపహారిగా, కాళీయ మర్దకుడిగా, అన్నిటిని మించి యమునాసైకతాల్లో, శరత్‌వెన్నెల్లో, గోపికలతో ఆయన సల్పిన రాసక్రీడ నృత్యం ప్రసిద్ధి చెందింది. నృత్యకళలో శివ, కేశవ సంబంధ నృత్యాలు పారంపర్యంగా ఈనాటికీ ఉన్నాయి.

విశ్వామిత్రుని తపోభంగం చేయడానికి వచ్చిన మేనక నృత్యం, బుద్ధుని తపోభంగానికై వచ్చిన మారుని కుమార్తెల నృత్యాలు వైదిక, బౌద్ధ శిల్పాలలో తరుచు కన్పించేవి.

నాటి రాజులు నృత్య కళను బాగా పోషించారు. అన్ని భారతీయ నృత్యాలు భరతుని నాట్యశాస్త్రం ఆధారంగా వచ్చినవే.

కథక్ నృత్యం ఉత్తరభారతంలోని శాస్త్రీయ నృత్యరీతి. ఒక విషయాన్ని వివరిస్తూ చేసే నృత్యం కనకే ఇది కథక్ అయింది. కథక్ నృత్యానికి రెండు సంప్రదాయాలున్నాయి. వాటిని ఘరానా లంటారు. లక్నోఘరానా, జైపూర్ ఘరానా. లక్నోఘరానా మొగల్ పద్ధతిలో సాగితే, జైపూర్ ఘరానా హిందూ సంప్రదాయం, అందునా వైష్ణవ సంప్రదాయంలో సాగుతుంది. మధుర బృందా

వనాల్లో చేసే రాసక్రీడా నృత్యం ఈ కోవకి చెందింది. కథక్ నృత్యంలోని గాధలన్ని కృష్ణునికి చెందినవి. అయితే కథక్ నృత్యంలో శివతాండవం అద్భుతంగా ఉంటుంది.

మణిపురి నృత్యం ప్రధానంగా గౌడీయ వైష్ణవ మతాన్ని ఆధారం చేసుకొని కృష్ణభక్తి తత్వాన్ని ప్రదర్శించే శాస్త్రీయ నృత్యరీతి.

ఒరిస్సా రాష్ట్రంలో వృద్ధిచెందిన నాట్యకళ ఒడిస్సీ. ఇక్కడ శైవ వైష్ణవాలయాలెక్కువ. దేవాలయ శిల్పాల్లోని నృత్య భంగిమలే, అంటే శైవ, వైష్ణవ మతసంబంధ కథల్ని ఏ విధంగా శిల్పాల్లో మలిచారో, అవే భంగిమలు ఆ సంప్రదాయాలు నృత్యంలోనూ కన్పిస్తాయి. ఈ శతాబ్దపు ఒడిస్సీ నృత్యాలలో జయదేవుని అష్టపదులను నృత్యం చేయటం విస్తృతంగా కన్పిస్తోంది. అష్టపదులలో ఆధ్యాత్మిక పరమైన వాసుదేవకేళీ శృంగారమే ఎక్కువ.

కూచిపూడి - వైష్ణవ సంప్రదాయంలో అభివృద్ధి చెందిన నాటకరీతి. భాగవతంలోని కథల్ని విశేషంగా ఈ నృత్యరీతిలో ప్రదర్శించటం వలన వీరికి "కూచిపూడి భాగవతులు" అన్న పేరు స్థిరపడింది. భరతుని నాట్యశాస్త్రం, నందికేశ్వరుని 'అభినయదర్పణం, ఈ నృత్య రీతికి ఆధారాలు. ఈ నృత్యరీతి చాలా లలితంగా, స్పష్టమైన పదవిన్యాసంతో, హస్తముద్రలతో, సాత్త్వికాభినయానికి ప్రాధాన్యతనిస్తుంది. విష్ణు కథలేగాక శివతాండవ నృత్యాన్ని ఈ నృత్యరీతిలో ప్రదర్శిస్తారు. ప్రఖ్యాతి చెందిన 'అర్ధనారీశ్వరనృత్యం' కూచిపూడి నృత్యంలో తప్ప మరే నృత్యరీతిలో కన్పించదు. కూచిపూడి నృత్యరీతిలో భామా కలాపం, గొల్లకలాపం ప్రధానమైనవి. ఒక బ్రాహ్మణుడికి, గొల్లభామకి జరిగే వేదాంత పరమైన సంభాషణా నృత్యం గొల్లకలాపం.

సత్యభామ కృష్ణుల జీవితంతో ముడివడిన - నవరసాలతో నిండిన గాథా ప్రదర్శన భామాకలాపం.

పూర్వం దేవాలయాలు భక్తికి, సంస్కృతికి కేంద్రాలుగా ఉండేవి. ఉత్సవాలు, పండుగలు, పుణ్యదినాలకి సంబంధించిన సంబరాలకి కేంద్రం ఆలయం. ప్రజలకి ఆనందంతోపాటు, ఆధ్యాత్మిక చింతనని కూడా కల్గించే సాంస్కృతిక సంస్థ ఆలయం. భక్తిని ఎక్కువగా 'నృత్య' రీతుల్లో చూపించేవారు. పురాణాల్లోని ప్రసిద్ధమైన గాథల్ని నాట్యరూపంలో సామాన్య జనులకి

అందించేవారు. దశావతారాలు, రుక్మిణీ కల్యాణం, పార్వతీ కల్యాణం - ఇలా ఎన్నో శైవ వైష్ణవ సంబంధ గాథలు నృత్యరూపంగా పండితపామరుల మనసుల్ని రంజింపచేసేవి, ఆధ్యాత్మిక చింతనని కల్గించేవి.

ఈ మధ్య త్యాగరాజకృతుల్ని, అన్నమయ్య కృతుల్ని కూడా నాట్యంలో చూపిస్తున్నారు.

"బాలకనకమయచేల సుజనపరిపాల శ్రీరమాలోల" అన్న కృతిని నృత్యకారులు అభినయిస్తే .... ఆ అభినయంలో బాలుడైన రాముణ్ణి నర్తకులు తమ ప్రతిభతో ప్రేక్షకుడి కన్నులముందు నిలబెట్టగలరు.

భరతనాట్యం - తంజావూరులో అభివృద్ధి చెందిన నృత్య రీతి. నట్టువ సంప్రదాయానికి చెందిన ఈ నృత్యంలో శైవ వైష్ణవ సంబంధ నృత్యాలే ప్రదర్శింపబడుతున్నాయి.

కథాకళి - కేరళలో రూపొందిన నృత్యరీతి. శిలప్పాదికారం, భరతుని నాట్యశాస్త్రం ఈ రీతికి ఆధార గ్రంథాలు.

ఇందులో కూడ శైవ వైష్ణవ కథలే ఎక్కువగా ప్రదర్శింపబడ్డాయి. 'మోహినీయాట్టం' అనే ఈ నాట్యాన్ని పురుషులే ఎక్కువగా ప్రదర్శిస్తారు.

పరమపురుషుని కల్యాణ గుణాలని పాడి ఆడి భజించటం, కవి తానే నాయికగా భావించుకొని పరమపురుషుని వియోగానుభవం పొందటం- నాట్యంలో ఎక్కువగా కన్పించే ధోరణి.

బాహ్య సృష్టి రహస్యాన్ని నాటకం ప్రదర్శిస్తే, బ్రహ్మాండాన్ని అణువులో ప్రతిబింబించే అంతర్దృష్టి రహస్యాన్ని నాట్యం ప్రదర్శిస్తుంది.

రాసక్రీడ జీవేశ్వర ప్రణయాన్ని తెలుపుతుంది.

అందుకే కబీరంటాడు - "నీవూరికే పరిభ్రమించటం నిష్ప్రయోజనం, నీ యిల్లే పరంధామం. పూల కోసం అడవుల కెందుకు పోవడం....నీ హృదయం లోనే పూలవనాలున్నాయి" అని.

శిల్పం - ప్రాచీన కాలంనుండి వికసనం పొందిన వివిధ కళలలో శిల్ప కళకి విశిష్ట స్థానం వుంది.

వేదపురాణాది గ్రంథాలలో చిత్ర శిల్పకళల ప్రసక్తి కన్పిస్తుంది. కాని మనకగ్పించే తొలి శిల్పకళ మౌర్యులది. అశోకుడు బౌద్ధాన్ని స్వీకరించి. అహింస, సర్వమానవ సౌభ్రాతృత్వం, కరుణ, ప్రేమ వంటి విలువలను ప్రచారం చేయడానికి, ప్రజల్లో సమతాభావాన్ని, ప్రేమ భావాన్ని కల్గించడానికి, వైరభావాన్ని నశింపచేయడానికి, ఒక్క మనదేశంలోనే గాక, విదేశాలలో సైతం అనేక ఆరామాలు, స్థూపాలు, గుహలలో బౌద్ధ జాతక కథలను, బోధిసత్వుని కథలను శిల్పీకరించాడు. బుద్ధుని విగ్రహాలు, మంజుశ్రీ తారాదేవిల విగ్రహాలు- ప్రపంచమంతటికీ కరుణని ప్రవహింప చేస్తున్నట్లు కన్పిస్తాయి. చూపరుల హృదయాలను దయాప్లావితం చేస్తాయి.

శాతవాహనులు, ఇక్ష్వాకుల కాలంలో బౌద్ధశిల్పం శిఖరాయమాన స్థాయిలో వెలుగొందింది.

అమరావతి, నాగార్జునకొండ, విజయపురి - బౌద్ధధర్మ ప్రచారానికి శిల్పకళని వాహకను చేసుకొని అద్భుతమైన శిల్పకళాఖండాలు సృష్టించారు.

బుద్ధుని మానవరూపంలో, సంకేతాల రూపంలో చూపించారు. మాయాదేవిస్వప్నం సిద్ధార్థజననం, యశోధరా రాహులులతో బుద్ధుని సమాగమం,అజాతశత్రుని బుద్ధసందర్శనం, స్వర్గదర్శనం, మహాభినిష్క్రమణం శిల్పాలు - అహింసని, కారుణ్యాన్ని కల్గించే విధంగా చెక్కబడ్డాయి. ధర్మం, సత్యం, నీతిని తెలిపే ఎన్నో గాథలు శిల్పాలలో మలచబడి - నాటి జనజీవితాన్ని ప్రశాంతమయం చేశాయి.

విజయనగరంలో గుప్తులు, రాష్ట్రకూటుల కాలాల్లో హిందూదేవాలయాలు నిర్మించబడ్డాయి. పల్లవులు, చోళులు, విష్ణుకుండినులు అనేక దేవాలయాలు నిర్మించి, శిల్పకళద్వారా ప్రజాజీవనంలో సుఖశాంతులు, దైవంపట్ల భక్తి విశ్వాసాలు, మానవ హృదయాల్లో ప్రేమాభిమానాలు కల్గించడానికి ప్రయత్నించారు.

విజయనగరంలోని విఠలస్వామి ఆలయం, హలేబీడు హోయసలేశ్వర ఆలయకుడ్య శిల్పాలు, బేలూరు మహిషాసుర మర్దని, శ్రీరంగపట్టణంలో రంగనాథాలయం, హంపీ ఆలయాలు శైవవైష్ణవ గాథలని శిల్పీకరించాయి. అంతే కాదు మానవ జీవితంలోని అనేక కోణాల్ని చూపించే శిల్పకళా ఖండాలకు ప్రాణం పోశారు శిల్పులు.

ఎల్లోరా-బౌద్ధహిందూజైన గుహాలయాల్లో, ఏకశిలాలయాలు గలిగి, భారతీయ కళావికసన చరిత్రలో విశిష్ట స్థానాన్ని ఆర్జించిన కళాక్షేత్రం.

అవలోకితేశ్వర, బోధిసత్వ విగ్రహాలు, మైత్రేయ బుద్ధవిగ్రహాలు, ధర్మచక్ర ప్రవర్తక బుద్ధవిగ్రహాలు - భూమి స్పర్శ ముద్రను వహించినవి - మనసులో శాంతి ద్వారాలు తెరుస్తాయి. ధ్యానమయి జ్ఞానమయి విగ్రహాలు - బుద్ధిని, హృదయాన్ని, సమస్త చైతన్యాన్ని అలౌకికా నందానికి గురి చేస్తాయి.

కైలాసనాథాలయం, పంచనదీ దేవతాలయం శిల్పకళకు ప్రపంచ ప్రసిద్ధి చెందాయి.

'కైలాసాన్నెత్తే రావణుడు' శిల్పం గొప్ప ఆధ్యాత్మిక భావనని కల్గిస్తూ కళా విమర్శకుల మన్ననలు కూడా పొందినట్టిది. ఒక పక్కగా ఒరిగిన కైలాసం, దాన్నెత్తగలిగిన తన బలిమికి సగర్వతని ప్రకటించు రావణుని హావభావాలు సంభ్రమతతో- ఈశ్వరుని కైదండ నాశించిన పార్వతి, స్థితప్రజ్ఞతతో కొండను క్రిందికి నొక్కేడు శివుని పూనిక- తన ఇరవై చేతులు కొండకింద నలుగుతున్నా ధైర్యం వీడని పూనిక చూపు రావణుడు- అద్భుతమైన శిల్పం- పరమ మాహే శ్వరుడైన రావణుని మహోద్ధత భక్తిని చాటుతోంది. దశావతారాలు, త్రిపురాంతక, గరుడారూఢ విష్ణుమూర్తులు, రామాయణ గాథా శిల్పాలు, గిరిజా కల్యాణం- శివ కేశవ అభేదాన్ని చాటుతూ ప్రజల్లో మత భేదాల్ని పోగొట్టే విధంగా చెక్కబడ్డాయి.

ఉండవల్లి, మొగల్రాజపురాలలో- వైష్ణవ సంబంధ గాథా శిల్పాలు కన్పిస్తాయి.

కాకతీయులు శైవభక్తులు శివుడు, వీరభద్రుడు, కాళి మొదలైన దేవతా లయాలు నిర్మించారు. ఏకశిల, హనుమకొండ, వరంగల్లులలో 13,600 ఆలయాలు నిర్మించారట. వీటిలో వైష్ణవాలయాలు కూడా ఉన్నాయి. కాకతీయులు నటేశ్వర నాట్యమహదానందం చూపించారీ శిల్పంలో.

శిల్పకళ యందు శాంతరసానికి ప్రాధాన్యత ఎక్కువ. అనేక దేవతా ప్రతిమల్లో ఇది కన్పిస్తోంది.

'ధ్యానబుద్ధ' 'ప్రజ్ఞాపారమిత' మొదలైన మూర్తుల్లో ఈ సాత్వికశాంత రసం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. భారతీయ శిల్ప సంప్రదాయాన దక్షిణ భారతపు

నటరాజ విగ్రహం గతిశీలతను ప్రదర్శించటంలో విశిష్టమైంది. అందులో కన్పించే అఖండ నృత్యం అనంతగతిని, విశ్వవ్యాప్త లయవిన్యాసాలని పరికిస్తే అక్కడ కన్పించేది శివతాండవం కాదు, విశ్వతాండవం అన్పిస్తుంది. ఉత్తర భారతంలో ధ్యానబుద్ధుడు, దక్షిణంలోని నటరాజు- మొదటిది ప్రశాంతికి- రెండవది గతి శీలతకి జీవవంతమైన లయ విన్యాసానికి ప్రతిరూపాలు. స్థితిగతి సమన్వయతను సాధించినపుడు జడచేతనాలకి ఒక రీతి ఐకమత్యం ఏర్పడుతోంది.

చివరగా చిత్రలేఖనం -

చిత్రకళంటే విన్పించని సంగీతం, మాట్లాడని కవిత్వం. ఒక దేశ సంస్కృతిని రంగులలో చూపించిన చిహ్నం చిత్రకళ.

చిత్రకళ ప్రధానంగా రెండు రకాలు :

1) ప్రకృతి చిత్రణ. 2) మూర్తికల్పన.

మానవాకృతిలోని భావప్రకటన, అందులో ప్రతిఫలించే ఆనందం, ఆవేదన, సంవేదన - ఆనందించటంలో ఎంత రసానందం ఉందో, ప్రకృతిలోని వివిధ వాతావరణ దశల్ని, సూర్యోదయ సూర్యాస్తమయాల్ని, తొలకరి మబ్బులు, మంచు, తుఫాను, వెన్నెల, ఎండ, వాన - వీటన్నిటిని చిత్రంలో చూడటంలో అంత రసానుభూతి పొందొచ్చు.

భావం, రంగు కలిస్తేనే ఉత్తమ చిత్ర నిర్మాణం జరుగుతుంది కళాకృతికి భావసౌరభం ఎంత అవసరమో, రూపమాధుర్యం కూడా అంతే అవసరం.

మంచు, పొగ, అగ్ని, మెరుపులు, స్ఫటికం, చంద్రుడు ఇవన్నీ కవికైనా చిత్రకారుడికైనా ప్రేరణ కలిగించేవి. యోగంలో బ్రహ్మ సాక్షాత్కారం కలగబోయే ముందు ఇవన్నీ ప్రత్యక్షమౌతాయట. ప్రకృతి యోగ సాధకుల కెలా బ్రహ్మానంద సాక్షాత్కారమో, చిత్రకారుని కుంచె ఒలికించే ఆ ప్రేరణలు చూసే ప్రేక్షకుడికి బ్రహ్మానంద సాక్షాత్కారాన్ని కల్గిస్తాయి.

కళకి మూలం - కేవలం బహిః ప్రపంచమే కాదు, అంతరిక ప్రపంచం కూడా దానికి వస్తువే. అలాగే కళా ప్రయోజనం సాంఘికమే కాదు, వైయక్తికం కూడా.

కళ ఏ దేశంలో ఉద్భవించినా అది ఆధ్యాత్మికమే. డా॥ సంజీవ్‌దేవ్ గారి మాటల్లో "రసానుభూతి అనేది అన్ని దేశాలలో కూడా ఆధ్యాత్మికమే. సూక్ష్మత్వం లేనిదే ఏ దేశంలో కూడా రసతన్మయత జనించదు. సహృదయునిలో ఈ సూక్ష్మత్వాన్నే ఆధ్యాత్మిక మనే పేరుతో పిలిస్తే .... జగత్తులోని రస తన్మయత అంతా ఆధ్యాత్మికమే మరి...." అన్నారు.

'రంగు' కేవలం రంగే కాదు. అది ఆలోచనాత్మకం, అనుభూతి ప్రదాయకం. ఒక రేఖ - విషయాన్ని తెల్పితే దాన్నే రంగులో చిత్రిస్తే - అది ఒక సంవేదన కందిస్తుంది అందుకే రంగు - దృశ్య సంగీతమైంది. కవిత్వమైంది.

మానవ జీవితంపై ఒక్కో రంగు ఒక్కో ప్రభావాన్ని కలిగిస్తుంది. గులాబీరంగు శుద్ధమైన అనురాగాన్ని, నీలం భక్తిని, గోధుమ రంగు స్వార్థాన్ని, సిందూరం కోపాన్ని, ఎర్రని ఎరుపు ఇంద్రియలోలతని, తెలుపు పరిశుద్ధతని- తెలుపుతున్నాయి.

ఎరుపు నీలం కలిపితే వచ్చే ఊదా రంగు మనిషిలోని సంఘర్షణాత్మకతను తెలుపుతుంది. అంటే ఎరుపు ఉద్రేకాన్ని, నీలం శాంతిని బోధిస్తూ.... మనిషి తనకంటే ఉన్నతమైన శక్తిని అందుకునే సాధనకి ప్రతీకగా కన్పిస్తుందిది.

ఎరుపు పసుపు కలిస్తే కాషాయరంగు వస్తుంది. ఇది కాంతికి, జ్ఞానానికి సంకేతం - సాధువులు, యోగులు కాషాయ బట్టలు ధరించినట్లు చిత్రాల్లో కన్పడేది ఇందువల్లనే - అలాగే దేవతా చిత్ర పటాలలో, దేవతల తలల చుట్టు కన్పించే తేజో మండలం ఈ కాషాయ రంగులోనే ఉంటుంది. ఇది ఒక పూజ్య భావనని, భక్తి భావనని మానవ హృదయాల్లో కల్గిస్తుంది - ఇందుక్కారణం- ఆ వర్ణ మిశ్రమం. రంగుల ప్రభావం మనిషి సాంస్కృతిక జీవితంపైన, వ్యావహారిక జీవితం మీద తనకి తెలీకుండానే ప్రభావాన్ని చూపుతుంటాయి.

ప్రాచీన చిత్రకళ శాతవాహనుల కాలంలో వికసించింది - రాయల కాలంలో - లేపాక్షి, హంపి, విరూపాక్షాలయం, గ్రామ దేవాలయాల్లో, దేవ మూర్తుల చిత్రణ కన్పిస్తోంది.

ప్రాచీన భారతీయ చిత్రకళని కూడా శిల్పంలాగే రెండు రకాలుగా చూడాలి.

1. వైదిక సాహిత్యం ఆలంబనగా వచ్చిన చిత్రకళ.

2. బౌద్ధ జైనాలు ఆలంబనగా వచ్చిన చిత్రకళ.

బౌద్ధం ప్రాబల్యంగా ఉన్న రోజుల్లో ఈ చిత్రకళ బౌద్ధంలోని ఆద ర్శాన్ని తేజోమయం చేశాయి.

అజంతాలోని 17వ గుహలో తల్లీ తనయుడు చిత్రం చాలా ప్రసిద్ధమైంది. బుద్ధుడు భిక్షా పాత్రతో తన ఇంటి ముంగిట నిలబడ్డాడు. యశోద రాహులు నితో ఆయన కెదురుగా నిలబడింది. రాహులుడు చాలా అమాయకంగా రెండు అరచేతులు తెరచి బుద్ధునివైపు చూస్తుంటాడు (అప్పుడే భిక్ష వేసుండొచ్చు) యశోధర భర్తవైపు చూస్తున్నది. ఆమె చూపుల వైఖరే ఈ చిత్రానికి ప్రాణం. విషాదాన్ని, ఆనందాన్ని సమంగా చూపుతున్న ఆ నేత్రాలు.... ఆ ముఖంలో సిద్ధార్థునితో తాను గడిపిన మధురమైన సాంసారిక జీవితంలోని తీపి అనుభూతుల ప్రకటన ఒకవైపు; సిద్ధార్థుడు బుద్ధుడై తనని అనంత వియోగంలో, విషాదంలో వదిలిపోగా, ప్రణయమంతా ప్రళయమైన భయంకర స్మృతులు మరోవైపు.... వెలుగు నీడల్లా ఆమె ముఖంపై ఏక కాలంలో కదలాడేట్లు చూపగల్గిన ఆ శిల్పి ఎవరోగాని....అతడు అపర సృష్టికర్త.

ప్రపంచానికి జ్ఞాన జ్యోతిని ప్రసాదించేవాడు. రాగానికి బద్ధుడు కాడుకదా! అందులో ఒక వ్యక్తికి ఆయన ప్రేమ పరిమితం కాదు. అది విశ్వజనీనం.

బౌద్ధ శిల్పులు మత విషయాలతోపాటు, లౌకిక విషయాలకూ_డా ప్రాధాన్యతిచ్చారు. మానవమూర్తులు, పశుపక్ష్యాదులు, మానవ జీవితంలోని దైనం దిన ఘట్టాలు నిత్య జీవితంలోని రాగద్వేషాలు, స్నేహాలు, నృత్య గానాలు, జనన మరణాలు, అలంకారాలు....జీవితంలోని సమస్త కోణాల్ని విడిచిపెట్ట కుండా చిత్రించారు.

పురాణ గాథా చిత్రాలలో రామాయణ సంబంధాలు, కృష్ణ కథలు ఎక్కు_వగా చిత్రించబడ్డాయి.

రామాయణ చిత్రాలు ధార్మిక జీవనం మోక్షమార్గంగా చెబితే, కృష్ణ, రాధల ప్రణయ చిత్రాలు జీవేశ్వరుల అద్వైత సంగమాన్ని చూపిస్తున్నాయి. ఇదే కళాకారులు చూపిన ఆధ్యాత్మిక దర్శనం.

పాశ్చాత్యులు మనదేశానికి రావటంతో వారి సాహిత్యంతోపాటు చిత్రకళ కూడా మనదేశంలో ప్రవేశించింది. పాశ్చాత్య చిత్రకళ తైలవర్ణ ప్రధానమైతే, భారతీయ చిత్రకళ రేఖా ప్రధానమైంది.

కేరళలోని రాజా రవివర్మ భారతీయ వస్తువును తీసుకొని పాశ్చాత్య పద్ధతిలో, తైలవర్ణ చిత్రణలో పౌరాణిక చిత్రాలను రచించి, గొప్ప చిత్రకారుడిగా పేరు పొందాడు. మొట్టమొదటి దేవతా రూపాల చిత్రకారుడితనే.

19వ శతాబ్దంలో దేశాభిమానం, జాతీయత, సంస్కృతిపట్ల అభిమానం, పాశ్చాత్య సంస్కృతి నిరసనం ఎక్కువైనాయి. ఈ నేపథ్యంలో - వంగదేశంలో అవనేంద్రుడు, గగనేంద్రుడు మొ॥న వారు భారతీయ చిత్రకళా శైలి ననుసరించి చిత్రరచన చేశారు. అజంతా, రాజపుత్ర, మొగల్ శైలుల్ని దృష్టిలో ఉంచుకొని అవనేంద్రుడు నవ్యభారత చిత్రకళను సృష్టించాడు. ఇది నవ వంగ సంప్రదాయం అన్న పేరుతో ప్రసిద్ధి చెందింది.

ఆధునికాంధ్ర చిత్రకళ 3 భాగాలుగా విభజింపబడింది. 1) నవవంగ సంప్రదాయం 2) బొంబాయి సంప్రదాయం 3) రాయ్ చౌధురి సంప్రదాయం.

నవ వంగ సంప్రదాయానికి చెందిన ప్రమోదకుమార ఛటోపాధ్యాయ కొందరు చిత్రకారుల్ని తయారుచేశాడు. వారిలో ప్రసిద్ధులు అడివి బాపిరాజు, కౌతా రామమోహనశాస్త్రి, టి. కేశవరావ్ మొ॥నవారు. వీరంతా నీటి రంగులతో ఎక్కువగా పౌరాణిక చిత్రాలనే చిత్రించారు. బాపిరాజు చిత్రాలలో "శబ్దబ్రహ్మ" "భాగవత పురుషుడు" "సూర్యదేవ" "సముద్రగుప్తుడు" "మృత్యుంజయ" చిత్రాలు ప్రఖ్యాతమైనవి. ఇవి సంస్కృతికి దర్పణాలు.

కౌతా ఆనందమోహన్ ఆంధ్ర చిత్రకారుడు - శ్రీకృష్ణుడు, గొర్రెలని కాచే గోపిక, గ్రామవీధి, బుద్ధుడు, వరూధిని, అజంతానర్తకి, ఏకలవ్యుడు, శివపార్వతులు, కత్తిని పదును పెట్టువాడు, సంతనుండి, రుద్రుడు - మొదలైన ప్రఖ్యాత చిత్రాలు రచించిన చిత్రకారుడు.

ఆధ్యాత్మిక, లౌకికాల ద్వారా - మానవుడిలో అంతర్లీనంగా, సుషుప్తిలో వున్న చైతన్యాన్ని తట్టిలేపి, ధర్మం, సత్యం, ప్రేమ మొదలైన మానవీయ విలువల్ని, వాటి అవసరాన్ని అర్థమయ్యేలా చెప్పటమే ఈ చిత్రాల సారాంశం.

అవనీంద్రనాథ ఠాకూర్ - తిష్యరక్షిత, గగనయతులు బుద్ధుడు - సుజాత, ఋతుసంహారంలో వేసవి వర్ణన, - ఈ చిత్రాల్లో భారతీయ సంప్ర

దాయానుగత రీతులు కన్పిస్తాయి. "అంతిమయాత్ర" ఈయన చిత్రాల్లో గొప్పది. "జాతస్య హి ధృవోమృత్యు" అన్న గీతాసూక్తిని చాలా గొప్పగా చిత్రించిన చిత్రమిది - మనిషిని "స్థితప్రజ్ఞుని"గా మార్చగల శక్తిగలది.

బొంబాయి సంప్రదాయానికి చెందినవారిలో దామెర్ల రామారావ్ ప్రతిభ గల కళాకారుడు. వీరి చిత్రాలలో వాస్తవవాదం ఎక్కువ.

రాయ్‌చౌధురి సంప్రదాయం - ఆంధ్ర చిత్రకళకి పూర్ణత్వాన్ని అందించింది. మొక్కపాటి కృష్ణమూర్తి, పైడిరాజు, మాధవ పెద్ది గోఖలె మొదలైన వారెందరో ప్రసిద్ధులు.

'హిందోళరాగం' అనే చిత్రం దక్కన్ సంప్రదాయంలో ప్రసిద్ధి చెందింది. అప్పట్లో దక్కన్ అంతటా రాగరాగిణులకి చిత్రరచన చేయటం సాధారణంగా ఉండేది. ఈ చిత్రం భావకవితలాంటిది. ఒక రాకుమారుడు తన ప్రేయసితో ఉయ్యాల ఊగుతుంటాడు. ఈ చిత్రాన్ని కంటితో చూస్తుంటే చెవితో హిందోళరాగం వింటున్నట్లుంటుంది.

ఈనాడు ప్రపంచమంతటా ఆధునిక చిత్రకళ పేరుతో - చాలామందికి అర్థంగాని నైరూప్య చిత్రకళలో ఆంధ్రులుకూడా ముందంజలో ఉన్నారు. యస్. వి. రామారావ్ ఈ ఆధునిక చిత్రకళలో అంతర్జాతీయఖ్యాతి గాంచాడు.

సాహిత్యంలో - ముఖ్యంగా కవిత్వంలో ఎన్ని "ఇజాలు" వచ్చాయో అన్ని చిత్రకళలోనూ వచ్చాయి.

ఆధునిక నైరూప్య చిత్రకళకి ఆద్యుడు పికాసో. సంప్రదాయ విధానాలకి వ్యతిరేకంగా రూపసృష్టి చేయటమే ఈ నవ్యరీతుల ఆదర్శం.

ఫ్రాన్స్‌లో చెలరేగిన విప్లవం వలన పాశ్చాత్యుల సంస్కృతిలో ఒక నవ్య దృక్కోణం ఏర్పడి, అది సంప్రదాయాలకు, నియమాలకు లోబడక ప్రతి విషయంలో స్వేచ్ఛ మొదలైంది. ఫలితంగా కళలో ఒక అనిబద్ధత, నియమ రాహిత్యం ఏర్పడి, అనేక నవ్యరీతు లొచ్చాయి. ఫ్యూచరిజం, ఎక్స్‌ప్రెషనిజం, స్రియలిజం, డాడాయిజం, ఆప్, పాప్ కళారీతులు చిత్రకళలో కుదురుకున్నాయి. కళను రూపభావన నుండి రూపాతీత భావనకు చేర్చటమే ఈ నవ్యుల ఆశయం.

అయితే చిత్రకారులంతా ఈ ఆధునిక చిత్రకళనే చేయుచున్నారనలేము. సంప్రదాయ రీతిని సారూప్య విధానంలో సృజన చేసేవారు చాలా మంది ఉన్నారు. కాని వీరికి పెద్దగా స్థానం లేదు. సామాన్యులకు ఈ ఆధునికకళ అర్థమవుతుందా, కాదా? అన్న ప్రశ్నతో నిమిత్తం లేకుండా ఆధునిక నైరూప్య కళాసృష్టి బాగానే సాగుతోంది. కాని, ప్రజలకి అందుబాటులో లేని కళ, అర్థంకాని కళ ఎంతకాలం నిలబడ్తుంది?

సాహిత్యంలో, చిత్రకళలో వచ్చినంత తీవ్రమైన మార్పులు సంగీత నృత్యాలలో రాలేదు.

ఇప్పుడిప్పుడు కర్నాటక సంగీతం ప్రజాదరణని కోల్పోతూ ఆ స్థానంలో లలిత సంగీతం, హిందూస్థానీ చోటు చేసుకొంటున్నాయి.

భరతనాట్యంపై మమకారం తగ్గి, కథక్‌పై అభిమానం కలుగుతోంది.

హైద్రాబాద్ ఉత్తరాది రాష్ట్రాలకి చేరువగా ఉండటం దీనికి కారణం కావచ్చు.

ఏమైనా స్వాతంత్ర్యానంతరం - సంస్కృతికి సంబంధించిన ప్రతి రంగంలో స్థూలత్వం తగ్గి సూక్ష్మత్వం ఎక్కువైంది. ఇది ఒక్క లలిత కళల్లోనే కాదు - మానవ జీవితంలోని అన్ని కోణాల్లో కన్పిస్తోంది.

సమాజం సంధి యుగంలో వుంది. అనేకమార్పులు రాజకీయ ఆర్థిక సామాజిక సాంస్కృతిక రంగాల్లో వచ్చాయి. దీనివలన ప్రజల సాంఘిక పరిస్థితుల్లో, అవసరాల్లో, అభిప్రాయాల్లో, అభిరుచుల్లో, ఆచరణలలో ఎంతో వైవిధ్యంతో కూడిన మార్పులొచ్చాయి. వీటి ప్రభావం సాహిత్య, చిత్రలేఖనాలపై ఎక్కువగాను, సంగీత నృత్యాలపై తక్కువగాను కన్పిస్తోంది. అయితే మౌలికమైన విలువల్లో మాత్రం మార్పులేదు. ప్రేమ, దయ, సత్యం, కరుణ, అహింస మున్నగు విలువలే లలితకళలకి ఈనాటికీ జీవశక్తులు.

# తల్లిదండ్రులు – పిల్లల పెంపకం మానవతా విలువలు

—డాక్టర్ కె. వి. కృష్ణకుమారి

బాధ్యతా రాహిత్యం ఏ విషయంలోనూ హర్షణీయం కాదు. అనునిత్యం ఎన్నో చికాకులు- తట్టుకోలేని మనస్తాపాలు ఆర్థిక ఇబ్బందులూ, మనఃక్లేశాలూ- మానసిక సంక్షోభాలు - మనిషిని మానసికంగా కృంగదీయటం, బలహీన పర్చటం సహజం. ఆ వలయంలో మనిషి తన సహజ ధర్మాలను కూడా విస్మరించటం సహజం. ఐతే అవి తాత్కాలికమే కావాలి.

ఎవరి పట్ల ఎవరు అలక్ష్యంగా ప్రవర్తించినా సరిదిద్దుకుపోయే అవకాశా లున్నాయి. ఐతే ఆ పిల్లల విషయంలో వాళ్ళ పెంపకం విషయంలో ఎటువంటి అలక్ష్యం, అశ్రద్ధ సహించలేనిది. క్షమార్హంకాదది.

నాగరికత వెఱ్ఱితలలు వేస్తోంది. మనిషికీ మనిషికీ వున్న అనుబంధాలూ, ఆత్మీయతలూ కృత్రిమమైపోతున్నాయి. క్షణికమైపోతున్నాయి.

దాంపత్య జీవితానికున్న పవిత్రతకి అర్థమే మారిపోతోంది. అసలు బంధం వుండీ వుండనట్టే త్రిశంకు స్వర్గంలో వున్నట్టున్నా క్షణికావేశానికి చిహ్నాలుగా పిల్లలు పుట్టుకొస్తున్నారన్న భావన చాలా మందిలో మిగిలే వుంటుంది. ఆ భావనే పసివాళ్ళ జీవితాలని అంధకారంలోకి నెడుతున్నాయి.

అవగాహనా- ఆత్మీయతా లోపించి- అహంకారం- అధికార దర్పం అధిక శాతంలో వుండి- అన్నీ వున్నా మనశ్శాంతిని కరువు చేసుకుంటూ ఇంటిని నరకప్రాయంగా తయారుచేస్తున్న తల్లిదండ్రులెందరో వున్నారు. వాళ్ళ పంతాల మధ్యా- పట్టింపుల మధ్యా- పసివాళ్ళ భవిష్యత్ మొగ్గలోనే తునిగిపోతోందన్న ఇంగితజ్ఞానం మర్చిపోయినవాళ్ళమధ్య శాపవశాత్తు పుట్టిన పిల్లలు మానసిక రోగులైనా అవుతారు, బాల నేరస్థులుగానైనా తయారవుతారు - అవుతున్నారు.

నా దగ్గరకు పాపను తీసుకు వచ్చిన జంట - కాలేజీల్లో దొరికే డిగ్రీలని చదివి పట్టాలు పుచ్చుకున్నవాళ్ళే. ఒకర్నొకరు అర్థం చేసుకున్నామన్న భ్రమలో దాంపత్య జీవితంలోకి అడుగుపెట్టినవారే. ఐతే, పెళ్ళయాక అసలు స్వభావాలు బయటపడ్డాయి.

భార్య అనుమాన పిశాచి. భర్త తల్లితో మాట్లాడినా, చివరికి చెల్లితో మాట్లాడినా కళ్ళల్లో నిప్పులు పోసుకునేది. ఆ ఇంట్లో తనే సర్వాధికారిణిగా వుండాలి. ధనం తెచ్చిన అహం భర్తను పురుగుగా, భర్త తాలూకువాళ్ళని కీటకాల్లా, చివరికి కన్నకూతుర్నీ హేయంగా హీనంగా చూసేది.

నిత్యం గొడవలే. నిత్యం అపార్థాలే. భర్త ప్రతిచర్యకూ అనుమానాలే. ఆంక్షలతో రాక్షసిలా నిలేసి ఎదురుతిరిగే భార్యముందు జీవచ్ఛవమయాడు భర్త.

కూతురు ఆరేళ్ళ పసిది. తల్లిదండ్రుల ఆప్యాయానురాగాలు ఎరుగదు, ప్రేమాభిమానాలకి అర్థం తెలియకుండా పెరిగిన ఆ పాపకి తెల్సింది ఒకే వాతావరణం. అదే భయంకర వాతావరణం.

ఆ వాతావరణంలో పాప పిచ్చిదైపోయింది. తన్లో తనే మాట్లాడుకోటం. చెప్పుకునే వాళ్ళులేక ఆకులతోను, పువ్వులతోను మాట్లాడుకోటం, వంటరితనాన్ని భరించలేక మౌనంగా తన్లో తనే కుళ్ళి కుళ్ళి ఏడవటం.

ఈ స్థితిలో ఆ పాపని తీసుకు వచ్చారా తల్లిదండ్రులు. అందరి పిల్లల్లా ఉత్సాహంగా వుండదనీ, చురుకుగా చదవదనీ, నిద్రపోదనీ, చదువురాదనీ వాళ్ళ అభియోగం.

వాళ్ళ అభియోగానికి నవ్వాలా ఏడవాలా?-

అసలైన మానసిక రోగులు అన్నీ తెల్సుననుకునే ఆ తల్లిదండ్రులు! పిల్లల్ని కనటంతోనే తమ బాధ్యత తీరిపోయిందనుకుని, అర్థంలేని అభిజాత్యాలతో - ఇంటిని నరకం చేసుకుంటూ - పసిపాప భవిష్యత్‌ని అంధకారం చేస్తున్నారు.

తమ తప్పులు తమకి కన్పించటం లేదు.

తమ అజ్ఞానం కళ్ళముందు నిలవటం లేదు.

నాశనమైపోతున్న పాప భవిష్యత్తును కళ్ళముందుంచితేనైనా వాళ్ళలో మార్పు వస్తుందేమో! పసిపాప పరంగా మానవత్వం చిగురిస్తుందేమో!

ఆ ప్రయత్నంలోనే ముందా తల్లిదండ్రులకి సైకోథెరపీ ట్రీట్‌మెంట్ జరుగుతోంది.

మరో కుటుంబం.

ఆ దంపతులకి నలుగురు అమ్మాయిలు. వంశోద్ధారకుడు లేనిదే ఆ కుటుంబానికి మోక్షం లేదుట. ఆ ఇంట్లో మూడు తరాలవారి అభిప్రాయం. మూఢనమ్మకం అదే. అశుభం శుభం తెలియని నలుగురు పసిపిల్లలూ ఎటువంటి ఆదరణ ప్రేమానురాగాలు లేకుండానే గాలికి పెరిగినట్టు పెరిగారు. ఐదోసారైనా అబ్బాయి పుడతాడనుకుంటే అప్పుడూ అమ్మాయే! ఆ తల్లి బ్రతుకు దుర్భరమైపోయింది. ఆదరణా, అభిమానం తల్లికే లోపించినప్పుడు ఇంకా ఇంట్లో ఆ పసిపిల్లల స్థానం ఎంత హేయంగా, హీనంగా వుంటుందో చెప్పాల్సిన అవసరం లేదు.

ఈ పిల్లలకి తిండి పెట్టటం పోషించటం కూడా వ్యర్థమన్న భావం నరనరాలా జీర్ణించుకుపోయి మానవతా విలువల్ని మరచి, శాడిజంతో ఎదిగే మొగ్గల్ని నాశనం చేస్తున్న కుటుంబాలు ఇటువంటివి ఎన్నో-

బాబే పుడతాడని ఆశలు పెట్టుకోగా పుట్టిన ఐదో పాప వాళ్ళ శాడిజాన్ని మరింత దారుణంగా ఎదుర్కోవలసి వస్తోంది. ఇటువంటి కుటుంబానికి బ్రెయిన్ వాష్, మందలింపూ సైకోథెరపీ అత్యవసరం.

అదే జరుగుతుందిప్పుడు.

పిల్లల్ని అలక్ష్యం చెయ్యటం, నిర్లక్ష్యంతో పెంచటం ఒక్క ఆడపిల్లల విషయంలోనే కాదు, మొగపిల్లల విషయంలోనూ క్రమం తప్పకుండా జరుగుతున్న ప్రక్రియ.

ఉదాహరణకి—

అతను బాధ్యతగల ఉద్యోగం చేస్తున్నాడు. తండ్రి సెంట్రల్ గవర్నమెంటు ఎంప్లాయి. భార్య అతని చెప్పుక్రింది తేలు, తండ్రిని చూస్తే ఆ యింట్లో గడగడలాడాలి. ఎవరికీ స్వంత అభిప్రాయాలనేవి వుండకూడదు. భార్యనే మనిషి గుమ్మందాటి వెలుగును చూడకూడదు. ఇరవైనాలుగ్గంటలూ వంటింటికే అంకితమైపోవాలి. ఈ ఇంట్లో మామగారి డామినేషన్, తండ్రి నియంతృత్వం, తల్లి నిస్సహాయతా వారి పిల్లల్ని సహజంగానే అసమర్థులుగా, స్వయం

నిర్ణయాలుతీసుకోలేని అర్భకులుగా తయారుచేశాయి.అదృష్టంకొద్దీ చిన్నవయస్సు లోనే అమ్మాయికి పెళ్ళైపోయింది. భర్త సంస్కారి. కొడుక్కీ పెళ్ళైంది. ఐతే అతని పరిస్థితి అడకత్తెర మధ్య పోకచెక్కలా తయారైంది. తండ్రి అణచి వేత ధోరణి మారదు. పరాయింటి పిల్ల భార్యతో వాతావరణానికి తలవొంచి వుండా ల్సిన అవసరం లేదు. తండ్రి అనాగరిక ప్రవర్తన, భార్య తొందరపాటు చేష్టలూ, ఆ అమ్మాయి తాలూకువారు సృష్టించే రసాభాసా తట్టుకోలేకపోయా డీ యువకుడు. తట్టుకోలేకే నిద్రమాత్రలు మింగి గర్భం పోగొట్టుకుని పిచ్చి దైంది భార్య. ఆత్మహత్య తప్ప మరోదారి లేదనుకుంటున్న అతనిని ఎలా సమాధానపర్చాలి?

తండ్రి శాడిస్ట్, తల్లి బలిపశువు, భార్య మెంటల్ పేషెంట్, అత్త మామలు నిందించే మనుషులు. వీళ్ళ మనస్తత్వాలు మారవని తెలిసే, ఈ వాతా వరణంలో పసిపాపలు బ్రతకలేరని తెల్సే అతను Vasectamy చేయించు కున్నాడు. ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నాడు.

ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో- వందలూ, వేలూ, లక్షలూ.... పుట్టుతో పుట్టిన బుద్ధి పుడకలతోగానీ పోదా? దానిని మార్చలేమా?

మార్చగలమన్న నమ్మకంతో - సైకోథెరపీ ఇవ్వటం జరుగుతోంది- ప్రతీ ఒక్కరికీ.

ప్రతీ మనిషిలోనూ - సహజంగానే మానవతా విలువలు నశిస్తున్నాయి. స్వార్థం గూడుకట్టుకుని - మంచితనం మరుగునపడిపోతుంది - ఉమ్మడి కుటుం బాలలో - ఈ స్వార్థం త్రాచులా బుసలు కొడుతోంది. పసిపిల్లల పరంగా విషం కక్కుతోంది - ఎదుటివారు చూపించే ప్రేమానురాగాలే పసివాళ్ళ పాలిట సంజీవినిలా పనిచేస్తాయిగాని- అర్థం పర్థం లేని అసూయలు. ఎక్కువ తక్కువ తారతమ్యాలూ - తమ పిల్లలలో లోపించిన చురుకుదనం, తెలివితేటలూ ఎదుటి వారిలో కన్పిస్తున్నాయన్న దుస్థితి పచ్చని పసి జీవితాలు వాడి నేల కొరిగేలా చేస్తాయి.

పిల్లలు లేరన్న బాధతో డాక్టర్ల చుట్టూ తిరుగుతూ మనశ్శాంతి లోపించినవారిసంఖ్య ఎంతగా ఎక్కువైపోతోందో, పిల్లలు పుట్టాక వారి అతీ గతీ పట్టించుకోని వారి సంఖ్యా, మూఢత్వంలో వారి శారీరక ఆరోగ్యాన్ని అలక్ష్యం చేసేవారిసంఖ్యా, మూర్ఖత్వంతో వారి మానసిక వికాసాన్ని కాలరాసే వారిసంఖ్య ఎక్కువైపోతోంది.

నాగరికత వెఱ్ఱి తలలు వేస్తున్నవారికి, పిల్లలకి పాలియ్యటం కూడా నామోషీనే. పాలిస్తే తమ అందం ఆకర్షణా ఎక్కడ తరిగిపోతాయోనన్న భయం. క్షణికమైన అందానికీ పైపై మెరుగులకీ తెచ్చుపెట్టుకునే ఆకర్షణకి ప్రాధాన్యత నిచ్చేవారు పిల్లల ఆరోగ్యాన్ని పట్టించుకునే స్థితిలో వుండటం లేదు. తల్లిపాలు అమృతం. అందులోని పోషక విలువలూ- వ్యాధి నిరోధక శక్తి అపారం. ఈ పసిపాపల్ని రుగ్మత నుంచి కాపాడి ఆరోగ్యవంతంగా వుంచే ఏకైక సాధనం.

కానీ, ఈ రోజుల్లో ఎందరు పసిపాపలకి తల్లిపాలు అందుతున్నాయి? గుండెలకి హత్తుకుని ప్రేమతో గుండెల్లో దాచుకుని అనురాగాన్ని ప్రేమలో రంగరించి ఎందరు తల్లులు పిల్లలకి పాలివ్వగలుగుతున్నారు? ఎందరు తమ విధ్యుక్త ధర్మాన్ని సక్రమంగా నిర్వర్తించగలుగుతున్నారు?

కొందరు అందం కోసం, ఫిగర్ కాపాడుకోటం కోసం, మరికొందరు ధనాపేక్షతో ఉద్యోగాల పేరిట ఆఫీసులకి పరుగులు తీస్తూ పిల్లల్ని పట్టించుకునే సమయం లేకపోవటం, మరికొందరు, గతిలేక గత్యంతరం లేక దిగజారుతున్న ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా ఉద్యోగాలు చేయాల్సి రావటం- వీటి ప్రభావం పిల్లల మానసిక శారీరక స్థితిమీద దారుణంగా పడటం మనం చూస్తున్నాం.

పసిపిల్లల పెంపకం ఒక చక్కటి కళ. గురుతరమైన పవిత్ర బాధ్యత.

క్షణక్షణం దేనికోసమో పరుగులు పెట్టే ప్రస్తుత సమాజ వ్యవస్థలో పసిపాపల పరంగా తల్లిదండ్రులు తీసుకోవాల్సిన జాగ్రత్తలు చాలావరకూ మరుగున పడిపోతున్నాయి. ఫలితంగా తల్లిదండ్రులకి మానసిక అసంతృప్తి, పిల్లలకి మానసిక రుగ్మతా దారుణ ఫలితాన్ని అందిస్తున్నాయి.

ఎక్కడ చూసినా బేబీ కేర్ సెంటర్స్ వెలుస్తున్నాయి. తల్లిదండ్రుల అనురాగాన్ని పూర్తిగా అందుకోలేని దురదృష్టవంతులైన పిల్లలు విధిలేక ఆ సెంటర్స్‌ని ఆశ్రయిస్తున్నారు.

ధరలు ఆకాశాన్నంటుతున్నాయి- నిజమే. భార్యాభర్తలు పనిచేస్తేనే తప్ప సంసారం సాఫీగా సాగని రోజులొచ్చిన మాట నిజమే. పసివాళ్ళ భవిష్యత్ కోసం ఇద్దరూ ఉద్యోగానికి వెళ్ళాల్సి రావటం అనివార్యమన్న వాదనా నిజమే

కావచ్చు. ఐతే సంపాదనకు అంతెక్కడుంది? మన అవసరాలను తీర్చే డబ్బును మాత్రం సంపాదించి ఊరుకునే స్థితిలో ప్రస్తుత మానవ మస్తిష్కాలున్నాయా? అవి మర్కటాల్లా వెఱ్ఱిమొఱ్ఱి వేషాలు వెయ్యటం లేదా?

ఖరీదైన వస్తువుల్ని కొనటంలో ఒకర్ని చూసి మరొకరు పోటీపడుతున్నారు. పులుల్ని చూసిన నక్కల్లా వాతలు పెట్టుకుంటున్నారు. అవసరాల్ని మించి కొనుక్కోటానికి పరుగులు తీస్తున్నారు. ఈ పరుగు పందెంలో మాడిపోతున్నారు. మతస్థిమితాన్ని కోల్పోతున్నారు.

పసిపిల్లల మానసిక, శారీరక స్థితిపై అతి దారుణంగా దెబ్బ తీస్తున్నారు. పిల్లల ఆరోగ్యాన్నీ, అవసరాలనీ పట్టించుకునే అవకాశం, సమయం వీరికెక్కడుంది? నోరు తెరిచి అడగలేని పసిపిల్లల అవసరాలూ, ఆలనాపాలనా చూడగల ఓపిక, వీరికెక్కడ్నుంచి వస్తుంది? ఉద్యోగాలు మగవారికి మాత్రమే పరిమితమై, పరిమిత కుటుంబంతో ఖర్చులనూ, ఆశలనూ, కోరికలనూ కూడా పరిమితం చేసుకుని ఆరోగ్యాన్ని నిలుపుకునే తల్లి మిగిలిన కాలాన్నంతా పసిపిల్లల ఆరోగ్యం కోసం, మానసిక వికాసం కోసం ఖర్చుపెడితే ఎంత బావుంటుంది!

ఎంత చెట్టుకంత గాలి వున్నట్టే - ఎంత సంపాదనకంత ఖర్చులూ వుంటాయి. ధరలతోబాటు - మనిషికి ఆలోచన్లు ఆశలూ కూడా ఆకాశాన్నంటుతుంటే ఆలనా పాలనా లేని పిల్లల భవిష్యత్ అధఃపాతాళాని కంటుతుంది. ఇది వాంఛనీయమా? పిల్లలెప్పుడో పెద్దవాళ్ళవుతారని వాళ్ళ అవసరాల కోసం వారి పురోభివృద్ధి కోసమని తల్లులూ యంత్రాల్లా డబ్బు సంపాదనే లక్ష్యంగా పెట్టుకోవటం కన్నా పిల్లల మానసిక వికాసాన్ని పసితనం నుంచీ కాపాడాలనీ అందుకు వారిని అనురాగంతో దగ్గరకు తీసుకుని ఎక్కువ కాలం వారి వారి పోషణకూ చదువుకూ కేటాయించగలిగితేనే పిల్లల్లో మానసికారోగ్యం పెరుగుతుందనీ, బంగారు భవిష్యత్తుకు బాట ఏర్పడుతుందనీ ఎవరూ మర్చిపోకూడదు.

తండ్రి డాక్టర్, తల్లి ప్రొఫెసర్. ఐనా పిల్లలు చదువూ సంధ్యా లేకుండా వీథిన తిరిగే లోఫర్స్. తల్లిదండ్రులు డాక్టర్లే ఐనా పిల్లలు మానసిక రోగులు. శారీరకంగా దుర్బలులు, రోగగ్రస్థులు. తండ్రి బిజినెస్ మాగ్నెట్ తల్లి అబా

మోడ్రన్ వనిత. పిల్లలు సకల గుణాభిరాములు. తల్లిదండ్రులు పొలిటీషియన్స్ పిల్లలూ ఆ పంథానే అవలంబిస్తున్న అమాయకులు.

ఐతే, అందరూ ఇలాగే వుంటారనీ వున్నారనీ అనుకోటం పొరబాటు.నాకు తెలిసిన ఇటువంటి సంఘటనలెన్నో, కుటుంబాలు ఎన్నో.

ఐతే చదువు మిషతో పసివారిమీద విపరీతమైన భారాన్ని మోపటం, క్షణం తీరిక లేకుండా చదువే లోకంగా పసివాళ్ళ మనసుల్ని బలవంతంగా చదువు వైపుకే మళ్ళించటం కూడా మంచిదికాదు ప్రతివారిలోనూ అంతర్గతమైన జిజ్ఞాస వుంటుంది. అనేక కళల మీద అభిరుచి వుంటుంది అది అణచలేనిదీ, అందరికి లభ్యం కానిదీ. పసివాళ్ళ అభిరుచుల్ని గమనించి వాటిని ప్రోత్సహించి వారిలోని సృజనాత్మక శక్తికి ప్రాణం పోయాలే గానీ అణచకూడదు.

అమాయక మనసుల్ని అణగద్రొక్కకూడదు. నిద్రాణమైన ప్రతిభకు సమాధులు కట్టకూడదు.

అనారోగ్య వాతావరణం నుంచీ, క్షుద్రరాజకీయం వలయం నుంచీ ఇంట్లో పేరుకునే అశాంతి పవనాల నుంచీ పెద్దలలో గూడుకట్టుకునే స్వార్థ ప్రయోజనాల నుంచీ పసివాళ్ళ మనసుల్ని మళ్ళించటానికి శాయశక్తులా కృషి చెయ్యగలిగినప్పుడే-

పిల్లల పరంగా మన ధర్మాన్ని మనం నిర్వర్తించిన వాళ్ళమౌతాం.

పిల్లలకీ ఇష్టాయిష్టాలుంటాయన్న విషయాన్ని విస్మరించి, మన అభిరుచుల్నీ మన ఇష్టాల్నీ బలవంతంగా వాళ్ళ మీద రుద్ది డాక్టరవాలనుకున్నవార్ని ఇంజనీరింగ్ వైపుకూ ఇంజనీరవాలనుకునేవార్ని వైద్యశాస్త్రం వైపుకూ - లాయరవాలని ఆశించే వారిని వ్యాపార దృక్పథంవైపుకూ, వ్యాపార లక్షణాలున్న వారిని మరొక వైపుకూ, సృజనాత్మక శక్తివున్నవారిని బలవంతంగా విద్యారంగంవైపుకూ మళ్ళించి ఆంక్షలు విధించి తమ తమ అభిరుచులను సఫలీకృతం చేసుకోవాలనుకునే పెద్దవాళ్ళు మానవతా ధర్మాల్ని మర్చిపోకూడదు తాము మరిచిపోయిన ధర్మాలకు పసివాళ్ళని బలిపశువుల్ని చెయ్యకూడదు.

చెడును ఖండించాలి. చెడుదార్లు పట్టేవాళ్ళని మందలించాలి. ఆ అర్హతను పొందాలంటే మనం అదే బాటలో నడవాలి. మనం ఆచరించనిదీ, అనుసరించనిది మన పిల్లలు ఆచరిస్తారనీ, అనుసరిస్తారనీ అనుకోటం పొరపాటు.

సారా పారేచోట - పౌలపోషక విలువల్ని పిల్లలు చెప్పినా అర్థం చేసుకో లేరు. ధూమపాన పొగలతో దట్టంగా పేరుకుపోయిన వాతావరణంలో, ఆరోగ్యసూత్రాలను వల్లించినా - పసిపాప కూడా లెక్క చెయ్యదు.

క్షణం పట్టించుకునే తీరికలేని తల్లిదండ్రులకి - పిల్లలకి ఆంక్షలుపెట్టి, ఆదేశాలివ్వగల అర్హత లేదు.

భావిపౌరులుగా ఎంతోమంది రూపులు దిద్దుకున్నారు. ఎందరో పిల్లలు అన్నిరంగాలలోనూ అసాధారణ ప్రజ్ఞను చూపిస్తున్నారు. అందరి మన్ననలనూ, నీరాజనాలనూ అందుకుంటున్నారు.

అటువంటి పిల్లల అడుగుజాడల్లోనే మన పిల్లలూ నడవాలనుకుంటే—

వారి తల్లిదండ్రుల్ని - ఆ పిల్లల మానసిక వికాసాన్ని ఆలోచన్లనూ ఆధారంగా - ఆదర్శంగా తీసుకోవాలి -

తప్పదు!

# పాఠశాల ఉపాధ్యాయులు – విద్యార్థులు మానవతా విలువలు

—డా॥ సురవరం పుష్పలత

తల్లిదండ్రుల కలలపంటలు, కంటివెలుగులు, ఇంటికి ఇలవేల్పులవలె మెలగే చిన్నారి పాపలకు, ప్రపంచమంటే తెలియని పసిడి మనసులకు, పాఠశాలలో అడుగుపెట్టడమనగా సమాజములో మొట్టమొదట కాలుమోపడమే. కన్నవారికి కన్నవారై మధురమైన మాటలతో కమనీయమైన చేష్టలతో ఇంటిలోని వారందరి మనసులు దోచుకునే కన్నయ్యల అల్లరికి హద్దుండదు. స్వేచ్ఛకు కొరత ఉండదు. నవ్వి నవ్వించి, అరున్నొక్క రాగమాలపించి, మొండిచేసి, ఏదో విధంగా తనవారినందరిని తనకనుకూలంగా మార్చుకునే లేత హృదయాలు ప్రప్రథమంగా ప్రతికూల పవనాలనెదుర్కొనేది పాఠశాలలోనే. తెలియక చేసిన తప్పుకైన గొప్ప గుర్తింపు ఇంటిలో ఉంటే, అందరి మనసులు ఆకట్టుకోవడానికి ప్రయత్నించే ఉపాధ్యాయురాలి కడ ప్రత్యేక గుర్తింపు లభించని పాఠశాలపట్ల వారు కొంత అయిష్టతను కనబరచడం సహజం. పిల్లలకు తల్లిదండ్రులే మొదటి గురువులు.

పాఠశాలలో చేరే సమయానికి పిల్లలకు దాదాపు 3½ లేదా 4 సంవత్సరాల వయసుంటుంది. ఆడుతూ పాడుతూ అప్పుడప్పుడు అక్షరాలు గుర్తించడము, కొద్దికాలం తరువాత వ్రాయడం అలవరచుకుంటారు. వారి యిష్టాయిష్టాల కనుగుణంగానే కొంతకాలం వీరి చదువు సాగుతుంది. పిల్లలు బడిలో చేరీచేరక ముందే వారి భవిష్యత్తుపై ఆశలు పెంచుకునే తల్లిదండ్రులు తమ పిల్లలకు అక్షరాలు రావు అనో, అంకెలు రావనో కొట్టి, భయపెట్టి వారిని మానసికంగా కృంగదీసేవారు కొందరు. పేరు ప్రతిష్ఠలున్న పాఠశాలలో పిల్లలకు సీటు దొరకదేమో అన్న భయంతో 'అమ్మ' అని నేర్పించడముకంటే A for apple అని నేర్పువారు కొందరంటే అతిశయోక్తికాదు. సహజంగా సంతోషంగా నేర్చుకునేట్లు

చూడాలి రాకపోయినా అవమానపరచి, ఇతరులతో పోల్చి పసిహృదయాలను గాయపరచరాదు. చిన్నపిల్లలకు మొట్టమొదట పెట్టే ముద్ద రుచిగా ఉంటే రెండవ ముద్దకు నోరు తెరుస్తారు. అంతేకాని, ఆరోగ్యవంతులుగా ఉండడానికి ఏ యే పదార్థాలు ఎన్నెన్ని పాళ్ళలో ఉండాలో తూకం వేసి యిస్తే మంచిదని తలస్తే అన్నం చూడగానే విసుకొనిపోతారు. చదువుకూడ అంతే. ఈ విషయంలో తల్లిదండ్రుల సహకారమెంతో ఉపాధ్యాయులకవసరము.

తల్లిదండ్రులు చిన్న పిల్లలకు పాఠశాలలో చెప్పేవికాక సుప్రభాతం, పద్యాలు, శ్లోకాలు, రైమ్సు, పాటలు, చిన్న చిన్న కథలు, వారికిష్టమైనవి నేర్పించడము ఉత్తమము. అవి కూడ బలవంతంగా మాత్రం కాదు. అల్లరిచేసే పిల్లలకు 'నిన్ను స్కూలులో చేర్పిస్తామని', 'అదిగో, ఆమె టీచరు - నిన్ను కొడుతుంది అల్లరిచేస్తే' - అని పాఠశాల ఒక భూతంలాగా టీచర్లు అనగానే శత్రువులు అన్న భావం కలిగేట్లు మాట్లాడడము చాల విచారకరం.

పాపలే కనుపాపలైతే తల్లిదండ్రులు ఉపాధ్యాయులు కనురెప్పలవంటివారు. విచ్చుకుంటున్న పువ్వులలాగా నిర్మలంగా నవ్వే చిరంజీవుల మనస్సులలో ఎలాంటి కాలుష్యము చొచ్చుకొని పోకుండా అనుక్షణము కాపాడే రెప్పలలాంటివారు తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు.

చిన్నారులు మృదు మధుర హృదయులు. అమృత భాండాలు. తెల్ల కాగితంపై మనము గీసే గీత ఎంత స్పష్టంగా కనిపిస్తుందో, ప్రప్రథమంగా వారి మనసులపై ముద్రించుకునే భావాలు అంత స్పష్టంగా, గాఢంగా, పదిలంగా, శాశ్వతంగా ఉంటాయి. పదునెరిగి విత్తనాలు నాటు కృషీవలునివంటివారు ఉపాధ్యాయులు. అందువలన ఈ విషయంలో ఉపాధ్యాయులు చాల జగరూకతతో వ్యవహరించవలసి ఉంటుంది. ఒక ఉపాధ్యాయుడుకాని, ఉపాధ్యాయురాలుగాని బాధ్యత విస్మరిస్తే, అది ఒక తరానికే ముప్పు. లేత హృదయాలలో మానవతా విలువలన్న విత్తనాలు నాటే ఉపాధ్యాయులే నిజమైన గురుబ్రహ్మలు. సత్య ధర్మ శాంతి దయ ప్రేమలన్న మానవతా విలువలు విద్యార్థుల మనసులలో కుదురుగా నాటుకొని పెంపొందేట్లు చేయడం ఉపాధ్యాయుల ప్రథమ కర్తవ్యము.

చిన్న పిల్లలలో ఐకమత్యం, పరోపకార చింతన, సత్యసంధత, సహజం గానే ఉండే సుగుణాలు. తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు ఆ గుణాలను పోషిస్తే చాలు. పెద్దలలో కనిపించని పిల్లలలో మాత్రమే కనిపించే గుణాలు మచ్చుకు కొన్ని–

ఒకరికి జ్వరం వచ్చినా, దెబ్బ తగిలినా, చిన్న తరగతులలోని వారంతా వారికే ఆ కష్టం వచ్చిందేమో అన్నంత హడావిడి చేయడం.

ఒకరు భోజనం తెచ్చుకొనకపోతే అందరూ కలిసి వాడిని తమ ఆహారంలో కొంత యిచ్చి తినేవరకు వదలరు. ఒకరికి వచ్చిన బాధ తమందరి బాధగా భావిస్తారు స్వార్థరహితంగా ఎంత విలువైన వస్తువులనైనా అవసరమైన వారికిచ్చి ఆనందిస్తుంటారు. అన్నిటికన్న ముఖ్యం అడుగకుండానే తప్పు చేసిన వారిని క్షమించడం. అన్ని మరచిపోయి అరమరలు లేకుండా కలిసిపోవడం. ఎవరేది సాధించినా ఆ విజయం తమందరిదిగా భావించి ఆనందించడమే కాని అసూయ పొందకపోవడం, అహంకారపు టంచులను కూడ దరిచేరనీయని నిష్కళంక హృదయులు.

పాఠశాలలో చిన్న తరగతులలో ముఖ్యంగా టీచరు చెప్పే ప్రతిమాట వారికి వేదవాక్కు. ఒకసారి ఒక ఉపాధ్యాయురాలు పొదుపును గూర్చి చెపుతూ మహాత్మా గాంధీ పనికి వచ్చే ఏ వస్తువునైన పారవేసేవారుకాదట అన్నారు. మరునాడు ఒక అమ్మాయి చిన్న పెన్సిల్ తెచ్చి చెక్కివ్వమంది. ఆ పెన్సిల్ ఎంత అరిగిపోయినా మళ్ళీమళ్ళీ చెక్కివ్వమని తీసికొని రావడంతో విసుక్కున్న ఉపాధ్యాయురాలు ఎందుకే పిసినారితనం, పెద్ద పెన్సిల్ కొనమని మీ అమ్మ నడుగలేవా అన్నది. వెంటనే ఆ చిన్నారి నిన్ననేకదా గాంధీ గారి పొదుపును గూర్చి నేర్చుకున్నాము అన్నదట!

గురువును సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపముగా పిల్లలు భావించాలంటే ఉపాధ్యాయుల ప్రవర్తన దానికనుగుణంగానే ఉండాలి. ఉపాధ్యాయుల వ్యక్తిత్వము విద్యార్థులపై ప్రభావితం చేస్తుందనడము అందరెరిగిన విషయమే. ఉపాధ్యాయుల భాషా-విషయ పరిజ్ఞానంపై విద్యార్థులకు అచంచల విశ్వాసం కలగాలి. చెప్పాలనుకున్న విషయం సరళంగా, సులభంగా సూటిగా చిన్నచిన్న

పదాలలో పిల్లల హృదయాలకు హత్తుకునేట్లుగా చెప్పాలి. విషయము స్పష్టంగా అర్థం కావడానికి బోధనోపకరణముల నుపయోగించాలి. పాఠం చెప్పడం వరకు మాత్రమే తన బాధ్యత కాదు, వివరించిన విషయం విద్యార్థులకెంతవరకు అవగాహనమయిందో తెలిసికోవాలి. ఏ పాఠం చెప్పినా మానవతా విలువలను జోడించి పిల్లలలో స్పందన కలిగేట్లు చేయాలి. ఉపాధ్యాయులు ధరించే వస్త్రాలు కూడ వారికి గౌరవాన్ని ఇనుమడింప చేసేట్లుండాలి. పిల్లల కష్టసుఖాలను గూర్చి తెలుసుకుంటూ పరామర్శిస్తూ, తరగతిలోనేకాక బయట కూడ, పిల్లల కట్టు, బొట్టు, వస్త్రధారణ, మాట్లాడే తీరు, వైఖరిలో మార్పులు గమనిస్తూ, అడుగడుగున తగిన సూచనలు, సలహాలు ఇస్తూ ఉపాధ్యాయులకు విద్యార్థులకు మధ్య సంబంధము పెంచుకోవాలి. విద్యార్థులు ఉపాధ్యాయులను అన్నింటిలో అనుకరిస్తూ ఉంటారు. ఉపాధ్యాయులు మాట్లాడే పద్ధతి, వారి ప్రవర్తన, సంస్కారము, విశాలహృదయం, విశ్వప్రేమ లాంటివి విద్యార్థులను ప్రభావితం చేస్తూ ఉంటాయి. కనుక ఉపాధ్యాయులు అన్నివేళల జాగ్రత్త వహించవలసి ఉంటుంది.

విద్యార్థులలో అంతర్లీనంగా ఉన్న శక్తులను గుర్తించి, వారిని ప్రోత్సహించి వారిలోని ప్రతిభను రాణింపచేయడమే ఉపాధ్యాయుల ధర్మము. చిన్న చిన్న కథలు చెప్పడము, Role play, భజనలు, పాటలు పాడించడము వలన పిల్లలలో ఒకరకమైన నూతనోత్సాహము, మానవతా విలువలు గాఢంగా మనసులో నాటుకోవడం, ఐకమత్యము పెరిగి దేశభక్తి కలుగుతుంది. చిన్న చిన్న పోటీలు నిర్వహించడము వలన పుస్తకములోని విషయాలు సులభంగా నేర్చుకో కలుగుతారు. ఎక్కువ పుస్తకములు చదివి, విషయాన్ని సేకరించడము, ధైర్యంగా సభలలో మాట్లాడగలగడం వల్ల ఆత్మస్థైర్యం పెరుగుతుంది.

బాలబాలికలు చాల జిజ్ఞాసువులుగా ఉంటారు. ప్రతి విషయం లోతుగా తెలుసుకోవడానికి ప్రయత్నిస్తుంటారు. వారి సందేహాలు తీర్చి సంతోష పెట్టాలే కాని విసుగుతో వారిని చిన్నబుచ్చరాదు. దారితప్పేవారిని దండించకపోవడం కూడ దోషమే.

విద్యార్థులు చాల తెలివిగలవారు. ఒక్కొక్కప్పుడు వారు వేసే ప్రశ్నలు పెద్దవారిని తికమక పెట్టడం కూడ సహజం. విద్యార్థులు సత్యసంధులు కావాలని, ధర్మాన్ని విడనాడరాదని, కొన్ని నీతి కథలు చెపితే ఒకసారి పిల్లలు వేసిన ప్రశ్నలీవిధంగా ఉన్నవి:

1. ఒక్కసారి అసత్యం పలికితే సత్యహరిశ్చంద్రుడు ఇన్ని కష్టాలు అనుభవించేవాడు కాడు కదా! ప్రతిసారి నిజం చెప్పినా ఒక్కమాటతో పోయే ట్లయితే ఎందుకు చెప్పకూడదు?

2. మా అమ్మదగ్గర డబ్బు ఉంది.కాని నిన్న పనిమనిషి అడిగితే లేదన్నది! పని మనుషులతో మాత్రం అబద్ధం చెప్పవచ్చా! లేక అమ్మ అంత వయసు వచ్చిన తరువాత చెప్పవచ్చా?

3. దొంగాట ఆడేప్పుడో, నవ్వుతూనో చెప్పే ఆబద్ధము కూడా అబద్ధ మేనా? అదికూడ పాపమేనా?

4. పక్కింటబ్బాయి వాళ్ళమ్మతో బడికి వస్తానని చెప్పి సినిమాకు పోయాడు. ఇది నాకు తెలిసిన సత్యం. మరి నేను వాళ్ళమ్మతో చెప్పాలా? వద్దా! మా అమ్మ అధిక ప్రసంగము చేయవద్దంది. నేనేమి చేయాలి?

5. మా తమ్ముడు అల్లరి బాగాచేస్తూ అందరిని ఏడిపించడము అలవాటు. మా అమ్మ వెంటనే దండించకపోతే వాడు చెడిపోతాడేమోనని రెండు వేయ మంటుంది. మా నాన్న పెద్దగయిన తరువాత వాడే మారతాడంటారు. ఎవరు చెప్పింది సబబు?

ఇలాంటివి ఎన్నో చిన్న బుర్రలలో ఉవ్వెత్తుగా లేచే ఆలోచనలు.

నిజ జీవితంలో కథానాయకుడుగనో నాయికరాలిగనో పేరుపొందాలంటే ఎట్టి కష్టనష్టాల నెదుర్కొన్నా ధైర్యంగా ధర్మమార్గం వదలరాదని ఉద్బోధిం చాలి. ఉపాధ్యాయుల సమాధానాలు పిల్లల తలిదండ్రులను నిందించేవిగాను, కించ పరిచేవిగాను, వారికి బాధకలిగించేవిగను నుండరాదు. ఉపాధ్యాయులు మరొక ఉపా ధ్యాయుని గాని, యాజమాన్యంను గురించిగాని విద్యార్థులముందు విమర్శించ రాదు.ఎవరిని గూర్చిగాని అసభ్యకరంగాను,సంస్కారహీనంగాను మాట్లాడరాదు.

ఒకొక్కసారి తల్లిదండ్రులు ఉపాధ్యాయులకే పాఠాలు చెప్పడానికి రావని విద్యార్థుల ముందు విమర్శిస్తే వారికి ఉపాధ్యాయుల పట్ల గౌరవము కాని, వారు చెప్పే పాఠాలపట్ల శ్రద్ధగాని లేకుండాపోతుంది. చేతులారా వారి పిల్లలను వారే పెడత్రోవ పట్టించడము చాల శోచనీయము. కాని, ఉపాధ్యాయుడు తన పట్టుదల, శ్రద్ధ, నిరంతర పరిశ్రమ, ఆత్మవిశ్వాసమువల్ల యిట్టి అపోహలను పోగొట్టుకోగల్గుతాడు. విద్యార్థుల సంపూర్ణ వ్యక్తిత్వ వికాసమునకై అనవరతము

కృషిచేసే ఉపాధ్యాయులను విద్యార్థులు జీవితాంతము గుర్తుపెట్టుకుంటారు. నిర్ణీత సమయములో పాఠశాలకు వచ్చి ఉపాధ్యాయుడు మాత్రమే ఆలస్యంగా వచ్చిన వారిపట్ల కఠిన చర్యలు తీసికొనగలుగును. పాఠము ఎలా చెపితే విద్యార్థులకు చక్కగా అవగాహన అవుతుందని పరి పరివిధాల ఆలోచించి వచ్చి పాఠము చెప్పిన ఉపాధ్యాయుడే విద్యార్థుల దృష్టిలో నాయకుడు. విద్యార్థుల ఆత్మగౌరవము నెలా కాపాడుకొనాలో నేర్పిస్తూ, ధనంతో, అహంకారంతో కొనలేనివి, పొందలేనివి ప్రేమ, అభిమానం, గౌరవం అన్న విషయాలు వారి హృదయాలలో నాటుకునేట్లుచేసే ఉపాధ్యాయుడే నిజమైన ఉపాధ్యాయుడు. పరనింద ఆత్మస్తుతివల్ల కలిగే అనర్థాలుకూడ వారికర్థమయ్యేట్లు చెప్పాలి. అశోకుడు చెట్లను నాటించాడని బావులు త్రవ్వించాడని చెప్పే ఉపాధ్యాయులు, దానివలన ప్రయోజనమేమిటి? లబ్ధినిపొందిన వారెవరు? వివరించి, సామాన్య మానవుని గూర్చి ఆలోచించేవారిని శతాబ్దాలు గడిచినా ప్రజలు మరచిపోరని, చరిత్రలో వారిపేరు చిరస్థాయిగ నిలిచిపోతుందని చెప్పి, విద్యార్థులు కూడ ప్రజోపకారార్థమే జీవించేట్లు ఉత్తేజపరచాలి.

తరగతిలో ఉత్సాహము చూపని విద్యార్థులు కొందరు క్రీడలలో, వార్షికోత్సవాలలో వివిధ సాంస్కృతిక కార్యక్రమాలలో చురుకుగా పనిచేయడము ఉపాధ్యాయులు గుర్తించడము జరుగుతుంది. ఎవరెవరేయే రంగాలలో రాణించగలరనుకుంటారో, వారిని ఆయా విషయాల్లో నిష్ణాతులుగా చేయడము ఉపాధ్యాయుల కర్తవ్యము. 'చదువురాదు కాని పరిగెత్తగలవు' - అని వారిని కించపరచరాదు.

తల్లిదండ్రులు ఎంత జాగ్రత్తగా చూసుకున్నా, ఉపాధ్యాయులు తమ కర్తవ్య నిర్వహణలో లోపం లేకపోయినా. ప్రస్తుతము పిల్లలు చూస్తున్న సినిమాలు, టి. వి. ప్రోగ్రాములు, వారి జీవితాలపై చాల ప్రభావాన్ని చూపిస్తున్నాయంటె సత్యదూరము కాదు. హింస, మితిమీరిన శృంగారము, అసభ్యకరమైన, అశ్లీలాలతో కూడుకున్న సినిమాలను అటు తల్లిదండ్రులు, ఇటు ఉపాధ్యాయులు ఏవగించుకున్నట్లయితే కొంతవరకు పిల్లలను వాని ప్రభావము నుండి కాపాడగలుగుతాము.

విజ్ఞాన మింతగా అభివృద్ధిని సాధించి, మండుటెండలలో, శీతల గృహాలలో నివసిస్తూ, వణికిస్తున్న చలికాలము వెచ్చని హీటర్లు సృష్టించుకొని,

స్వర్గాన్ని భూలోకములో నిర్మించుకొన్న ఈ కాలంలో, పాతరాతియుగంలో ధరించునట్లే, ఆకులు, నారబట్టలు ధరించి, అనాగరికులవలె చేస్తున్న నృత్యాలను గూర్చి విమర్శిస్తూ వానిపట్ల తమ అసహ్య భావాన్ని ప్రకటించినట్లయితే విద్యార్థులు కూడ ఆ విషయాల పట్ల అంతగా ఆకర్షితులు కారు. మితిమీరిన హింస అశాంతికి కారణమవుతుంది. నేడు టి. వి. ప్రోగ్రాములు కొన్ని చక్కటి విజ్ఞానానికి దోహదకారణమైతే, కొన్ని అవినీతి, అవిధేయత వంటివి పట్టుబడ డానికి ఉపయోగపడుతున్నవి. చిన్నపిల్లలే కాక పెద్దవారికైనా మంచికన్నా చెడు ప్రభావం త్వరగా పడుతుంది. ఇట్టి విషయాలను గమనించిన ఉపాధ్యాయులు, ఏ యే విషయాలలో విద్యార్థులలో మార్పు వస్తుందో జాగ్రత్తగా గమనిస్తూ సరియైన సమయంలో వారిని సరియైన దారిలో పెట్టాలి.

వివిధ మనస్తత్వాలతో కూడిన ఉపాధ్యాయ బృందము పాఠశాల ఒక కుటుంబముగా భావించి, విద్యార్థుల మనోవికాసమునకు, సంపూర్ణ వ్యక్తిత్వ వికాసం కోసం సమష్టిగా కృషి చేసి, చక్కటి ప్రగతిని సాధించాలి.

దేశానికి పేరు ప్రతిష్ఠలు సంపాదించిపెట్టువారు విద్యావంతులే. సంకుచిత భావాలను దూరం చేసి మనమంతా భారతీయులమన్న స్పృహ ప్రతివారిలోను కలిగి, గతం నుండి భవిష్యత్తుకు స్ఫూర్తిని కలిగిస్తూ నిర్మాణాత్మక దృక్ప థముతో జాతిని జాగృతం చేయాలి.

'దేశమును ప్రేమించుమన్న మంచియన్నది పెంచుమన్న' అని నేర్పే ప్రతి ఉపాధ్యాయుడు, తల్లిదండ్రులను ప్రేమిస్తే దేశాన్ని ప్రేమించడము, మీ యింటి లోనే దేశం ప్రారంభమైనదని, పొరుగువారిని ప్రేమిస్తే విశ్వప్రేమ ఆవిర్భ వించినట్లే అని తెలుపాలి. అన్యాయం, అక్రమం, అధర్మము నెదుర్కొనే చక్కటి యోధులుగా తీర్చిదిద్దడానికి ప్రతి ఉపాధ్యాయుడు కృషి చేయాలి.

చక్కటి ఉద్యాన వనాన్ని పెంచితే దానివలన మనకెలాంటి శాంతి సౌభాగ్యాలు లభిస్తాయో, చక్కటి సమాజం నిర్మించుకుంటే, విద్యార్థుల మనసులలో మానవతా విలువలన్న విరజాజులు పూయిస్తే ఆ సౌరభాల ననుభవిస్తూ భావికాలంలో ప్రశాంత జీవితాన్ని గడపవచ్చు.

# కొత్త అధ్యయన రంగాలు-
# యువత-మానవతా విలువలు

—శ్రీ పి. నాగరాజు

'సమాజంలో బొత్తిగా విలువలు పతనమైపోతున్నై. మానవత్వం అనే దానికి స్థానమే లేకుండా పోతోంది" అని వాపోతున్న వాళ్ళ సంఖ్య నానాటికీ పెరిగిపోతూ ఉంది. అయితే ఈ పరిస్థితిని మార్చేందుకు ప్రయత్నం ఎవరు ప్రారంభించాలి? అనే విషయంలోనే ఎవరికీ ఎటూ పాలుపోని పరిస్థితి కన పడుతూ ఉంది. ఎందుకంటే, మానవత్వపు విలువలను పునరుద్ధరించి సమాజాన్ని ఆదిశలో నడిపించే నాయకత్వం ఎటువైపునుంచి రావాలి? ఆధ్యాత్మిక వేత్తలైన కొందరు మహానుభావులు మాత్రం ఈ అంశాలను గురించి పదేపదే ప్రస్తావించి తమ అనుయాయుల్ని ఆ దిశలో నడిపించే ప్రయత్నం చేస్తున్నారు. కొన్ని స్వచ్ఛంద సంస్థలు కూడా ఈ దిశలో కృషి చేస్తున్నై. కాని రాజకీయ నాయకత్వంలో ఇటువంటి విలువల్ని గురించి ఏదో ఒక సిద్ధాంతం ఆదర్శం ప్రకారం ఆలోచించే వర్గాలకు అధికారం లేదు. అధికారం ఉన్న రాజకీయ నాయకత్వానికి ఇటువంటి విలువలేవీ లేవు.

ఇక మేధావి వర్గం దగ్గరికి వస్తే - సైంటిస్టులూ, టెక్నోక్రాట్లూ, ప్రొఫెసర్లూ మొదలైన రూపాల్లో ఉండే ఈ మేధావి నాయకత్వం దృష్టిలో ఇటువంటి నీతి నియమాల విషయంలో సమాజాన్ని నడిపించడం తమ వృత్తి దృష్ట్యా తమ పని కాదు. పరిశోధనలు చేయడం, విజ్ఞానార్జన చేసి దాన్ని సమాజానికి పంచడం వరకే తమ కర్తవ్యంగా ఈ వర్గం వాళ్ళల్లో ఒక భావం పాతుకుపోయింది. ఒకవేళ వీళ్ళల్లో ఎవరైనా సమాజ సంస్కరణోద్దేశ్యాలూ భావాలూ, ఆధ్యాత్మిక స్ఫూర్తి కారణంగానో మరే ఇతర కారణం వల్లనో ఉన్న వాళ్ళెవరైనా ఉన్నా తమ ఉద్యోగధర్మం- తమ సంస్కరణ కార్యాలూ ఇవి రెండూ రెండు బొత్తిగా ఒక దానికొకటి సంబంధం లేని పనులు అన్నట్లుగా

VM.8

పీఠ్య ఆలోచించడం కనపడుతుంది. Mac cormac అనే అమెరికా దేశపు వైజ్ఞానిక సలహాదారు మేధావి వర్గాల్లో ముఖ్యంగా సైంటిస్టులూ, టెక్నోక్రాట్లలో కనపడే ఈ పరిస్థితిని ఒక విధమైన విచ్ఛిన్న వ్యక్తిత్వం, split personality, Schrizo Phrenia గా అభివర్ణిస్తాడు. సైన్సూ, టెక్నాలజీ 'విలువల'తో సంబంధం లేని 'విలువల' కతీతమైన విషయాలన్న ఆలోచనే ఈ పరిస్థితికి దారి తీసిందని ఆయన వివరిస్తాడు కూడా. (Myths of Science & Technology, Madras University Publication.)

కాని నిజానికి సైన్సూ, టెక్నాలజీ అవి ఆవిర్భవించిన సమాజపు విలువలకు లోబడి ఆ విలువలకు అనుగుణంగానే వికసిస్తాయని తర్కబద్ధంగా ఆయన తన ఉపన్యాసంలో నిరూపించారు. ఇటువంటి మరొక ఉపన్యాసంలో Henry k Skolimowsy అనే అమెరికన్ ప్రొఫెసర్ ఆధునిక సైన్సూ టెక్నాలజీ ఆధునిక యూరప్‌లోని ఏ పరిస్థితులలో ఆవిర్భవించడం వల్ల ఏ విధంగా మానవత్వపు విలువలకు వ్యతిరేక దిశలో పరిణమిస్తూ వచ్చిందీ ఏ విధంగా పర్యావరణ సంక్షోభానికి అది దారి తీసిందీ భావాల చరిత్ర క్రమంలో వివరిస్తారు. Technology & Human Density అనే మరో గ్రంథం (Madras University Publication) లో. ఈ ఇద్దరు మేధావులూ తమ ఉపన్యాసాల్లో సారాంశంగా సైంటిస్టులూ టెక్నోక్రాట్లూ తమ లాబొరేటరీల్లోనూ లైబ్రరీల్లోనూ కూడా తాము మానవత్వపు విలువలను రంగరించి కృషి చేసే అవసరం, అవకాశం ఉన్నాయన్న సూత్రాన్నే అందిస్తారు. ఈ విధమైన జ్ఞానోదయం భారతదేశంలోని సైంటిస్టులూ టెక్నోక్రాట్లలో రావడం ప్రపంచానికే మేలు కలిగించగలదని Mac Cormec తమ ఉపన్యాసంలో సూచించారు. భారతీయ జీవన విలువల్లోని మానవత్వపు సూత్రాలను సైన్సు, టెక్నాలజీ పరిశోధనల్లో మిళితం చేయడం ప్రపంచ మానవాళికే శ్రేయస్కరమని ఆయన వాదన.

మొత్తం మీద ఈ విధంగా రానురాను మేధావులు తమ అధ్యయన రంగాలలో చేసే పరిశోధనలూ ఆలోచనల్లోనే మానవత్వపు విలువలను జోడించాలన్న ఆలోచన రానురానూ బలం పుంజుకుంటూ ఉంది.

ఇటువంటి ఆలోచనలకు ముఖ్యమైన ప్రేరణ పర్యావరణ సంక్షోభం, దాని భయానికి పంజాహూలపట్ల జరిగే సమీక్షలలోంచి లభిస్తూ ఉంది. ఈవిధంగా పర్యావరణ విజ్ఞానం అనే ఒక ప్రత్యేకమైన అధ్యయన రంగమే ఆవిర్భవించి

మిగతా అన్ని అధ్యయన రంగాలనూ మానవత్వపు విలువలకు ఉన్ముఖంగా ప్రభావితం చేస్తూ ఉంది. పర్యావరణ విజ్ఞానం మానవతావాదాన్ని మానవ కేంద్రకమైన (anthropocentric) దశ నుంచీ బయటపడేలా చేయగలిగింది. యూరోపియన్ సంస్కృతిలోని వివిధ పరిస్థితుల కారణంగా యూరోపియన్ మానవతావాదం ఈ మానవ కేంద్రక మనస్తత్వం నుంచీ ఒకప్పుడు బయటపడ లేకపోయింది. ప్రకృతిలోని మిగతా జీవజాలమంతా మానవుడికి ఉపయోగ పడేందుకే ఉందన్న దృష్టే మానవ కేంద్రక దృష్టి. ప్రాచీన భారతీయ భావాల్లో 'మానవుడు' 'మనిషి' అన్న భావన కంటె జీవులు, భూతాలు లాంటి భావాలకే ప్రాచుర్యం ఉండటం మానవ కేంద్రకత లేని ఒక విశాలమైన జీవ సమష్టి దృష్టి కారణంగానే. ఆధునిక పర్యావరణ విజ్ఞానం ఈనాడు ఈ దిశలోకే పయనిస్తూ ఉంది.

మానవత్వపు విలువలకు అధ్యయన రంగాల్లో పెరుగుతున్న ప్రాముఖ్యానికి మరొక ఉదాహరణ ప్రభుత్వ పాలనాశాస్త్రం, వ్యాపార నిర్వహణ శాస్త్రాల్లో ఇటీవల ఏర్పడుతున్న కొన్ని పరిణామాలు. ప్రభుత్వ పాలనా శాస్త్రం (Public Administration) లో ఒకప్పుడు 'విలువలు' అనే అంశానికే ప్రాముఖ్యం ఉండేది కాదు. ఇటీవల 'విలువలు' అన్నది శాస్త్రపు ఆధార స్తంభాల్లో ఒకటి కావాలన్న వాదం బాగా ప్రచారంలోకి వచ్చింది. ఒకప్పటి ప్రభుత్వ పాలన భావాలు ప్రభుత్వ అధికారులని హృదయం లేని యంత్రాల్లా తయారు చేశాయని, మానవత్వపు విలువలు జోడించి ఆ శాస్త్రాన్ని, ప్రభుత్వ పాలననూ కూడా మరింత మృదువుగా మార్చవలసిన అవసరం ఉందని ఇటీవల అనేక ప్రభుత్వ పాలనావేత్తలెందరో ప్రతిపాదిస్తున్నారు. ఈ ఆలోచనల్లోంచీ 'నూతన ప్రభుత్వ పాలన' (New Public Administration, NPA) అనే పేరుతో ఒక ఉద్యమమే ఆ శాస్త్రంలో ఆవిర్భవించింది. నిజానికి మానవత్వపు విలువలకు స్థానం లేని ప్రభుత్వ పాలనలో సాఫల్యం కూడా కొరవడుతుందని ఈ శాస్త్రంలోని ఇటీవలి ప్రతిపాదనలన్నింటిలోనూ సూచించబడుతూ ఉంది.

ఇటువంటి పరిణామాలే వ్యాపార నిర్వహణ శాస్త్రంలో కూడా సంభవిస్తున్నాయి. ఒకప్పుడు తక్కువ పెట్టుబడితో ఎక్కువ లాభం సంపాదించగలగడమే గొప్ప సామర్థ్యంగా ఈ శాస్త్రంలో భావించబడింది. కాని ఈ ధ్యేయంతో నడిచిన వ్యాపార నిర్వహణ పద్ధతులన్నీ విఫలం కావడంతో మానవత్వపు విలువలను జోడించిన నిర్వహణ పద్ధతుల్ని కొత్త నమూనాలుగా ప్రతిపాదించడం ప్రారంభమయింది. నిర్వహణ యంత్రాంగంలో కిందిస్థాయి వరకూ పాల్గొనే అందరు వ్యక్తులతోనూ వ్యాపార కార్యక్రమంలోని గిరాకీలతోనూ కూడా

మానవతా దృష్టితో వ్యవహరించడం నిర్వహణ సాఫల్యానికి అత్యవసరమన్న ఆలోచన ఇటీవలి నిర్వహణ సిద్ధాంతాల్లో అధికంగా కనపడుతూ ఉంది.

ఈ విధంగా ప్రభుత్వ పాలనాశాస్త్రం వ్యాపార నిర్వహణ శాస్త్రాల్లో వచ్చిన పరిణామాల కారణంగా ఆధ్యాత్మికమైన ఆలోచనలకు ఈ శాస్త్రాల్లో ప్రాముఖ్యం పెరిగింది. జపాన్‌లోని ఉన్నతస్థాయి వ్యాపార నిర్వాహకులకు జెన్ ధ్యాన సంప్రదాయంలో శిక్షణకూడా వాళ్ళ వృత్తిపరమైన శిక్షణలో భాగమయింది. రాను రాను మనదేశంలో కూడా అనేక వ్యాపార సంస్థలు యోగా భ్యాసంలో శిక్షణను తమ సంస్థలోని ఉద్యోగుల వృత్తిపరమైన శిక్షణలో భాగంగా మారుస్తున్నాయి. స్వామి రంగనాథానందలాంటి ఆధ్యాత్మిక వేత్తల రచనలు, ఉపన్యాసాలు వ్యాపార నిర్వహణ, ప్రభుత్వ పాలన శాస్త్రాల వాఙ్మయంలో భాగం కాగలుగుతున్నాయంటే ఈ పరిణామాలు ఎటువంటి దశకు చేరుకున్నది మనం గుర్తించవచ్చు. రానురాను భగవద్గీతకు ప్రభుత్వ పాలన వ్యాపార నిర్వహణ కార్యక్రమాల్లో కౌశలాన్ని పెంచేందుకు ఏవిధంగా ఉపయోగించవచ్చులాంటి అంశాలు ఎస్. కె. చక్రవర్తిలాంటి నిర్వహణ శాస్త్రపు మేధావుల ప్రధాన పరిశోధనాంశాలు కావడంచూస్తే మానవత్వపు విలువల స్పృహ ఆధ్యాత్మికతలో ఆధునిక అధ్యయన రంగాల సంబంధాన్ని ఎంతగా పెంచుతున్నదీ అర్థమవుతుంది.

అధ్యయన రంగాల్లోని ఈ కొత్త పరిణామాలన్నింటిలోనూ యువతరానికే ఎక్కువ సంబంధం అని వేరే చెప్పనవసరంలేదు. ఎందుకంటే, ఈ కొత్త ఆలోచనల ఆవిర్భావంలో పనిచేస్తున్న మేధావులలో ఎక్కువమంది యువతీ యువకులే. పైగా, ఈ అధ్యయన రంగాల్లో అధ్యయన కృషి చేయదలచుకున్న యువతీ యువకులు తేటెస్టు భావాలుగా స్వీకరిస్తున్నవి కూడా ఈ భావాలే. ఈ సిద్ధాంతాలను ఆచరణలో పెట్టి కొత్త పద్ధతుల్లో తమ వృత్తి వ్యాపారాలను నిర్వహించేందుకు సిద్ధమవుతున్న సైంటిస్టులూ, వ్యాపార నిర్వహకులూ, ప్రభుత్వాధికారులూ, ఇటువంటి వృత్తిపరులు (Professionals) అంతా కూడా యువతరానికి చెందినవారే. కనుక సమాజంలోని మానవత్వపు విలువల పునరుద్ధరణకు మేధాపరమైన నాయకత్వం వహించేందుకు అనుకూలంగా ఏర్పడుతున్న కొత్త వాతావరణంలో ఆ నాయకత్వ బాధ్యత యువతరం మీదే ఎక్కువగాపడుతూ ఉందన్నమాట! యువతరం ఈ బాధ్యతను విజయవంతంగా నిర్వహించి, శ్రీ అరవిందులవంటి ద్రష్టలు జోస్యం చెప్పినట్లు భూమిమీద స్వర్గం వెలిసేరోజు వచ్చేందుకు బాటలు వేయడం ప్రారంభమయింది. ఆ రోజెంతో దూరంలేదు.

# శాస్త్రవిజ్ఞానం – మానవతావిలువలు

—శ్రీ కె. బి. గోపాలం

మానవ నాగరికతా చరిత్రను పాతరాతియుగం, కొత్తరాతియుగం, లోహయుగం నుండి మొదలు నిన్నటి జెట్ యుగం. నేటి ఎలక్ట్రానిక్స్ లేదా కంప్యూటర్ యుగం, రేపటి సమాచారయుగం దాకా రకరకాలుగా విభజించారు. ఈ విభజనలన్నీ ఆయా కాలాల్లో మానవుడు వాడుకున్న సాంకేతిక పరిజ్ఞానం ఆధారంగా చేసినవే. నాగరికతా చరిత్రకే ఆలంబనమయిన ఈ సాంకేతిక శాస్త్రం, దానికి మూలమయిన శాస్త్రవిజ్ఞానం, మానవ జీవితాలను, దానితో బాటే మానవతా విలువలను ఎంతగానో ప్రభావితం చేశాయనేది నిర్వివాదాంశం. అవి ఎలా చేశాయి, ఏం చేశాయి అని చర్చించుకునే ముందు మనం ఒకసారి అసలు ఈ సైన్సంటే ఏమిటి? అని ప్రశ్నించుకోవాలి.

## సైన్సంటే ఏమిటి? :

ఈ ప్రశ్నను ఎప్పుడో కొన్ని శతాబ్దాల క్రితం వేసివుంటే జవాబు ఎలా ఉండేదో ఊహించడం ఇప్పుడు కష్టమే. మనిషి తన మనుగడ గురించి ఆలోచించడం మొదలుపెట్టిన తొలినాడే సైంటిస్టు అయ్యాడు. అలాగని అంతకు ముందు సైన్సులేదని కాదు. సైన్సు మొదటినుంచి ఉండనే ఉంది. అయితే అది చేసే విచిత్రాలను మనిషి తానేదో గమనించాలని ప్రయత్నపూర్వకంగా దృష్టి సారించడంలో ఇప్పుడు మనం అనుకుంటున్న రకం సైన్సు మొదలయింది.

ఒక పరిస్థితి ఊహిద్దాం. మనిషి కది తొలిరోజు. ఉన్నట్లుండి చీకటి పడడం మొదలయింది. భయపడిపోయి మనిషి ఒక మూలకు నక్కి కూచున్నాడు. చేసేదేమీలేక నిద్రకూడా పోయుంటాడు. తెల్లవారింది. అలాగే ఒక చక్రంలా రోజూ జరుగుతున్నది. ఈ చక్రానికి అలవాటుపడడం అనేది ఒక భాగమయితే, ఇది ఇలా జరుగుతుందని గమనించి ఒక సిద్ధాంతంగా దాన్ని

పాటించడం, ఇతరులకు చెప్పడం మరో భాగం. అలా చెప్పిననాడు అది సైన్సుకు తొలిరోజు! లేదా అది తొలిరోజుల్లో సైన్సు.

మరి ఇప్పుడుండే సైన్సు విషయానికి వద్దాం. మనం ఇందాకటి ప్రశ్నను ఈ కాలం సైంటిస్టు నడిగితే, ''ఈ భూప్రపంచంలోనే కాదు, విశ్వంలో ఇంకా మరెక్కడయినాసరే సైన్సు తప్ప వేరేది లేనే లే''దంటాడు. "There is nothing beyond science'' అని అననే అన్నారు. అంటే ఈ సైన్సుకు అవధులు లేవు! అంతా సైన్సే!

మరీ ఇంత ఛాదస్తం కాగూడదనుకుంటే, సైన్సు రంగుటద్దాలు వదిలేసి, కొంచెం అందరికీ నచ్చేరకం నిర్వచనం వెదుకుదాం. ఈ విశ్వంలో మనకు కనబడేవి, కనబడనివి ఎన్నెన్నో పదార్థాలు, అవి పనిచేసే విధానాలు ఉన్నాయి. తననుండి మొదలు, ఇవన్నింటినీ గురించిన అవగాహనకే శాస్త్ర విజ్ఞానం అని పేరు. ఈ అవగాహనను కేవలం భౌతిక స్థాయికి మాత్రమే పరిమితం చేయవచ్చు. నిజానికి తొలి రోజుల్లో పదార్థ విజ్ఞానం ఒకటే సైన్సని పించుకున్నది. మరి ఇదే గనక సైన్సనిపించుకుంటే, ఇటువంటి కేవల జ్ఞానానికి విలువలు ఏమయినా ఉన్నాయా?

## సైన్సుకు విలువలు :

తత్వశాస్త్ర ప్రకారం ఈనాటికీ సైన్సుకు విలువలు లేనట్లే లెక్క. అయితే ఈ సైన్సును నిర్వహిస్తున్నది మాత్రం మనుషులేనని మరవగూడదు. వారిలోని సైంటిస్టులను క్షణ కాలం పక్కన ఉంచితే, వారు కూడా అందరిలాంటి మనుషులే. వారికి కూడా మిగతా వారిలాగే విలువలుంటాయి, ఉండాలి కూడా. సైన్సు, సైంటిస్టు అనేవి ఒక వ్యవస్థలోని రెండు భాగాలు. ఈ రెంటినీ ఒకచోట పెట్టి చూస్తే కొత్త పరిస్థితి పుడుతుంది.

సైన్సులో ఒక ఊహ, ప్రతిపాదన చేయడంవరకే మనిషి మనిషిగా ఉండ గలుగుతాడు. ఆ తర్వాత అతను కూడా ఒక పరికరంగా మారతాడు. అతను సైన్సు దిశను నిర్దేశింపలేడు. ఫలితాలను ముందే నిర్ణయించలేడు. వాటి మీద కనీసం అదుపయినా అతనికి ఉండదు. అతను సైన్సుతోబాటే కొట్టుకు

పోతుంటాడు. తనలోని మనిషి తట్టిలేపినప్పుడు మాత్రం ఒక క్షణంపాటు ఆ ప్రవాహంలోంచి గట్టుకు చేరుకుని, గట్టును పట్టుకుని, వెనుదిరిగి ప్రవాహాన్ని పరిశీలిస్తాడు. పరిస్థితిని గురించి ఆలోచిస్తాడు. తనకది అనుకూలంగా, అంగీకార యోగ్యంగా లేదనిపిస్తే, గట్టుమీదకు ఎక్కి తన దారిన తాను పోతాడు. అంతే! ప్రవాహాన్ని మాత్రం ఆపలేడు, నియంత్రించలేడు. ఆ ప్రవాహం ఆగదు! ముందుకు తన ఇష్టప్రకారం పోతూనే ఉంటుంది!

ఈ పరిస్థితిని గురించి సైంటిస్టులను హెచ్చరించిన వారు చాలా మందే ఉన్నారు.

## మరోసారి సైన్సు చరిత్ర :

మొదట్లో చుట్టూ ఉండే ప్రపంచపు అవగాహన సైన్సనిపించుకుంది. బ్రతుకుదెరువుకు అవసరమయిన పదార్థాలు, విధానాలు, వాటిని అర్థం చేసుకోవడం, వీలయితే వాటిని అవసరానికి వాడుకోవడానికే ఈ తెలివి పరిమితమయింది. ఆ తర్వాత కొంచెం దూరంపోయి ఆలోచనలు, ఊహలు అందులో చోటుచేసుకున్నాయి. అప్పుడు లెక్కలు, చుక్కలు ముఖ్యమయ్యాయి. ఇవి అందరికీ పట్టవు. జీవితానికి అవసరం కావనిపిస్తాయి. కావు కూడా! ఇక సైన్సు పెరుగుతూ శాఖోపశాఖలవుతూ కొనసాగింది. కవల పిల్లల గురించి ఒక విభాగం, పువ్వొడి గురించి మరో విభాగం దాకా వచ్చాయి. ఆ తర్వాత అంత పెరిగిన ఆ సైన్సుకు కొన్ని విలువలు తయారయినయి. అయితే అవి కేవలం ఆ సైన్సు పరిధిలోనే పనిచేస్తాయి.

పరిశోధనలు, ఆలోచనల విషయంలో స్వేచ్ఛ, స్వాతంత్రం, ప్రతిదాన్ని ప్రశ్నించి తర్కించగలడం, తర్కానికి నిలబడని విషయాలను కాదనగల శక్తి, ఇలా తిరస్కరింపబడినప్పుడు ఓర్చుకునే శక్తి, చర్చకు అవకాశం, అందుకవసరమయిన ఓర్పు మొదలయినవి సైన్సులోని విలువలు. సైన్సులో రహస్యాలు ఉండకూడదు. అది నిజంగా విశ్వసనీయంగా ఉండాలి. సత్యంగా ఉండాలి. ఈ విషయంగా 1952లో అనటోలి రపపోర్ట్ అనే రచయిత "శాస్త్ర విజ్ఞాన రంగంలోని నీతి నియమాలు ప్రపంచ మానవాళికి ఆదర్శ ప్రాయాలు" అన్నాడు. ఆయనతో ఎవరూ అంగీకరించకుండా ఉండలేరు!

ఈ లోగా సైన్సు తన విశ్వరూపంలో మరో ముఖ్యమయిన భాగాన్ని ఏర్పాటు చేసుకుంది. ఉన్నదాన్ని గురించి తెలుసుకుంటే సైన్సు. ఆ తెలివితో లేనివి తయారు చేసుకుంటే- అది టెక్నాలజీ. దీన్నే సాంకేతికశాస్త్రం అంటున్నాము. ఈ సాంకేతిక శాస్త్రం ప్రపంచాన్ని పూర్తిగా మార్చివేసింది. మనుగడ, బ్రతుకు దెరువుతోనే సంతృప్తి పడే మనిషికి ఇది సదుపాయం, సౌకర్యం, సుఖంలాంటి కొత్త ప్రయోజనాలను రుచి చూపించింది. దానితో మనిషి ఈ ప్రపంచంలోని వనరులన్నీ తనకోసమే ఉన్నాయన్నట్లు, అన్నింటినీ తనకు అనుకూలంగా మార్చుకునే ప్రయిత్నంలోకి దిగాడు. విజ్ఞాన శాస్త్రపు రూపం మరికొంత మారింది. సామాన్య దృష్టికి ఈ సైన్సు, సాంకేతిక శాస్త్రాల మధ్య పెద్దతేడా లేదు. తెలివి సైన్సు. దాని ఉపయోగం సాంకేతిక విజ్ఞానం. ఇప్పుడు ఈ ఉపయోగం తన ఇష్టం, అనుకూలత, అవసరాల మేరకు జరగాలిగనుక, అందుకవసరమయిన సైన్సునే మనిషి ఆశ్రయించాడు.

చుక్కలు, లెక్కలలాగ కాకుండా ఈ రకం సైన్సు అందరికీ పట్టేదే. అవసరమే. ఏది ఎక్కడ దొరుకుతుందో తెలుసు. దాన్ని ఎలా వాడుకోవాలో తెలుసు. కానీ, దానివల్ల ముందు ముందు ఏమవుతుందోనన్న విషయాన్ని అప్పటి సైన్సు, సాంకేతికశాస్త్రం అవహించిన మనిషి, కొంతకాలం పట్టించుకోకుండా వదిలేశాడు.

## విజ్ఞాన పద్ధతి :

ఇవన్నీ జరుగుతుండగానే, సైన్సు మనిషికి వస్తు విజ్ఞానంతోబాటు, ఒక రకం తత్వవిజ్ఞానాన్ని కూడా అందజేసింది. అది విజ్ఞాన పద్ధతి. చుట్టూ ఉండే ప్రపంచాన్ని దాని విధానాలను నిశితంగా పరిశీలించడం, ప్రతిదాన్ని, గురించి ప్రశ్నించి తర్కించడం, ఆ తర్కంలోంచి పుట్టిన ఆలోచనలను ప్రయోగ పూర్వకంగా నిష్కర్షించడం విషయం అవగాహనకు అందిన తర్వాత, దాన్ని ఒక సిద్ధాంతంగా ముందుపెట్టడం. ఈ విధానంతోనే సైన్సు ముందుకు నడుస్తుంది, కాబట్టి ఇదే విజ్ఞాన పద్ధతి. అందులోని సిద్ధాంతాలు, అన్ని పరిస్థితులు ప్రామాణికంగా ఉన్నప్పుడు, ఎప్పటికీ అదేరకం ఫలితాలనిస్తాయి. ఇది ఈ పద్ధతిలో అన్నింటికయినా అనుకూలమయిన విషయం.

ఈ పద్ధతిలోని మార్గం చాలా మందికి నచ్చింది. నిజానికిది నచ్చనివారే తక్కువేమో! ఎందుకంటే ఈ మార్గం, సైన్సుకే కాక జీవితంలో మరే విషయానికి అన్వయించినా చాలా మంచి ఫలితాలుంటాయి. ఇది నిజంగా సులభమయిన సహజమైన మార్గం. ఈ పద్ధతిని జీవితంలోని ఇతర రంగాలకు, పూర్తి జీవితానికి అన్వయించి పరిశీలించిన కొద్దీ, మార్గం మరింత బాగనిపిస్తుంది. అన్వయం కుదిరిన రాజనీతి, ఆర్థిక శాస్త్రం లాంటివి కూడా శాస్త్రాలనిపించుకున్నాయి. ఈ పద్ధతి అన్వయం అన్నింటా కుదురుతున్నట్లనిపించడంతో జీవితమే సైన్సయింది. జీవితానికి 'వైజ్ఞానిక దృక్పథం' అనేది ఒక కొత్త మార్గంగా ఏర్పడింది.

అంటే కేవలం వస్తువులను గురించి పదార్థ విజ్ఞానం నుండి, అన్నిరకాల తెలివిడి వరకు పెరిగిన సైన్సు, చివరకు జీవితంతో సహా అన్నింటినీ తనలో ఇముడ్చుకుంది. అందుకే Sciene is all Pervasive అన్నారు. అలా సైన్సు పెరిగి పెరిగి, మనిషికన్నా మరింత పెరిగి పోయింది. అలాంటప్పుడు ఆ సైన్సే సమాజానికి, మనిషికి అవసరమయిన విలువలను సృష్టించ నారంభించింది.

## సైన్సు ప్రభావాలు :

పదార్థ పరిశీలనం ఆధారంగా పెరిగిన ఈ సైన్సు అన్నింటినీ, చివరకు మానవుడిని, అతని జీవితాన్ని కూడా ఒక పదార్థంగానే చూడసాగింది. అది ఆధ్యాత్మికత, తత్సంబంధమయిన విషయాలతో తలపడసాగింది. దానితో సంఘం మీద సైన్సు ప్రభావం రోజురోజుకు మారిపోసాగింది. పెరగనారంభించింది. సైన్సులోనుండివచ్చే ఫలితాలమీదనే నియంత్రణలేని శాస్త్రజ్ఞుడు ఈ ప్రభావాల విషయంగా కేవలం ప్రేక్షకుడుగానే ఉండిపోయాడు. సైన్సు తనకు తానుగా నిర్ణయించుకున్న విలువలు సంఘానికిచ్చే ఫలితాలను, ప్రభావాలను అంచనా వేయడం కష్టమయిపోయింది.

చివరకు పరిస్థితి గందరగోళం అయింది. సైన్సుకు మొత్తంగా చెడ్డపేరు వచ్చే పరిస్థితి వచ్చింది. కొంతవరకు చెడ్డపేరు వచ్చేసింది కూడా! ఆ సందర్భంలో జోసెఫ్ బ్రొనోవ్‌స్కీ వంటి జ్ఞానుల మాటలు మరింత అర్థవం

తంగా కనబడసాగాయి. "సైన్సు తనంత తాను తటస్థమయినదే, కానీ దానివల్ల ఏర్పడే ఇతర ఫలితాలు మాత్రం అలాకావు" అన్నారాయన ఎప్పుడో!

ఈ పరిస్థితినే "సయెంటిజమ్" అంటున్నారనుకుంటాను. నిజానికి ఈ ప్రపంచంలో తనంతకు తాను చెడు అంటూ ఏదీ లేదు. ఏదయినా ఉంటే అది కేవలం మనిషి బుర్రలోనుంచి పుడుతుంది!

## కత్తి - పండు :

ఏ ప్రయోగానికయినా ఫలితాలు, ప్రభావాలు తప్పవు. అయితే ఇవి ప్రయోగం వల్ల వచ్చాయనేది మరవ కూడదు. వాటంతటవి రాలేదు. ఇందులో మనిషి లేదా సైంటిస్టు పాత్ర ప్రబలంగా ఉంది,ఇది గమనించవలసిన విషయం. ఇటీవలి కాలంలో సైన్సుకు, సాంకేతిక శాస్త్రానికి నిర్దిష్టమయి ఉద్దేశాలు, దిశలు ఉన్నాయి వాటిని ప్రయత్న పూర్వకంగా వక్రీకరించే వీలుకూడా ఉంది.

ఇటువంటి ప్రసక్తి వచ్చిన చోటల్లా, "పండు కోసుకునే కత్తి, వేలిని కోయడం' గురించి ఉదాహరించి, ప్రతిదాంట్లోనూ మంచి - చెడ్డలుంటాయని వాదించడం మనం వినే ఉన్నాము. కానీ పరిస్థితిని గురించి మరింత నిశితంగా ఆలోచిస్తే, అసలు రంగు కనబడుతుంది. పండు కోసుకునే కత్తి, ప్రేళ్ళు గొంతులుకోసే కత్తి ఒకటి కావు గదా! వాటికి అన్నిరకాలుగా భేదాలున్నాయి. పండుకత్తితో పొరపాటున వేలు కోసుకున్నా, లేక ప్రయత్నించి గొంతుకోసినా తప్పు కత్తిది మాత్రం కాదు. దాన్ని వాడుకున్న బుర్రది మాత్రమే తప్పు. ఆయుధాలు తయారుచేయడం తప్పు, ఆయుధాలుంటే వాడాలనిపిస్తుంది- అనే పద్ధతి ఇంకొకటి ఉంది. వాడాలనే కోరిక బుర్రలో బలంగా ఉంటే ఆయుధం ప్రత్యేకంగా అవసరం లేదు. అందిన ఏ వస్తువయినా ఆయుధం అవుతుంది!

పండు, కత్తి పరిస్థితి సైన్సులో ఈ మధ్యన మరింత బాగా కనబడు తున్నది. ఈ రోజున సదుద్దేశ్యంతో మొదలుపెట్టిన పరిశోధన మరుసటి రోజున విపరీతపుటవసరాలకు ఉపకరిస్తున్నది. ఇందుకు ఉదాహరణలు కోకొల్లలు.

ధర్మకాలం పోయిన తర్వాత ధర్మయుద్ధాలూ పోయినయి. ఈనాటి యుద్ధాల్లో అన్నీ మర్మాలే. అటువంటి తెగకు చెందినదే రసాయన యుద్ధం. శత్రుసేనలను చీకాకుపరిచి, నిర్వీర్యం చేసే ఉద్దేశ్యంతో నాడీవాయువులనే రసాయనాలను తయారు చేసుకున్నారు. వాటిని యుద్ధంలో వాడితే వాడి ఉండ వచ్చు గాక, కానీ ఇప్పుడవి వైద్యరంగంలో ప్రవేశించి మానవాళికి ఎంతో ప్రయోజనం కలుగజేస్తున్నాయి. ఇది గొంతులు కోసే కత్తిని వంటయింట్లో వాడు కున్నట్లనిపించే పరిస్థితి. కానీ ఇటువంటి ఉదాహరణలు తక్కువే! ఇందుకు వ్యతిరేక పరిస్థితి మాత్రం ఎక్కువ!

చలిలో చెట్ల ఆకులు ఎందుకు రాలిపోతాయి? అని కొందరు అమాయ కంగా పరిశోధనలు జరిపారు. వారి పరిశోధన ఫలితాల వల్ల ఒక రసాయనం గురించి తెలిసింది. తర్వాత కాలంలో "ఏజెంట్ ఆరెంజ్" పేర దాన్ని విడిగా తయారు చేశారు కూడా. ఆ రసాయనం చల్లితే ఎంత చెట్టుకయినా ఒక ఆకు కూడా మిగలకుండా రాలిపోతాయి. వియత్నాం యుద్ధంలో ఈ రసాయనాన్ని వాడి, వారి అడవులను బీళ్ళుగా మార్చారు.

విలువలను గురించి ఇక్కడ అన్వయించి, సైన్సు అంతా చెడ్డది అనడం సమంజసమవుతుందా? ఇందులో మనిషి కుయుక్తికి గొప్ప పాత్ర ఉంది. అణు శాస్త్రం, రాకెట్రీ మొదలయినవి కేవలం కుతూహలం ఆధారంగా మొదలయిన రంగాలు. ఇప్పుడుమాత్రం వాటి మంచిచెడ్డలను గురించి ప్రపంచం తలపగల కొట్టుకునే పరిస్థితి వచ్చింది.

అణువిద్యుత్తు ఒక ఎత్తు, అణ్వస్త్రాలు వాటిని ప్రయోగించడానికి వాడే రాకెట్లు మరో ఎత్తు. శాంతిప్రియులమయిన మనం కూడా అణుశక్తిని వదలడం లేదు. అగ్ని. పృథ్వి, నాగ మొదలయిన పరీక్షలు జరుగుతున్నాయి. పెద్ద దేశాలవారు మన ఈ పాటవాన్ని అనుమానంగా చూస్తున్నారు. ఇక్కడ విలువలు, వాటి మార్పులకు సైన్సు దోహదం చేసినమాట నిజమే. అయినా అందులో మనిషి నిర్ణయం ముఖ్యమయినదని మాత్రం గుర్తుంచుకోవాలి!

## మనిషి - సైన్సు :

మనిషి సైన్సును నడుపుతున్నాడా?
సైన్సు మనిషిని నడుపుతున్నదా?

జంట నగరాలలో ఆధునాతన జీవశాస్త్రం గురించి పరిశోధించే సంస్థ సి సి ఎం.బి. ఉంది. దాని ప్రారంభ సంరంభం సందర్భంగా. "సైన్సు-కళలు" అనే సదస్సునొకదాన్ని నిర్వహించారు. అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన వైజ్ఞానికులతో సహా అందులో అంతే ఖ్యాతిగల కవులు, గాయకులు, చిత్రకారులు, నర్తకులు, మొదలు అన్నిరంగాల కళాప్రతినిధులు పాల్గొన్నారు. వారందరూ అంగీకరించిన విషయం ఒకటి ఉంది. "శాస్త్రజ్ఞులు మానవాళి ప్రగతిగతిని, తద్వారా మానవాళిని శాసిస్తున్నారు" అన్నారు వారంతా, ఈ మాట ఒక రకంగా నిజమే. ఒక కాలంలో ఆర్థికబలం. అంగబలం గలవారే గొప్ప. ఆ దేశమే గొప్ప. ఇప్పుడలా కాదు. సాంకేతిక బలం అన్నింటికన్నా గొప్ప బలం. ఇందుకు ఉదాహరణలుగా ఎన్ని సందర్భాలయినా చెప్పుకోవచ్చు. (నా రచనల్లో ఈ అంశాలను చాలా చోట్ల ఎత్తి చూపించాను. ఉదాహరణకు నా పుస్తకం "విజ్ఞాన ప్రపంచం" (విశాలాంధ్ర ప్రచురణ) లోని తొలి వ్యాసం చూడండి!) అతి రహస్యంగా నడుస్తున్నాయనుకున్న చైనా, రష్యా రాజకీయ యంత్రాంగంలోని తిమనాన్మెన్ స్క్వేర్ ఉదంతం, చెర్నొబిల్ ప్రమాదాలు ప్రపంచం దృష్టికి రావడానికి సాంకేతికపరంగా ఇతర దేశాలు ప్రదర్శించిన శక్తి కారణం అంటే నమ్మకతప్పదు.

## బీద - గొప్ప :

సాంకేతిక శాస్త్రం ఈరకంగా వీరంగం చేస్తూ, బీద - ధనిక వ్యక్తుల మధ్యన, దేశాల మధ్యన పెద్ద అఖాతాలను తయారుచేస్తున్నది. ఉదాహరణగా పారిశ్రామిక రంగాన్ని గురించి చెప్పుకోవచ్చు. యంత్రాలను తయారుచేసి, వాటిలో బీదవారిని కూడా ఒక భాగంగా అమర్చుకుని, ధనిక దేశాలు సుఖం అనుభవిస్తున్నాయి. వాటిల్లోనుండి పుట్టిన హాలాహలాన్ని మాత్రమే బీదవారి నెత్తిన పోస్తున్నాయి. ఇలా మరెన్ని రంగాలో. ఈ పరిస్థితిని నండూరి రామకృష్ణమాచార్యులవారొకచోట చాలా బాగా చెప్పారు :

"యంత్రమనిన స్వీయ హస్తలాఘవమని
మురిసిపోయినాడు నరుడు తొలుత
యంత్రమిపుడు క్రూర యజమానిగా మారి
నమిలి మింగ జూచు నరులనెల్ల" అంటాడాయన.

ఇందుకు అన్నింటికంటే గొప్ప ఉదాహరణ కాలుష్యం. పారిశ్రామిక కాలుష్యానికి నిజమయిన కారకాలు ధనిక దేశాల్లోనే ఎక్కువగా ఉన్నాయి. మిగతా రకాల కాలుష్యాలు స్థానికంగా ఉండి, స్థానికంగానే ప్రభావం చూపిస్తాయి. ఈ పారిశ్రామిక కాలుష్యపు ప్రభావం మాత్రం ప్రమేయం లేనివారితో సహా అందరూ పంచుకోవలసిందే. కాలుష్యం కారణంగా మంచుకొండలు కరిగి, సముద్రాలు పెరిగి, కొన్ని ద్వీపాలు అమాంతంగా, కొన్ని తీరాలు శాశ్వతంగా మునిగిపోనున్నాయి. అందుకు ప్రబల కారణాలు మాత్రం అక్కడలేవు, మరెక్కడో ఉన్నాయి!

భోపాల్ గ్యాసు దుర్ఘటన, అణు ఇంధనం నుండి వెలువడే వ్యర్థాలను తొలగించడంలో వివిధ దేశాలు చూపుతున్న వైఖరి మొదలయినవి కూడా ఇటువంటి కోవకే చెందుతాయి.

ఇక నవీన జీవశాస్త్రం, జీవ సాంకేతిక శాస్త్రం కలిసి, సృష్టికి ప్రతిసృష్టి చేసే ప్రయత్నంలో ఉన్నాయి. మానవుడు మాతాగర్భంలోంచి కాక యంత్రం లోంచి పుట్టుకొచ్చే రోజులు దూరంగా లేవు. ఒకనాటి కల్పనలన్నీ సత్యాలవుతున్నాయి!

## విచక్షణాదృష్టి :

ఇంత జరుగుతుంటే కొందరు సైంటిస్టులకే, సైన్సుపట్ల వెగటు పుడుతున్నది. దీన్ని గురించి మనం ముందే అనుకున్నాం. ఇక సైన్సుతో ప్రమేయం లేకుండా వెలుపల ఉండే వారికి సైన్సుమీద అనుమానం, అసహ్యం కలగడం తప్పకాదేమో?

ISKON వారి భక్తి వేదాంత సంస్థవారు 1986 లో నిర్వహించిన ఒక సదస్సులో "మతం - శాస్త్ర విజ్ఞానాల సమన్వయం" గురించి దీర్ఘ చర్చలు జరిగాయి. ఆ సదస్సు తాలూకు ఒక ప్రచురణలోని ఒక భాగం మీముందు తెలుగులో ఉంచుతాను. (బ్రాకెట్లలోని మాటలను నా వ్యాఖ్యానాలుగా గమనించమనవి.)

"మానవుని నైతిక, ఆధ్యాత్మిక అభివృద్ధి, సాంకేతిక అభివృద్ధికి సమంగా లేదు. (కారణాలు అనేకం!) ఈ తేడాతో మానవ నాగరికతలో అస్థిరత చోటు చేసుకున్నది. అది అంతరిస్తుందేమోనని కూడా అనిపిస్తున్నది. ప్రజా జీవితంలో ప్రాపంచిక విలువలు తప్పితే, వీటికి ఆధారమయిన ఆధ్యాత్మిక విలువలు కనబడడం లేదు. (ఆధ్యాత్మిక అనే మాటను కొంచెం సహృదయతతో గమనిస్తే నీతి నియమాలు, ఇతర మానవతా విలువలు అందులో కనబడతా యనుకుంటాను.)

విలువలు సంకటంలో పడ్డాయనే అనిపిస్తుంది. (అనుమానం అనవసరం.) ప్రస్తుత ఆర్థిక, సాంఘిక, రాజకీయ సమస్యలకు ఈ పరిస్థితే కారణం.

మనిషి మనుగడకు, ప్రగతికి సైన్సు సాయం చేసింది. అయితే దీనితో బాటే పర్యావరణ సమస్యలు, వనరుల సమస్యలు, అణుయుద్ధం మొదలయిన భయంకర భూతాలు కూడా తలెత్తాయి. వీటివల్ల మానవతా విలువలకు, నైతిక స్థాయికి హాని కలుగుతున్నది. ఫలితంగా సైన్సు ప్రయోజనాలు శూన్యమయి కనబడుతున్నాయి. సంపూర్ణ జీవితం అంటే బాహ్యసుఖాలు ఒకటే కాదు. సైన్సు వీటిని అందించగలుగుతుంది. జీవితంలో విలువలు చాలా ముఖ్యమయి నవి. ఇవి మానవుని అంతర్గతంగా తేజోవంతుడిని చేస్తాయి. అప్పుడే పూర్ణ భావన కలుగుతుంది. ఈ విలువలను కాపాడుకోకపోతే, పైమెరుగులకు లొంగి పోయిన వాళ్ళమవుతాం!"

అదే సదస్సులో భక్తివేదాంత సంస్థ అంతర్జాతీయ అధిపతి శ్రీ టి. డి. సింగ్ (రసాయన శాస్త్రం పిహెచ్.డి.) ఇలా అంటారు:

"In Mans continued search for happiness, what is perhaps relevant, is to interlink the timeless message of religion with the vastly powerful and effective sinews of science. This will undoubtedly call for a new religion and a new science. New not in content and emphasis, but in direction."

ఆయన వెంటనే మరో మాట కూడా అన్నారు.

"Ofcource, I donot here mean religion in terms of rituals, practices or dogmas which tend to divide and weaken humanity."

నోబెల్ శాంతి పురస్కార గ్రహీత దలైలామా అంటారు:

'Compare physical pleasure and pain with mental pleasure as well as pain. The mental is more important."

కానీ సైన్సు, సాంకేతిక శాస్త్రం సృష్టించిన సరికొత్త వాతావరణంలో సుఖంగా బ్రతుకుతున్నామనుకుంటున్న మానవునికి ఈ మాటలు వినిపించడం లేదు. గానుగెద్దు జీవితంలో, తీరికగా వీటన్నింటినీ గురించి ఆలోచించే వ్యవధి లేదు.

## సైన్సు - సమాజం - మానవత :

ఇది కంప్యూటర్ యుగం, ఇందులో వేగం తప్ప మిగతా దేనికీ గౌరవం లేదు. ఇందులో విలువలు పెరిగినట్లే అనిపిస్తాయి. వసుధంతా ఒక కుటుంబం అనిపిస్తుంది. కానీ విలువలు అంత వేగంగానూ పడిపోతాయి. పక్కింటివారి పరిస్థితి మనకు పట్టదు. ఈ పరిస్థితిని అర్థం చేసుకోగలిగినవారు కించభావానికి గురి కావడం కూడా కద్దు!

ఇక దేశాల మధ్యన సంబంధాలు మరింత విచిత్రంగా ఉన్నాయి. ఇద్దరు గూండాలు పరస్పరం ఉండే భయం కొద్దీ ఒకరినొకరు గౌరవించుకునే పరిస్థితి ఇది. బడితె లేనివాడి బ్రతుకు వ్యర్థం!

అణుయుద్ధం గనుక వస్తే గెలుపూ, ఓటమి లేవు. అస్త్రం ప్రయోగించిన వాడు కూడా దానికి ఎరయి, బుగ్గయిపోతాడు. అది తెలిసి కూడా అందరూ- చివరకు చిన్న దేశాలు కూడా ఆ 'బడితె' కోసం ప్రాకులాడుతున్నారు.

ఈ ప్రపంచంలో రహస్యాలు లేవు. దేశాలకు ఎల్లలు లేవు. నాగరికతలు సంస్కృతులు కలగాపులగమవుతున్నాయి. అంతరిక్షంలో నిలబడి ప్రపంచాన్ని ప్రతి ఇంట్లోకి లాగి చూపించే ఉపగ్రహాలు ఇందుకు ఉపకరణాలు. సైనికపరంగా జరిగే గూఢచారిత్వం, బట్టబయలుగా అంతరిక్షం గుండా జరుగుతున్నది.

వీటన్నిటినీ మించినది జీవ సాంకేతిక శాస్త్రం. ఇది కొత్త జీవాలను సృష్టిస్తున్నది. అసాధ్యమనుకున్న ఆలోచనలను సాకారం చేసి ముందుంచు తున్నది. దీనివల్ల గొప్ప ప్రయోజనాలు, ఉపయోగాలున్నాయి. అయితే ఇందులోంచీ భూతాలు పుట్టవనే నమ్మకం లేదు. కూతురు కూతురుగా, అంటే మనవరాలుగా పుట్టవలసిన పిండాన్ని తన కడుపున మోసి కన్న తల్లులు ఈ రంగంవల్ల నిజమయ్యారు! ఇటువంటి ప్రయోగాలు,ప్రయత్నాలతో సామాజిక, వ్యక్తిగత సంబంధాలకు కొత్త సమస్యలు ఎదురవుతున్నాయి.

మనిషి తనకు కావలసినవన్నీ కావలసినంత, కావలసినట్లు తయారు చేసుకుని, తనంతకు తాను బ్రతుకుతుంటే, ఇక విలువలను గురించి, ఆధ్యాత్మికతను గురించి ఆలోచించే అవసరం అతనికి కనబడుతుందా? మనిషి తనలోని తనను గుర్తించినట్లయితే, అతనికి ఈ ఆలోచన కలుగుతుంది. అంతేగానీ, ఈ యాంత్రిక సమాజంలో తనూ ఒక చక్రమయి, మెదడును తాకట్టుపెట్టి తిరుగుతున్నంత కాలం పరిస్థితి అన్యాయంగానే ఉంటుంది.

సైన్సు సైన్సుగా స్థిరపడిన నాటినుండి మానవుడిని, మానవతా విలువలను మారుస్తూనే ఉన్నది. సైన్సు అతివేగంగా పెరిగింది. ఈ ప్రగతి విచక్షణా రహితంగా కొనసాగితే ఏమవుతుందో, ఆలోచించాలి!

మానవతా విలువల భవిష్యత్తు మానవుడి చేతిలో ఉంది. సైన్సుచేతిలో మాత్రం కాదు!

# PLAN NOW, FOR THAT IMPORTANT PURCHASE YOU HAVE IN MIND.



Whenever you have a lumpsum amount of cash to invest or are planning for future needs, here's the ideal scheme for you. Offering attractive returns as well as tax savings.

**POST OFFICE TIME DEPOSITS.**

- Minimum deposit Rs. 50/-. No maximum limit.
- Rates of interest.

1 Year Account 10.5%
2 Year Account 11%
3 Year Account 12%
5 Year Account 12.5%

- Interest compounded quarterly and paid annually.
- Interest exempt from tax u/s 80 L of Income Tax Act.
- Facility of premature withdrawal
- Useful as an instrument for offering as 'Security' in Government or Banks.

**POST OFFICE TIME DEPOSITS**

*For further details :*
Contact your nearest Post Office or Tahsildar at Collectorate or Dist. Savings Officer, National Savings or authorised agents.

**COMMISSIONER**
Small Savings, 5th Floor,
Insurance Building,
Tilak Road, Abids,
Hyderabad - 500 001.
Phone: 234412

*Fill and mail to the Commissioner today*

I would like to know more about the scheme. Please send me all details.

Name : ..........................................

Address : ..........................................

..........................................

Scheme : ..........................................

**YOUR SECURITY IS OUR INTEREST**